## సరదాగా....

### ఒక ప్రశ్న?

రాఘవ ఆదరాబాదరాగా పార్కులోకి అడుగు పెట్టాడు. ఇప్పటికే వాడు వచ్చేసి ఉంటాడు. లేట యిందని వాయించేస్తాడో ఏమో అనుకుంటూ రాజారాం కోసం పార్కు మొత్తం వెదికాడు. చివరికి ఒక చెట్టు కింద కూర్చుని కనిపించాడు రాజారాం. దగ్గరగా వెళ్ళి, 'సారీరా లేటయింది' అంటూ సంజా యిషీ ఇచ్చుకోబోయాడు రాఘవ. అయితే అతని వంక చూడనుకూడా చూడలేదు రాజారాం. అతని మాటలు కూడా వినిపించినట్టు లేదు. పెన్నుతో పేపర్లో ఏదో దీక్షగా చేస్తున్నాడు. ఏం చేస్తున్నాడో చూద్దామని పేపర్లోకి తొంగిచూసిన రాఘవకి, రాజారాం సుడోకు పజిల్ పూర్తిచేయటం కనిపిం చింది. ఒరేయ్...అంటూ భుజం తట్టాడు రాఘవ. తలెత్తి చూసి, ఈరోజు పొద్దున సుడోకు చేయటం కుదరలేదురా... అందుకే ఇప్పుడిలా...అంటూ మళ్ళీ పజిల్ పూర్తిచేయటంలో మునిగిపోయాడు. పజిల్



లోని గడులన్నీ పూర్తిగా నింపేసి, అయిపోయిందిరా.. ఇప్పుడు చెప్పు, ఏంటి కబుర్లు అంటూ మొదలెట్టాడు. ఏం లేవు అంటూ రాజారాం పక్కన చతికిల పడ్డాడు రాఘవ.

అయితే ఒక పనిచేద్దాం. నేను నీకో సుడోకు పజిల్ ఇస్తాను, దాన్ని నువ్వు పూర్తిచేయ్ అంటూ పెన్నూ పేపరూ తీసుకుని సుడోకు బాక్స్ గీశాడు. ఈ బాక్స్‌లో *1* నుంచి *6* వరకు అంకెలను నింపాలి. అడ్డంగా చూసినా, నిలువుగా చూసినా అంకెలు రిపీటవ్వకూడదు. అదేవిధంగా ఈ బాక్సులో లింక్ ఉన్న గళ్ళు ఉన్నాయి. ఏ ఏ గళ్ళకయితే లింకులు న్నాయో, ఆ గళ్ళలో ఒకే అంకె ఉండాలి. ఇవీ రూల్సు. ఇక పూరించు నీదే ఆలస్యం అన్నట్టుగా పేపరూ, పెన్నూ రాఘవకిచ్చి, తనవెంట తెచ్చుకున్న పుస్తకం లోకి తలదూర్చేశాడు రాజారాం. రాఘవ పజిల్ పూర్తిచేసి రాజారాంకి చూపించాడు. మరి మీరు కూడా మీకిచ్చిన పజిల్ బాక్సుని పూరించండి.



## తీన్‌మార్















## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: పూజాహెగ్డే
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
*నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33.* email: navyaweekly@andhrajyothy.com





### సారీసర్!

**యా**వజ్జీవ కారాగారశిక్ష పడిందతనికి. ఏ పనీ లేకుండా జైల్లో కూర్చోవడం విసుగు అన్పించింది. అప్పుడు ఓ చీమను పట్టుకున్నాడతను. దానికి కొన్ని ట్రిక్స్ నేర్పాడు. ఎగరడం, దొర్లడం, పిల్లిమొగ్గలు వేయడం లాంటివి నేర్పాడు. కొన్నాళ్ళకు అతను ఎలా చెబితే అలా చీమ చేసేలా తర్ఫీదు ఇచ్చాడు. ఇంతలో అదృష్టం కలిసొచ్చి అతను జైలు నుంచి విడుదల అయ్యాడు. విడుదల అయినప్పుడు చీమను వదలి పెట్టలేదతను. దానిని అగ్గిపెట్టెలో పెట్టుకుని వెంట తెచ్చుకున్నాడు. బార్‌కి వచ్చాడు. బార్‌లో మందు తాగుతూ ఎదురుగా కూర్చున్న వ్యక్తికి తన గొప్ప తనం చూపించేందుకు అగ్గిపెట్టెను తెరిచాడు. అందులో నుంచి చీమను తీసి చెప్పాడిలా.

"ఇది నేను ఎలా చెబితే అలా చేస్తుంది తెలుసా?"

"ఏది చూపించండి" ఉత్సాహపడ్డాడు ఎదుటి వ్యక్తి.

తను నేర్పిన ట్రిక్కులన్నీ చీమచేత చేసి చూపించాడతను.

చూసి ఎదుటివ్యక్తి ఆశ్చర్యపోయాడు.

"ఈ చీమతో మీరు చాలా డబ్బు సంపాదించే అవకాశం ఉంది. చీమ ఇలాంటి పనులు చేస్తున్న దంటే టికెట్ ధర ఎంత పెట్టినా చూస్తారు." అన్నాడు.

ఎదుటివ్యక్తి ఆశ కల్పించేసరికి ఆనందాన్ని తట్టుకోలేకపోయాడు మనవాడు. అటుగా వెళ్ళిపోతున్న బేరర్‌ని పిలిచాడు.

"ఇదిగో! నిన్నే! వచ్చి ఈ చీమను చూడు." కేకేశాడు.

"సారీసర్! ఇంకెప్పుడూ ఇలా జరగదు." అన్నాడు బేరర్. చీమను చేత్తో గట్టిగా నలిపి ఎంచక్కా వెళ్ళిపోయాడు అక్కణ్ణుంచి.

### తాళం

అర్ధరాత్రి. తలుపులు దబదబా బాదుతోంటే తెరిచి, ఏడుస్తున్న బాబుసహా ఎదురుగా నిల్చున్న పెద్దమనిషిని చూశాడు డాక్టర్ రాజారాం.

'ఏంటయ్యా, ఏం జరిగింది?"

'మా అబ్బాయి ఇంటితాళం చెవి మింగేశాడు సార్! మీరు ఎలాగైనా ఆ చెవిని కక్కించాలి."

"ఎప్పుడు మింగాడు?"

"మింగి పదిరోజులైంది సార్"

'పదిరోజులైతే ఇప్పుడా తీసుకుని రావడం?"

"డూప్లికేట్ ఇప్పుడే పోయిందిసార్."

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 29

20-9-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# జాంపండు

జాంపండు అంటే జాంపండే! జాంపండంటే జానకిరావుకూడా. జానకిరావును అగ్రహారంలో జాంపండనే పిలుస్తారు. అరవై ఏళ్ళ జానకిరావును 'రావుగారు' అని ఇంతవరకూ ఎవరూ పిలవలేదు. పిలిస్తే బాగుణ్ను! పొంగిపోతాడతను.

ఇంటిముందు నిలబడి 'జాంపండు' అంటే చాలు! వస్తున్నా అంటాడు జానకిరావు. ఆకలి అంటే చాలు! అర చేతిలో ఇంత జాంపండు పెడతాడు. తిను అంటాడు. విరోచనాలు జాంపండూ! పొద్దుటినుంచీ ఝాడించి కొడుతున్నాయంటే జాంకాయ చేతిలోపెట్టి తిను అంటాడు. గంటలో కడతాయి. కంగారుపడకు అంటాడు. పిల్లకు పెళ్ళిచేద్దామనుకుంటున్నాం జాంపండూ! అమ్మాయి కొంచెం నలుపంటున్నారు. వెనక్కి తగ్గుతున్నారంటే... రోజుకో జాంకాయ తినిపించు! ఆర్నెల్లలో అమ్మాయి మెరిసిపోతుంది. నలుపులో మెరుపంటే కుర్రకారు తెగముచ్చటపడతారంటాడు. జానకిరావు చెప్పేవన్నీ నిజాలే! జాంపండు తింటే విరోచనాలు కడతాయి. అలాగే అవి చర్మసౌందర్యాన్ని కూడా పెంచుతాయి. ఈ విషయాలు డాక్టర్ కాబట్టి తనకు తెలుసు, డాక్టర్‌కాదు కాబట్టి జానకిరావుకి తెలియదనుకోవడం పొరపాటు అంటుంది జానకి. ఎలా తెలుసుకున్నాడో, తెలుసుకున్నాడు. ఎక్కడ చదువుకున్నాడో చదువుకున్నాడు. మంచి పనే చేస్తున్నాడు అంటుందామె. జాంపండు అగ్రహారం చేసుకున్న అదృష్టం అంటుంది.

అప్పుడెప్పుడో చాలా ఏళ్ళక్రితం జానకిరావు తల్లిదండ్రులు కాశీకి వెళ్ళారు. రెండు జామమొక్కలతో తిరిగొచ్చారు. వాటిని అలహాబాద్‌లో ఎవరో ఇచ్చారట! ఒకటి ఎర్రజామ. ఇంకొకటి తెల్లజామ. రెంటినీ ఇంటిపెరటిలో నాటి, రోజూ ఇన్ని నీళ్ళుపోశారో లేదో కొన్నాళ్ళకవి అంతెత్తున పెరిగాయి. ఇంతింతకాయల్ని కాశాయి. పెళ్ళీపెటాకులూ లేని జానకిరావూ, అతని తల్లిదండ్రులూ ఎన్నని తింటారు? తిన్నన్ని తిని, మిగిలినవి పంచడం మొదలుపెట్టారు. మామూలుగా ఇస్తే ఏదైనా చులకనే! 'మందు'గా ఇస్తేనే పరువూ ప్రతిష్ఠా! జాంపండును 'మందు'ను చేశాడప్పుడు జానకిరావు. అలా 'జాంపండు' అయ్యాడతను.



జాంపండులో సి విటమిన్ ఎక్కువ. యాంటీ ఆక్సిడెంట్‌గా అద్భుతంగా పనిచేస్తుంది. ఇందులో కాపర్ ఉంది. ఇది థైరాయిడ్‌గ్రంథిని క్రమబద్ధీకరిస్తుంది. అలాగే జామలో ఉన్న బి3, బి6 విటమిన్లు, మెదడు, నరాల పనితీరుని ప్రభావితం చేస్తాయి. మూర్ఛకి కూడా ఇది మంచిమందు. ఎర్రజామలో లైకోపీన్ అధికం. ఇది జీవక్రియ వేగానికీ, పర్యావరణకాలుష్యం నుంచి శరీరాన్ని కాపాడడానికీ బాగా ఉపయోగపడుతుంది. అధికంగా పీచు, తక్కువ గ్లైసెమిక్ ఇండెక్స్‌ల కారణంగా జామ మధుమేహులకు ఎంతో మేలుచేస్తుంది. బీపీ, హృద్రోగాలతో బాధపడేవారికి ఇందులోని ఎలక్ట్రోలైట్లు మందులా పనిచేస్తాయి. జామలోని ఫోలిక్ ఆమ్లం, గర్భిణులకి మేలు చేస్తుంది. ఇందులోని విటమిన్ ఎ కంటి చూపును మెరుగుపరుస్తుంది. తరచూ జలుబు, దగ్గుతో బాధపడేవాళ్ళు జామకాయలు తింటే, తగ్గుముఖం పడతాయి. పంటి నొప్పులకీ, వాపుకి కూడా జామ మంచిమందు. దీన్ని నూరి గాయాలకీ, పుండ్లకీ రాస్తే నయమవుతాయి.

జానకిరావును కదిపితే చాలు! వ్యాసం చదివినట్టుగా వినిపిస్తాడన్నీ. జామ గొప్పతనాన్ని రాత్రీపగలూ కీర్తిస్తాడు. అదో సరదా అతనికి. ఆ సరదానే జానకిని అతనికి దగ్గరచేసింది. ఏభై ఆరేళ్ళుంటాయామెకు. పెళ్ళికాలేదు. పెళ్ళికాలేదంటే చేసుకోలేదామె. నచ్చినవాడు దొరకలేదింతకాలం. ఇప్పుడు దొరికాడు. అతనే జానకిరావు. ప్రపోజ్‌చెయ్యాలి. ఎలా? ఓరోజు జానకిరావు ఇంటిముందు నిలిచిందామె. 'రావుగారూ' అని పిలిచింది. ఆ పిలుపుకోసమే చూస్తున్నాడు జానకిరావు. పరుగుపరుగున వచ్చాడతను. అరచేయిజాచింది జానకి. అనారోగ్యం చెబితే మందుగా చేతిలో జాంపండు పెట్టేవాడు జానకిరావు. చెప్పలేదామె. అతన్నే చూస్తూ నిల్చుంది. ఏం చెయ్యాలో తెలియక జానకి చేతిలో చేయి వేశాడు జానకిరావు. అంతే! ఆ చేతిని గట్టిగా పట్టుకుని ముందుకు నడిచిందామె. గుమ్మం దగ్గరకు వచ్చింది. కుడికాలు పెట్టి ఇంట్లోనికి ప్రవేశించింది. ఇప్పుడు ఆ ఇంట్లో రెండు జామచెట్లు, ఇద్దరు డాక్టర్లు. అదీకథ.




**బుధవారం: 13 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** అష్టమి రా. 10.48 తదుపరి నవమి

**నక్షత్రం:** రోహిణి ఉ. 6.28, మృగశిర తె. 5.00 వరకు

**వర్జ్యం:** ఉ. 11.43 నుంచి 1.13 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 11.47 నుంచి 12.36 వరకు

**అమృతఘడియలు:** రా. 8.45 నుంచి 10.15 వరకు

**రాహుకాలం:** మ. 12.00 నుంచి 1.30 వరకు

**సూర్యోదయం:** 6.07

**సూర్యాస్తమయం:** 6.16

**గురువారం: 14 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** నవమి రా. 8.37 తదుపరి దశమి

**నక్షత్రం:** ఆరుద్ర తె. 3.35 తదుపరి పునర్వసు

**వర్జ్యం:** మ. 12.54 నుంచి 2.24 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 10.10 నుంచి 10.58 వరకు, మ. 3.01 నుంచి 3.50 వరకు

**అమృతఘడియలు:** సా. 6.11 నుంచి 7.41 వరకు

**రాహుకాలం:** మ. 1.30 నుంచి 3.00 వరకు

**సూర్యోదయం:** 6.07

**సూర్యాస్తమయం:** 6.15

**శుక్రవారం: 15 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** దశమి రా. 6.30 తదుపరి ఏకాదశి

**నక్షత్రం:** పునర్వసు రా. 2.16 తదుపరి పుష్యమి

**వర్జ్యం:** మ. 2.55 నుంచి 4.26 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 8.33 నుంచి 9.21 వరకు, మ. 12.35 నుంచి 1.24 వరకు

**అమృతఘడియలు:** రా. 12.00 నుంచి 1.31 వరకు

**రాహుకాలం:** ఉ. 10.30 నుంచి 12.00 వరకు

**సూర్యోదయం:** 6.07

**సూర్యాస్తమయం:** 6.14

**శనివారం: 16 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** ఏకాదశి సా. 4.31 తదుపరి ద్వాదశి

**నక్షత్రం:** పుష్యమి రా. 1.05 తదుపరి ఆశ్లేష

**వర్జ్యం:** ఉ. 9.52 నుంచి 11.23 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 6.07 నుంచి 6.56 వరకు

**అమృతఘడియలు:** రా. 7.00 నుంచి 8.32 వరకు

**రాహుకాలం:** ఉ. 9.00 నుంచి 10.30 వరకు

**సూర్యోదయం:** 6.07

**సూర్యాస్తమయం:** 6.14

**ఆదివారం: 17 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** ద్వాదశి మ. 2.42 తదుపరి త్రయోదశి

**నక్షత్రం:** ఆశ్లేష రా. 12.07 తదుపరి మఖ

**వర్జ్యం:** మ. 1.22 నుంచి 2.54 వరకు

**దుర్ముహూర్తం:** సా. 4.36 నుంచి 5.24 వరకు

**అమృతఘడియలు:** రా. 10.34 నుంచి 12.07 వరకు

**రాహుకాలం:** సా. 4.30 నుంచి 6.00 వరకు

**సూర్యోదయం:** 6.07

**సూర్యాస్తమయం:** 6.13

**సోమవారం: 18 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** త్రయోదశి మ. 1.08 తదుపరి చతుర్దశి

**నక్షత్రం:** మఖ రా. 11.23 తదుపరి పుబ్బ

**వర్జ్యం:** ఉ. 11.45 నుంచి 1.18 వరకు

**దుర్ముహూర్తం:** మ. 12.34 నుంచి 1.22 వరకు, మ. 2.59 నుంచి 3.47 వరకు

**అమృతఘడియలు:** రా. 9.04 నుంచి 10.37 వరకు

**రాహుకాలం:** ఉ. 7.30 నుంచి 9.00 వరకు

**సూర్యోదయం:** 6.07

**సూర్యాస్తమయం:** 6.12

**మంగళవారం: 19 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, బహుళపక్షం**

**తిథి:** చతుర్దశి ఉ. 11.53 తదుపరి అమావాస్య

**నక్షత్రం:** పుబ్బ రా. 11.01 తదుపరి ఉత్తర

**వర్జ్యం:** ఉ. 7.16 నుంచి 8.51 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 8.32 నుంచి 9.21 వరకు, రా. 10.06 నుంచి 10.52 వరకు

**అమృతఘడియలు:** సా. 4.43 నుంచి 6.17 వరకు

**రాహుకాలం:** మ. 3.00 నుంచి 4.30 వరకు

**సూర్యోదయం:** 6.08

**సూర్యాస్తమయం:** 6.11

## మెయిల్ బాక్స్

### మొదటిపేజి అద్భుతం

వినాయకచవితి ముఖచిత్రం సంచిక కోటి కాంతులు మోసుకొచ్చింది. నువ్వు ప్రేమించినవన్నీ నీకు కాకుండా పోవడం సహజం. అయితే అంతే సహజంగా అవన్నీ అంతో ఇంతో తేడాతో నీ ప్రేమ కోసం మళ్ళీ తిరిగివస్తాయి అని జగదానందస్వామి చిన్నితల్లికి, మొదటిపేజి 'నిరీక్షణ'లో తెలియజేసిన తీరు అద్భుతం. అమెరికా సరిహద్దుల్లో కూడా చవితి సంబరాలు చేస్తారని తెలుసుకున్నాం. బహుమతి పొందిన కథలు 'ఎలుక లుకలుకలు, 'పల్లెకు పోదాం' రెండూ బాగున్నాయి.

—జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి, తూ.గో.జిల్లా

### కళ్ళు చెమర్చాయి

వినాయకచవితి ముఖచిత్ర సంచిక సుందరంగా ఉంది. మార్నింగ్‌కాఫీ నిజంగా కాఫీ తాగిన అనుభూతినిచ్చింది. సరసి కార్టూన్‌తోపాటు ఆయన కథ 'ఎలుక లుకలుకలు' నవ్వు రప్పించింది. 'పల్లెకు పోదాం' కథ చదువుతుంటే కళ్ళు చెమర్చాయంటే నమ్మండి. పల్లెటూర్లో నేచురల్ లైఫ్‌ను ఎంజాయ్ చేయడంలో నిజంగా ఎంతో ఆనందం ఉంది. 'అన్వేషణ' సీరియల్ బాగుంది. ఫిదా సినిమా హీరోయిన్ సాయిపల్లవి ఆలోచనలతో మనస్ఫూర్తిగా ఏకీభవిస్తాం. డబ్బే ముఖ్యంకాదు, ఆశయం ముఖ్యం. మంచి శీర్షికలు అందిస్తున్న నవ్య వీక్లీకి హృదయపూర్వక అభినందనలు.

—ఎస్.శివనారాయణ, నెల్లూరు

### సాటిలేని సరసి

'ఎలుక లుకలుకలు' వంటి కథావస్తువును సరసిగారుతప్ప మరొకరు రాయలేరని కుండబద్దలుకొట్టినట్టు చెప్పగలను. సరసిగారూ, 'మీకు మీరే సాటి. లేరు మీకు పోటీ. ఇటువంటి ఆలోచనలు మీకెలా వస్తాయో!' అనుకుని ఆశ్చర్యపోతాను. ఆయనకు నా అభినందనలు.

—ప్రొఫెసర్ నరసయ్య పంజాల, హైదరాబాద్

### మెరిసిన మార్నింగ్ కాఫీ

గణేశుని భంగిమలు ఆనందపరచాయి. మార్నింగ్ కాఫీలో పిచ్చాసుపత్రి, హాయి మెరిశాయి. పెద్ద కథలు చదివినంత తృప్తి కలిగింది. మొదటిపేజి నిరీక్షణ ఉద్విగ్నత, మనిషి మనస్సును బంధించే తీరు, ఆరగల కాలంకోసం ఎదురుచూసే స్వభావం పూర్ణత్వాన్నిచ్చింది. లాకర్ నెం 369 సీరియల్ కథాసంవిధానం, పోకడ ఆసక్తికరంగా ఉన్నాయి. విదేశాల్లో వినాయకపూజా విధానాలు సంతోషలక్ష్మి బాగా వివరించారు. సరసి, బాచి కార్టూన్లు విషయపరంగా రక్తికడుతున్నాయి.

—డాక్టర్ శివభూషణం, కర్నూలు

### రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారానికి ఆహ్వానం

*రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారం-2017 ఎంపిక కోసం 2015, 2016, 2017 సంవత్సరాలలో ప్రచురించిన తెలుగు కవితా సంపుటాలు పంపించాలని రంగినేని సుజాత మోహనరావు ఎడ్యుకేషనల్, ఛారిటబుల్ ట్రస్టు అధ్యక్షులు రంగినేని మోహనరావు, కన్వీనర్ మద్దికుంట లక్ష్మణ్ ఒక ప్రకటనలో రచయితలను కోరారు.*

*ఎంపికైన కవితా సంపుటానికి 15వేలు నగదు, జ్ఞాపిక, శాలువ, పురస్కారం అందజేస్తారు. అక్టోబరు 31వ తేదీలోపు ఐదు ప్రతులు వంతున ట్రస్టు పేరిట బాలాజి నగర్, సిరిసిల్ల-505301, రాజన్న సిరిసిల్ల జిల్లా చిరునామాకు పంపాలి. వివరాలకు **సెల్: 9441677373** ను సంప్రదించాలి.*

## ఇదోరకం రెజ్లింగ్

మనకు కోడిపందాలు, గుర్రప్పందాల గురించి తెలుసు. కానీ ఆక్టోపస్‌తో జరిగే పందెం గురించి ఎప్పుడైనా విన్నారా? అవును ఆక్టోపస్‌తో రెజ్లింగ్ పోటీలు నిర్వహించేవారు అప్పట్లో. కానీ ఇప్పుడు ఆక్టోపస్‌ల సంరక్షణ దృష్ట్యా ఆ పోటీలు నిషేధించారు. మరి ఆ విచిత్రమైన కుస్తీ పోటీ గురించి మీరూ తెలుసుకోండి!

అమెరికాలోని వాషింగ్టన్ సమీపంలో ఉన్న పుగెట్ కాల్వ ఒడ్డుకు జనం తండోప తండాలుగా  చేరుకున్నారు. ఎందుకంటే అక్కడ రెజ్లింగ్ పోటీలు జరగనున్నాయి. పోటీ జరిగే సమయం ఆసన్నమైంది. వేలాదిగా వచ్చిన ప్రేక్షకుల్లో నరాలు తెగే ఉత్కంఠ, ఈ సంవత్సరం గెలుపు ఎవరిదో అని. ఇంతకీ ఈ ఉత్కంఠభరితమైన కుస్తీపోటీలు ఎవరెవరి మధ్యో తెలుసా? మనుషులకు, ఆక్టోపస్‌లకు మధ్య! వాటితో ధైర్యంగా పోరాడి ఎవరైతే వాటిని ఒడ్డుకు తీసుకువస్తారో అతడే విజేత. ఆక్టోపస్‌లతో కుస్తీ పట్టడమేంటి, ఆ కుస్తీపోటీలను చూడడానికి వేలాదిగా జనం తరలి రావడమేంటనేగా మీడౌట్!



మొదటగా 1940వ సంవత్సరంలో అమెరికాలో ప్రారంభమైన ఈ ఆట తర్వాత కాలంలో ప్రపంచ వ్యాప్తంగా ప్రాచుర్యం పొందింది. 'అక్టోపస్ రెజ్లింగ్ ఛాంపియన్ షిప్' అనే పేరిట  ఆక్టోపస్‌లతో ప్రపంచ స్థాయి పోటీలను నిర్వహించే స్థాయికి ఈ పోటీ ఎదిగింది. ఇంతకీ దీన్ని ఎలా ఆడుతారనే సందేహం వస్తోందా? ముందుగా దాదాపు 30 నుంచి 50 అడుగులు లోతు ఉండే  ఓ జలాశయంలోకి వివిధ రకాల బరువులు ఉండే కొన్ని ఆక్టోపస్‌లను వదులుతారు. ముగ్గురుసభ్యుల బృందం నీళ్లలోకి దిగి వాటిని బంధించి ఒడ్డుకు తీసుకు రావాలి. అలా ఎవరైతే ముందుగా ఎక్కువ బరువున్న ఆక్టోపస్‌ను ఒడ్డుకు తీసుకువస్తారో వారే విజేత.

ఈ ఆక్టోపస్ రెజ్లింగ్‌లో మళ్లీ రెండు రకాలు ఉన్నాయి. ఒక పద్ధతిలో ఆయుధం ఏదైనా ఉపయోగించి ఆక్టోపస్‌ను బంధిస్తే, ఇంకో విధానంలో ఆయుధం లేకుండా చేతులనే ఆయుధంగా ఉపయోగించి పోరాడి బంధించాలి. ఇంకో విశేషం ఏంటంటే ఆయుధంలేకుండా పోరాడితే వచ్చిన పాయింట్లకన్నా రెట్టింపు పాయింట్లను ఈ పద్ధతిలో పొందవచ్చు. సముద్రంలో నివసించే ఆక్టోపస్ క్రూరజీవి కాదు. వీటికి ఉండే వేళ్లలాంటి నిర్మాణాలను(టెంటకిల్స్) పట్టుకొని ఊపిరి ఆడకుండా చేస్తే సులభంగా పట్టుబడుతుంది. వాటిపై దాడి చేసినప్పుడు తమ టెంటకిల్స్‌తో క్రీడాకారుడిపై ఎదురుదాడికి దిగుతాయి. వాటికి దొరక్కుండా తప్పించుకుంటూ బంధించాల్సి ఉంటుంది. అత్యవసర సమయంలో వాటి టెంటకిల్స్‌ను కూడా సులభంగా నరికేయవచ్చు. ఇక చివరికి వారు బంధించి ఒడ్డుకు తెచ్చిన ఆక్టోపస్‌ను తూకం వేసి విజేతను ప్రకటించిన అనంతరం వండుకుని తినేస్తారు. లేదంటే దగ్గర్లోని అక్వేరియంలో విడిచిపెడతారు.

1957లో మొట్టమొదటిసారిగా ప్రపంచస్థాయి ఆక్టోపస్ ఛాంపియన్ షిప్ పోటీలు నిర్వహించారు. అప్పుడు ఈ పోటీలు వీక్షించడానికి కేవలం 200 మంది మాత్రమే హాజరయ్యారట. ఆ తర్వాత 1963లో అమెరికాలో జరిగిన 'వరల్డ్ ఆక్టోపస్ రెజ్లింగ్ ఛాంపియన్ షిప్'లో 25 కిలోల ఆక్టోపస్‌ను బంధించి ఓ వ్యక్తి ఒడ్డుకు తీసుకొచ్చారు. ఈ పోటీల్లో ఉంచిన అతిపెద్ద ఆక్టోపస్ బరువు 30 కేజీలు. ఈ క్రీడ ఎంత వేగంగా జనాదరణ పొందిందో అంతే వేగంగా కనుమరుగైపోయింది. ఆక్టోపస్‌లను అకారణంగా హింసిస్తున్నారన్న కారణంగా 1976 సంవత్సరంలో అమెరికా ప్రభుత్వం ఈ క్రీడపై నిషేధం విధించింది.

నవ్య



# శ్రీమతికి ఓ బహుమతి

**ఆలుమగలన్నాక చిన్న చిన్న గొడవలు, అలకలు రావడం సహజం. భార్య ఏం చేసినాసరే చిన్నచూపు చూస్తారు కొందరు భర్తలు. ఎప్పుడూ ఏదీ మెచ్చుకోరు సరికదా తను చేసే ప్రతి పని గురించి వ్యంగ్యంగా మాట్లాడతారు. ఇలా ఒకటి రెండుసార్లు జరిగితే పర్వాలేదు కానీ ప్రతిసారీ ఇలా నెగెటివ్‌గా మాట్లాడే భర్తలపట్ల భార్యలు అసంతృప్తికి లోనయ్యే అవకాశం ఉంది. ఇద్దరి మధ్య ఎప్పుడైనా ఏదైనా గొడవ జరిగినప్పుడు, ఎప్పుడైనా కనీసం ఇది బాగుంది, అది బాగుందంటూ మెచ్చుకున్నావా? అంటూ ఓ మాట అనేస్తారు. ఈ మాటలయుద్ధం చివరికి చినికిచినికి గాలివానలా తయారవుతుంది. ఈ గొడవలవల్ల ఇద్దరిమధ్యా అనుబంధం బీటలువారే ప్రమాదమూ లేకపోలేదు.**

**ఆలుమగల మధ్య అనుబంధం మరింత పదిలం కావాలంటే ఇద్దరిమధ్య అవగాహన మాత్రమే కాదు, అప్పుడప్పుడూ వారిరువురి మధ్య అభినందనలు కూడా చాలా అవసరం అంటున్నారు రిలేషన్‌షిప్ నిపుణులు. ముఖ్యంగా భార్యని అభినందించడం ద్వారా అనుబంధాన్ని మరింత పదిలపర్చుకోవచ్చునంటున్నారు. నిరంతరం భర్త శ్రేయస్సుకోసం పాటుపడే భార్యని గౌరవించాలనీ, తనుచేసే పనిని ప్రేమించి తనకు అభినందనలు తెలియజేయాలన్న ఉద్దేశంతో భార్యల అభినందనల దినోత్సవం (వైఫ్ అప్రిసియేషన్ డే) ప్రతి సంవత్సరం సెప్టెంబర్ నెల మూడో ఆదివారంనాడు జరుపుకుంటున్నాం. అందుకే భార్యను ఎలాంటి మాటలతో అభినందించవచ్చో, ఆమెను ఎలా సంతోషపెట్టవచ్చో మీరూ తెలుసుకోండి!**

భార్య తప్పు లేకున్నా కొందరు భర్తలు ఊరికే ఆమెను కోప్పడుతుంటారు. ఇక శ్రీమతి ఏదైనా హెల్ప్ చేసినా తనకేంటి నేను కృతజ్ఞతలు తెలిపేది, నేనెందుకు అపాలజీ చెప్పాలి అని భీష్మించుకుని కూర్చుంటారు. కానీ అది మంచిపద్ధతి కాదంటున్నారు రిలేషన్‌షిప్ నిపుణులు. తప్పుచేసినప్పుడు భార్యని దగ్గరకు తీసుకుని సారీ చెప్పడం వల్ల అనుబంధం మరింత పదిలమవుతుందట. అంతేకాదు, భార్య ఏదైనా మంచిపని చేసినప్పుడు బాగుందని చెప్పడం సారీ, థాంక్యూలాంటి పదాలు చెప్పడం వల్ల ఒకరిపై ఒకరికి అవగాహన మరింత పెరుగుతుంది. ఇక ఇలాంటివి కేవలం నోటిమాటగా కాకుండా కాస్త వినూత్నంగా చెప్పడంద్వారా కూడా భార్యలు సర్‌ప్రైజ్ ఫీలవ్వడమే కాదు, హ్యాపీగా కూడా ఉండేందుకు అవకాశాలున్నాయి.

## పొగడ్తకు కారణం చెప్పండి

కొందరు భర్తలు భార్యను పొగడాలనుకుంటారు. కానీ, 'ఆ ఏముంది ఇప్పుడు చెప్పడానికి, ఇప్పుడు చెప్పకపోతే వచ్చే నష్టం ఏంటి? చెబితే లాభం ఏంటి? అయినా పొగిడితే నెత్తికెక్కి కూర్చుంటారు....' లాంటి ఆలోచనలతో మనసులో భార్యపై పొగడ్తలు కురిపించాలనుకున్నా కామ్‌గా ఉండిపోతారు. మరికొందరేమో ఎలా పొగడాలో తెలియక, పొగిడితే ఎలా రియాక్టవుతుందో తెలియని సంశయంతో మనసులోనే ప్రశంసిస్తారు. కానీ మీరు ఆమెని అమితంగా ఇష్టపడుతున్నారన్న విషయం ఆమె ఎలా తెలుసుకుంటుంది చెప్పండి.

భార్యలో ఉన్న మంచిగుణాలు గుర్తించి వాటిని ఆమెతో షేర్ చేసుకోండి. పొగడ్త, అభినందన అనగానే ప్రతి చిన్న విషయానికి అవసరం లేకున్నా కూడా అభినందించాలని కాదు. మీరు ఆమెని పొగుడుతున్నారంటే అది ఎందుకన్న విషయం కూడా వారికి విడమర్చి చెప్పాలి. దీని వల్ల వారు మరింత సంతోషపడతారు. మరోసారి మీ మెప్పు, ప్రశంసలు పొందడానికి ఏ పనిచేసినా మరింత శ్రద్ధతో బాగా చేయడానికి ప్రయత్నిస్తారు.

## పాజిటివ్‌గానే ఆలోచించండి

భార్య ఏం చేసినాసరే, కొందరు అది బాగోలేదు, ఇది బాగోలేదంటూ వంకలు పెడుతుంటారే తప్ప, ఆ పని చేయడంకోసం వారు ఎంత కష్టపడ్డారో తెలుసుకోరు. అలా కాకుండా ఒకవేళ వారు చేసింది బాగాలేకున్నా ఆ విషయం ముందుగానే నేరుగా చెప్పకుండా, ఈ పని చేయడానికి నువ్వెంతో కష్టపడ్డావు, బాగా ట్రై చేశావు అని పాజిటివ్‌గా చెప్తూ, లోపాలేంటో వివరించడంవల్ల మరోసారి చేసేటప్పుడు మరింత బాగా చేస్తారు. అంతే తప్ప ముందే నెగెటివ్‌గా మాట్లాడితే హర్ట్ అయ్యే అవకాశం ఉంది.

## సర్‌ప్రైజ్ గిఫ్ట్

భార్యను అభినందించాలంటే పెద్ద పెద్ద గిఫ్ట్‌లేమీ ఇవ్వక్కర్లేదు. సందర్భాన్నిబట్టి ఓ రోజా, చాక్లెట్ లేదా తనకిష్టమైన వస్తువో తీసుకెళ్లి సర్‌ప్రైజ్ గిఫ్ట్‌గా అందించవచ్చు. గిఫ్ట్ చిన్నదా పెద్దదా అని కాదు, మనస్ఫూర్తిగా ఇవ్వండి చాలు. మీరు చేసే పని చిన్నదే అయినా అది ఆమెకెంతో సంతోషాన్ని అందిస్తుంది. దీనివల్ల వారికి మీపై ప్రేమ, అనురాగం

మరింత పెరుగుతుంది.

## ఐ లవ్యూ చెప్పాలి

ఒకరిపై ఒకరికి ఎంత ప్రేమున్నా దాన్ని వ్యక్తపరచడం కూడా ముఖ్యమే. ఈ ప్రేమను వ్యక్తపరచుకోవడంలో దంపతులకు ఉపయోగపడే మూడుపదాల మంత్రం ఒకటుంది. పైగా అది పూర్తిగా ఉచితం. అదేంటో తెలుసా ఐ లవ్యూ. అవును మీ ఇష్టసఖి ఎప్పుడన్నా చిర్రుబుర్రులాడినా లేక మీపై అలకపూనినా ఐలవ్యూ అని చెప్పండి. ఈ త్రీ మ్యాజికల్ వర్డ్స్ వింటే మీ సఖి ఇట్టే కరిగిపోతుంది. దానితోపాటు చిన్న గులాబీ పువ్వు ఇవ్వడం, ఎక్కడికైనా తీసుకెళ్లడం లాంటివన్నీ మీ హృదయబంధాన్ని మరింత గట్టి పరుస్తాయి.

## ఇలా ఇంప్రెస్ చేసేయండి

మగువలు కొన్ని విషయాలను దూరంపెట్టి అసలు బతకలేరు. అవి ఏంటంటే పొగడ్త. ప్రతి అమ్మాయీ తనని ఇష్టపడేవాడు ఆరాధించాలని కోరుకుంటుంది. అందుకు తగినట్లుగానే తనకు నప్పే డ్రెస్ సెలెక్ట్ చేయడంతో పాటు ఏదైనా డిఫరెంట్‌గా రెడీ అయినప్పుడు, 'నువ్వు చాలా అందంగా కనిపిస్తున్నావు' అంటూ పొగడండి.

## నీవే నా ఏంజెల్

భర్త జీవితంలో తానొక ప్రత్యేకం అనే ఫీలింగ్‌లో ఉంటుంది ప్రతి భార్య. ముఖ్యంగా పడకగదిలో భార్యలు తమని తాము చాలా గొప్పగా భావించుకుంటారట. ఆ సమయంలో మీరు తనని పొగిడితే చాలా సంతోషిస్తారు. కానీ ఓ సర్వే ప్రకారం చాలామంది ఆ సమయంలో సహకరించే భార్యలను అభినందించరని తేలింది. 'నువ్వు నా జీవితంలోకి రావడం అదృష్టం, నీవే నా ఏంజెల్' లాంటి మాటలతో భార్యను అభినందిస్తుంటే వారు మీకు మరింత చేరువవుతారట. ఇప్పటినుంచి ఆ సమయంలో కూడా ఆమెని అభినందించి ఇంకా దగ్గరవ్వండి. ఇంకా చాలామంది మహిళలు ప్రెగ్నెంట్ అయ్యాక ఎప్పుడూ భర్త పక్కన ఉండాలని కోరుకుంటారు. భర్త భరోసా కోరుకుంటారు. ఆ సమయంలో భర్త ఆమెకు ధైర్యం చెబుతూ ఉండాలి.

## సలహా తీసుకోండి

చాలామంది భర్తలు ఏదైనా కొనాలంటే ఇంట్లో సంప్రదించకుండానే సొంత నిర్ణయాలతో కొనుగోళ్ళు చేస్తారు. అలా కాకుండా ఇకనుంచి ఏదైనా కొనేముందు మీరు మీ భార్య అభిప్రాయం కూడా అడిగి తెలుసుకోండి. దానివల్ల మీరు ఆమెకు చాలా ఇంపార్టెన్స్ ఇస్తున్నారని అర్థం చేసుకుంటుంది. మీ పైన ప్రేమ రెట్టింపవుతుంది.

## నీవే నా డియరెస్ట్ ఫ్రెండ్

భార్య అంటే కేవలం ఇంటి బాధ్యతలు తీసుకునే ఇల్లాలు మాత్రమే కాదు. ఆమె మీకు ఓ మంచి స్నేహితురాలు. ఎలాంటి విషయాన్నైనా మీతో షేర్ చేసుకుంటుంది. అలాగే మీరూ ఆమెతో అన్ని విషయాలూ షేర్ చేసుకోండి. మగువలకు మీపైన మరింత ప్రేమ పెరిగే క్షణాలేంటో తెలుసా? 'నా కష్టసుఖాలన్నీ నీతోనే చెప్పుకుంటా, ఎందుకంటే నా జీవితంలో నువ్వే నా బెస్ట్‌ఫ్రెండ్, నీతో కాకపోతే ఇంకెవరితో షేర్ చేసుకుంటా నాకన్నీ నువ్వే' లాంటి మాటలు మిమ్మల్ని జీవితాంతం గుండెల్లో పెట్టుకునేలా చూసుకుంటాయి.

## సమయం, సందర్భం

పొగడమన్నారుకదా అని అతిగా పొగిడేవాళ్లు కొందరుంటారు. అతిపొగడ్తలు లేనిపోని చిక్కులు తెస్తాయి. కేవలం మెచ్యూర్డ్, తెలివైన అమ్మాయిలు మాత్రమే కాంప్లిమెంట్స్‌ని ఎక్కువ తలకు ఎక్కించుకోరు. కానీ కొంతమంది మహిళలు కాంప్లిమెంట్స్‌ని కూడా భిన్నార్థంతో తీసుకుంటారట. సందర్భం లేకున్నా అదేపనిగా పొగుడుతూ ఉంటే మిమ్మల్ని ఆశలేని వ్యక్తిగా భావించే అవకాశమూ లేకపోలేదు. అలాగే చిరాకుపుట్టించే కాంప్లిమెంట్స్ చేస్తుంటే ఆమె మిమ్మల్ని చీప్‌గా చూడవచ్చు. అందువల్ల ఏ సమయంలో కాంప్లిమెంట్ ఇవ్వాలి, ఎలాంటప్పుడు కాంప్లిమెంట్స్ ఇస్తే బావుంటుంది...లాంటి విషయాలు గుర్తించి పొగడ్తలు చేస్తే ఎలాంటి సమస్యా ఉండదు.

**– సంతోషలక్ష్మి దహగాం**

## అభినందనలు ఆస్వాదించండి



*జీవిత భాగస్వామి మేలు కోరుకోవడం, వారి బాగోగులు చూడటం, జీవితాంతం వారిని సంతోషంగా ఉంచుకోవడమే నిజమైన దాంపత్యం అంటారు. గజిబిజి బతుకుల్లోపడి అసలైన దాంపత్య సంతోషాన్ని దూరం చేసుకోకూడదంటున్నారు. మానసిక నిపుణులు. ఆర్థిక ఇబ్బందులున్నా భాగస్వామిపట్ల అయిష్టంగా ఉండకుండా వారిని ప్రోత్సహిస్తూ, మనసు నొప్పించేలా మాట్లాడకుండా, వారికి అర్థమయ్యేట్లు ప్రశాంతంగా మాట్లాడితే సమస్యలు వాటంతటవే తొలగిపోతాయి. ముఖ్యంగా కొంతమంది మహిళలు, భాగస్వామి తమను పొగుడుతుంటే అపార్థం చేసుకుంటారు. వెటకారంగా మాట్లాడుతున్నాడనుకుంటారు. "ఈ రోజు నువ్వు ఎంతో అందంగా ఉన్నావు" అని భర్త చెబితే, "అసలే చిరాగ్గా ఉంది. నువ్వింక వెటకారంగా మాట్లాడకు" అంటూ అసహనం వ్యక్తం చేస్తారు. నిజంగా మనస్ఫూర్తిగా భార్యపై ప్రశంసలు కురిపించివుంటే, భార్య మాటలకు భర్త నొచ్చుకునే ప్రమాదం ఉంది. కాబట్టి భాగస్వామి ఎప్పుడైనా పొగిడితే, ఆ పొగడ్తను మనసారా స్వీకరించండి. సందర్భాన్ని బట్టి శ్రీవారిపై మీరూ పొగడ్తల వర్షం కురిపించండి. ఇలా చేస్తే మీ మధ్య చనువు, అనురాగం రెట్టింపు కావడానికి ఎక్కువ సమయం పట్టదని మానసిక నిపుణులు సూచిస్తున్నారు.*

## ప్రేమ పెరిగేది భావ వ్యక్తీకరణతోనే !



*ఏడు సముద్రాలనైనా ఈదవచ్చుగానీ, అమ్మాయి మనసు గెలుచుకోవడం చాలా కష్టమైన పనంటారు పెద్దలు. మరి 'అలాంటి అమ్మాయి మనసు దోచేయడం ఎలా?' అనుకుంటున్నారా? ఈ విషయంపై చాలా పరిశోధనలు జరిగాయి. ఓ చైనా పరిశోధనాసంస్థ కూడా దీనిపై ఓ పరిశోధన నిర్వహించింది. ఆ పరిశోధన సారాంశం ఏంటంటే, అమ్మాయిలను పడేయాలంటే మీలో ఉన్న కవిని బయటికి తీయాల్సిందేనట! సాధారణంగా మాట్లాడే వాళ్లకంటే తమపై సొగసైన మాటలు ఉపయోగిస్తూ అందమైన భావాలు వ్యక్తీకరించే వాళ్లనే అమ్మాయిలు ఎక్కువ ఇష్టపడతారట. అంతేకాదు, మంచి కవిత్వాన్ని జోడిస్తూ అమ్మాయిల అందాన్ని పొగిడితే ఇక అంతే! ఫ్లాట్! వాళ్లు మిమ్మల్ని వదిలిపోరు. అమ్మాయిని కలిసినప్పుడు అనవసరమైన మాటలు, ముక్కుసూటి మాటలు మాట్లాడకూడదు. అలా మాట్లాడేవాళ్లంటే అమ్మాయిలకు అస్సలు నచ్చదు. తమ మాటలకు కొంచెం సోపు తగిలించి మాట్లాడేవాళ్లతోనే అమ్మాయిలు ఎక్కువగా గడపడానికి ఇష్టపడతారట. పరిశోధనలో తేలిన నిజాలివి.*

# బరువు-బాధ్యత

## సంటి భానుమతి



**బస్సులో కూచున్నాను గానీ, అమ్మ చెప్పిన విషయం గురించే ఆలోచిస్తున్నాను.**

**"మీనాన్నకి ఈమధ్య మతిమరుపు ఎక్కువైంది. ఏదో వయసు పైబడుతోంది కదా మరుపు సహజం అనుకున్నాను. పెద్దగా పట్టించుకోలేదు. కానీ పట్టించుకునే సమయం వచ్చింది.**

మొన్న సాయంత్రం ఎప్పటిలాగానే బయటికి వెళ్ళారు. చీకటిపడిపోయింది. ఎంతసేపటికీ రాలేదు. ఏం చెయ్యాలో తెలీలేదు. ఎక్కడని వెతకను? ఏంచెప్పి వెతకను? ఎటని వెళ్ళను? ఏదైనా యాక్సిడెంటు అయిందా! అని పోలీస్టేషన్‌కెళ్ళి రిపోర్టు కూడా ఇచ్చాను. ఎలాంటి వార్త వినాల్సివస్తుందో అని ఆ రాత్రంతా భయంభయంగా గడిపాను. కానీ మర్నాడు పోలీసులు తీసుకొచ్చి ఇంట్లోదింపి వెళ్ళారు. జాగ్రత్తగా, కనిపెట్టుకుని ఉండండి. ఎవరైనా డాక్టరుకి చూపించండి అనిచెప్పి వెళ్ళారు. అది విన్నాక ఏంచేయాలో తోచలేదు. ఎక్కడికి వెళ్ళారని అడిగితే చెప్పరు. ఆఖరికి చెప్పారు, మన ఇంటి సందు మర్చిపోయానని. ఆ మాట విన్నాక ఇంకా భయం వేసింది. నిన్న ఇంకో భయంకరమైన విషయం, నన్నే గుర్తుపట్టలేదు. నువ్వు ఎవరు? అని అడిగారు. ఇదివరకటిలా పూజాపునస్కారాలవీ చేయడంలేదు. ఆయనకు ఏదీ గుర్తుండడంలేదు. నాకెందుకో భయంగా ఉంది. నువ్వు చాలా దూరంగా ఉన్నావు. నీ సంసారం నీకుంది, అయినా రమ్మంటున్నాను. నువ్వు నాపక్కనుంటే ఏం చెయ్యాలో తెలుస్తుంది, ఒక్కసారి రా. నువ్వుతప్ప ఇంకెవరున్నారు నాకు...."

అమ్మ మాటలు విన్నాక నాకు ఏంచెయ్యాలో తెలీలేదు. కొలీగ్ స్మిత దగ్గరకెళ్ళి విషయం చెప్పాను.

"ఇంక ఆలోచించకు. వాళ్ళిద్దర్నీ నీదగ్గరకి తెచ్చుకో. సరిగ్గా నాక్కూడా ఇలాంటి సమస్యే వచ్చింది. మా పేరెంట్స్‌కి, మేము ఇద్దరు ఆడపిల్లలం. అక్క యూఎస్‌లో ఉంటోంది. నేను ఇక్కడ. అమ్మకీ, నాన్నకీ వయసు డెబ్బై దాటింది. ఏ పనీ చేసుకోలేని పరిస్థితి. ప్రతిదానికీ పక్కవాళ్ళమీద ఆధారపడుతున్న పేరెంట్స్‌ని ఇక్కడికి తెచ్చుకుంటానని ఇంట్లో అన్నాను. దానికి పెద్దగొడవ. ఎందుకంటే అత్తగారూ, మామగారూ మా ఇంట్లోనే ఉంటున్నారు. 'పరాయివాళ్ళు ఎందుకు?' అన్నారు. మా అమ్మావాళ్ళు పరాయివాళ్ళెలా అవుతారు? అన్నాను. పెళ్ళయ్యాక నీకు ఆ ఇంట్లో వాళ్ళంతా పరాయివాళ్ళేకదా! అంతగా అయితే వాళ్ళను విడిగా ఉండమన్నారు. నేను ఒప్పుకోలేదు. అందరం కలిసే ఉందామన్నాను. మా హజ్బెండ్ కుదరదన్నారు. లేకపోతే విడాకులే! అన్నారు. ఆశ్చర్యం వేసింది, ఎంత సులభంగా పరిష్కారం చూపించారో అని. ఏం చెయ్యాలీ...? పోట్లాటలు. మా వాళ్ళని వదులుకోలేను. రోజూ ఈ గొడవలు భరించలేను. బాగా ఆలోచించి ఓ నిర్ణయం తీసుకున్నాను. విడాకులు తప్పలేదు. తీసుకున్నాను. అమ్మావాళ్ళను తెచ్చుకున్నాను. ఇక్కడ మనకి కర్తవ్యం, బాధ్యత రెండూ ఉంటాయి. అంతకుమించి మానవత్వం ఉంది. అందుకని ఏంచెయ్యాలో బాగా ఆలోచించుకో..." అంది. ఆమె మాటలు విన్నాక ఆలోచనలోపడ్డాను. ఈ సమస్యకి కూడా పరిష్కారం విడాకులేనా...! ఇంతకన్నా మంచిదిలేదా...! ఏం చేయాలి? నన్ను కని, పెంచి విద్యాబుద్ధులు చెప్పించి నాకో జీవితాన్నిచ్చిన వారిపట్ల నేను చూపించాల్సింది, కర్తవ్యమా! బాధ్యతా....! మరి నా భర్త ఒప్పుకోకపోతే...! ఏం చెయ్యాలీ? సంఘర్షణ.

ముందు అమ్మ దగ్గరికి వెళ్ళాలి. వెళ్ళడం అయితే వెళ్తాను. అదేం పెద్దకష్టమైనది కాదు. ఆ తరువాతేమిటి? డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళాలి. మామూలు డాక్టరు దగ్గరికి కాదు, ఏ న్యూరాలజిస్టో, సైకాలజిస్టు దగ్గరకో తీసుకెళ్ళాలి. నాన్న మరుపు సమస్యకి కారణం తెలియాలంటే బ్రెయిన్ సంగతి చూడాలి. అందుకు సీటీస్కాన్, ఎంఆర్ఐ చేయించాలి, వీటికి చాలా డబ్బు అవసరం. నేను అంత ఇవ్వగలనా! మందులన్నీ కూడా ఖరీదే. ఇవన్నీ నేను చెయ్యాలి, చెయ్యగలను, ఆ శక్తి నాకుంది. అయితే వీటికి నా భర్త అనుమతి తీసుకోవాలి. కానీ అది అవసరమా! తనకి చెప్పకుండా నేను ఇవన్నీ చేయగలనా! చెప్పకుండాచేస్తే మోసం చేసినట్లు కాదా? అప్పుడు మా బంధానికి అర్థం ఉంటుందా? ఒకరిమీద ఒకరికి నమ్మకం పోయినట్లే కదా! అలాచేస్తే మామధ్య దూరం పెరుగుతుందా! ఆ దూరం ఎంతవరకూ వెళ్తుంది? స్మిత అన్నట్టు విడాకులవరకూ వెళ్తుందా? అలాజరగడం నాకిష్టం లేదు ఏం జరిగితే అదే జరుగుతుంది, ఏదైనాసరే, సురేంద్రకి చెప్పాలి. తను నాకు ప్రతీ విషయం చెప్తాడు, అది తన క్యారెక్టర్. ఇప్పుడు నేను ఈ విషయం చెప్పకుండా నన్నునేను చీప్‌చేసుకోడం అసహ్యంగా ఉంటుంది. నేను కూడా చెప్పాలి. కానీ చెప్పేంత సింపుల్‌గా లేదు విషయం. ఎందుకంటే ఇది డబ్బుతో కూడుకున్నది. అందుకే ఈ తడబాటు.

భర్తతో అనుబంధం నాలుగేళ్ళది. కానీ నాన్నతో అనుబంధం పాతికేళ్ళు. నాకోసం ఎంతో చేశారు. శక్తికి మించి చదివించారు. డబ్బు దాచుకుందామని అనుకోలేదు. అంత ఆదాయం కూడా

# తురగా జానకీరాణి కథలపోటీలో రూ. 5,000 బహుమతి పొందిన కథ

లేదు. అలాంటప్పుడు ఇంక దాచడానికి ఏం ఉంటుంది? డబ్బుకి ఇబ్బందిపడినా, నన్ను బాగా చదివించాలనుకున్నారు. నా కొడుకైతే చదివించనా, కూతురని వదిలేస్తానా! చదివించడం భారం కాదు. ఇంకొంచెం కష్టపడతాను అన్నారు. ఆ కష్టం ఏంటో నాకు తెలుసు. అదేమాట మీద ఉండి, చదివించారు. పెళ్ళికూడా చేశారు. కట్నం లేకపోయినా పెళ్ళి హాలు, భోజనాలకే ఎన్నో లక్షలయ్యాయి. చాలా అవుతోందని నేను అంటే, జీవితంలో పెళ్ళి అనేది ఒకేసారి జరుగుతుంది. ఇప్పుడు కాకపోతే మరెప్పుడు? ఎవరో పరాయివాళ్ళకోసం కాదుకదా ఖర్చు చేస్తున్నది. నా కూతురు కోసమే కదా, అంటూ బాగా ఖర్చుచేశారు.

పెళ్ళయ్యాక, అమ్మావాళ్ళింటికి ఎప్పుడైనా వెళ్ళినప్పుడు, ఉంచుకో నాన్నా దేనికైనా పనికొస్తుంది, అని డబ్బివ్వబోతే, "కూతురుడబ్బు తీసుకునే స్థితిలో లేం. నాకొద్దు. మాకు సరిపడా ఉంది. మాది మాకు సరిపోతోంది" అనేవారు. అదేంటి నాన్నా నేను ఇస్తే తీసుకోకూడదా! పరాయిదాన్నా.....! అంటే, "అవును నువ్వు పరాయిదానివే! పెళ్ళయ్యాక నీమీద నీ డబ్బుమీద మాకేం హక్కులేదు. నువ్వు పరాయిదానివే" అని గుర్తుచేశారు.

ఆరోజు చొరవగా ఇస్తానన్న నేను, ఈరోజు నిజంగా డబ్బుకోసం ఓ పరాయిదానిలానే వెనకాడుతున్నాను. పెళ్ళయ్యాక కూతురు పరాయిదే, అన్నవాళ్ళ మాటలకి, బలం చేకూరుస్తున్నాను. కానీ నేను పరాయిదాన్ని కాదు. వాళ్ళు నా వాళ్ళు. నాన్నకి, అమ్మకి అన్ని విధాలా తోడుగా ఉంటాను. ఈ పని చేయడానికి ఇంట్లో సురేంద్రకి చెప్పాలి. తను ఒకవేళ వద్దంటే, నాకు స్వాతంత్ర్యం లేదని అనుకోడంలో అర్థంలేదు. సురేంద్ర దగ్గరనుంచి నాకు నేనుగా ఈ స్వాతంత్ర్యం తీసుకోవాలి. వెళ్ళి అమ్మకి సాయంగా ఉండాలి. నాన్నగారి సంగతి, ఆ జబ్బు సంగతి కనుక్కోవాలి. అందుకని నా వరకూ ఎంతైతే అంత చేస్తాను.

"మానాన్న ఆరోగ్యం బాలేదుట, అమ్మ ఫోన్ చేసింది. అందుకని రాత్రికి వెళ్తున్నాను" సురేంద్రకి ఇన్ఫర్మేషన్ ఇచ్చాను.

"అన్నీ అరేంజ్ చేసుకున్నావన్నమాట! మరి ఇప్పుడు చెప్పడం దేనికీ?" అన్నాడు.

ఆమాట నాకు ఎక్కడ తగలాలో అక్కడే తగిలింది.

"మీకు చెప్పేంత టైము లేకపోయింది. సాయంత్రం అమ్మ ఫోన్ చెయ్యడంతో వెంటనే టికెట్ బుక్ చేశాను, సెలవు పెట్టాను".

"అంత సీరియస్సా?" ఆ గొంతులో వెటకారం కనిపెట్టాను.

"అమ్మ మాటలు అలాగే ఉన్నాయి. మరుపు జబ్బు అంటున్నారు" అంతే చెప్పాను.

"దానికి కంగారు పడాల్సిందేముంది?"

నాకళ్ళల్లో నీళ్ళు, దాన్ని మాటల్లో అనువదించి చెప్పలేను. అది గమనించాడు. "సరే సరే వెళ్ళిరా, పాపని మేం చూసుకుంటాంలే" అన్నాడు.

రాత్రికి బస్సెక్కాను. ఆలోచనలతోనే కూచున్నాను. తెల్లారేసరికి ఇంట్లో ఉంటాను. నాన్న గుర్తొచ్చారు. ఎలా ఉన్నారో! నన్ను గుర్తుపడతారో లేదో! ఎవరు నువ్వు? అంటే...!

ఎక్కడో అంతరాంతరాల్లో ఏవో పిలుపులు. నన్నే పిలుస్తున్నారు. నా పేరే పిలుస్తున్నారు. ఆ గొంతు నాన్నదే. ఎంతసేపు తల్లీ! నీకెందుకూ, ఇట్టే చేసి పెడ్తాగా... ప్రతీసారీ అదేమాట... ఎంతసేపు తల్లీ... నేను చేసి పెడతాగా...



# ప్రేమను ఒప్పుకుంది

**టా**లీవుడ్‌లో అత్యంత దురదృష్టకరమైన సక్సెస్ హీరోయిన్లు ఎవరన్నా ఉన్నారు అంటే అది రెజీనా మాత్రమే! రెజీనా కెరీర్‌లో సక్సెస్ రేటు ఎక్కువే! ఎన్ని సక్సెస్‌లు వచ్చినా స్టార్ హీరోయిన్ అన్న బిరుదును మాత్రం అందుకోలేకపోయింది. దానికి కారణాలను ఇటీవలే చెప్పుకొచ్చింది. కెరీర్ ప్రారంభంలోనే ప్రేమలో పడడంతో తనకు తెలియకుండానే కొన్ని తప్పులు చేశాననీ ఆ మత్తు నుంచి బయటకొచ్చిన తరువాత వాటిని గుర్తించగలిగాననీ అంటోంది. ఇక మీదట ప్రేమ, పెళ్ళి గురించి ఆలోచించకూడదని గట్టిగా నిర్ణయించుకుందట! ఇన్ని విషయాలు చెప్పిన రెజీనా ఎవరితో ప్రేమలో పడిందో మాత్రం రహస్యంగానే ఉంచింది. కానీ ఆ లవర్ గురించి అందరికీ తెలిసిందే అంటున్నారు టాలీవుడ్ జనాలు.



ఇప్పుడు అవే మాటలు వినిపిస్తున్నాయి. కానీ బయట రణగొణధ్వనిలో కలిసిపోతున్నాయి. అయితేనేం గాలి వీస్తున్నప్పుడల్లా, నాన్నమాటల్ని మోసుకొస్తోంది. ప్రతీదీ తేలిగ్గా తీసుకుంటారు. "ఎంతసేపూ నే చేస్తాగా, ఇట్టే అయిపోతుంది" అంటారు.

నా ఇష్టాలని పూర్తిచెయ్యడమే తన జీవితలక్ష్యం అన్నట్లుగా ఉండేవారు నాన్న. అలాంటి నాన్నకి పరీక్ష పెట్టాలని లేదుగానీ అడగాలి, 'కాలేజీలో చేరాలని ఉంది' అని. "ఎంతసేపూ అలాగే, నే ఉన్నాగా..." అని అంటారన్న నమ్మకం లేదు.

అందుకే నాన్న లేనిసమయంలో, వంటింట్లో అమ్మ పనిచేసుకుంటున్నప్పుడు దగ్గరకువెళ్ళి "కాలేజీలో చేరనా! టెంత్ పాసయ్యాను కదా" కొంచెం, జంకుతూనే అడిగాను.

ఎంతో స్వేచ్ఛగా ఇదివరకు అడిగినట్టు, ఇప్పుడు నాన్నని అడగడానికి ధైర్యం చాల్లేదు. నన్ను కాలేజీలో చేర్పించే స్థితిలో లేడునాన్న. ఆ సంగతి నాకు తెలుసు.

ఆ రాత్రి నాన్న వచ్చాక అమ్మవిషయం చెప్పింది. నేను ఆ పక్కనే, నాన్నకి కనపడకుండా తలుపు వెనకనుంచున్నాను. నాన్న ఏం మాట్లాడలేదు. ఎప్పటిలాగా, "ఎంతసేపు, నే చేస్తా కదా" అనలేదు.

నాకు తెలుసు కాలేజీలో చేరడం అంటే మాటలు కాదు. డబ్బుతో కూడుకున్నపని. మా ఊళ్ళో కాలేజీ లేదు. పైఊరెళ్ళాలి. అక్కడ నన్ను ఇంట్లో ఉంచుకునేంత దగ్గరివాళ్ళెవరూ లేరు. హాస్టల్లో చేరాలి. వాళ్ళు ఉట్టిగా చేర్చుకోరు. డబ్బు కట్టాలి. కాలేజీ జీవితం మధ్యమధ్యలో ఇంటికి రావాలి, అదీ డబ్బుతో కూడుకున్నదే. అందుకే నాన్న ఏం మాట్లాడలేదు.

ఓ వారంరోజులు నాన్న కనిపించలేదు. నేను లేవకుండానేవెళ్ళి, ఎప్పుడో రాత్రి వస్తున్నాడు. "అక్కడెక్కడో యాగం చేస్తున్నారని పిలిచారు. అక్కడ బ్రాహ్మలకి సంభావనలూ అదీ బాగా ఇస్తారని అక్కడే ఉండిపోయారు" అని అమ్మ చెప్పింది.

"పద వెళ్దాం, నాన్న నిన్ను తయారవమన్నారు" అంది. అమ్మని సంతోషంగా చూశాను. అమ్మ కళ్ళల్లో ఆనందం. మరి డబ్బు... అన్నట్టుగా చేతివేళ్ళని ఆడించాను. నీకెందుకూ అన్నట్లుగా చేత్తో వారించింది అమ్మ.

కాలేజీలో చేరాను. కానీ ఇక్కడికి వచ్చాక నాన్న అవసరం ఎంతుందో తెలిసివస్తోంది. నాన్న నాకు ఎంత దగ్గరో అర్థమైంది.

చాలా చిన్నవయసులో ఉన్నప్పుడు ఏది అడిగినా, నాన్న వెంటనే "ఎంతసేపు, నే తెస్తాగా" అని మర్నాడు పొద్దున్నే చేతిలో ఉంచి బావుందా, నీకు నచ్చిందా" అనేవారు. పక్కనే కూర్చుని చదివించేవారు, రాయించేవారు. తప్పులురాస్తే, అలాకాదు, ఇలా...తప్పు చదువుతున్నావు. ఒత్తులు సరిగా స్పష్టంగా పలుకు అంటూ పక్కనకూచుని తప్పులు దిద్దిన నాన్నమెదడులో జరుగుతున్న తప్పుని దిద్దాల్సిన సమయం వచ్చింది.

**ఆమెకో పెద్ద సమస్య వచ్చింది. ఏంచెయ్యాలో తెలియక ఆఫీసులో కొలీగ్‌ని సలహా అడిగింది. సరిగ్గా నాకూ ఇలాంటి సమస్యే వచ్చిందనీ, అత్తారింట్లో ఈ సమస్యను చర్చకు పెడితే మా హజ్బెండ్  ఒప్పుకోకపోవడంతో విడాకులు తీసుకున్నానని తన అనుభవం వివరించి చెప్పింది ఆ కొలీగ్. అంటే నా సమస్యకు కూడా పరిష్కారం విడాకులేనా? అని భయపడింది ఆమె. ఇంతకీ ఆమె సమస్య ఏంటి? ఆమెకెలాంటి పరిష్కారం లభించింది?**

ఓసారి నా నోటుబుక్కులో కాయితాలు ఊడిపోతుంటే, నాన్నకి ఆ పుస్తకం చూపించాను. అదెంతసేపు, ఇలాతే అని దబ్బనం, ట్వైనుద్వారంతో చక్కగా కుట్టి, అందంగాచేసి తెచ్చారు. ఎప్పటిలాగే బావుందా అన్నారు.

ఓసారి చెవిదుద్దులో ఓ రాయిపోతే, వెంటనే నాన్న, "ఎంతసేపూ, నేచేస్తాగా" అని తీసుకెళ్ళి, పుట్టి వేసి, ఎర్రపెయింట్‌వేసి ఎర్రరాయిలాగానే చేశాడు. "బావుందా..గుళ్ళో అమ్మవారి నెక్లెస్‌లో రాయిపోతే ఇలాగే వేయించాను" అన్నారు.

పుస్తకాలకి బ్రౌను అట్టలు వెయ్యాలి అన్నాను. వెంటనే, "ఎంతసేపు..ఇట్టే వేసిపెడ్తాగా, లేబుల్స్ కూడా అంటించేస్తాగా..." అన్నారు.

నేను ఏది అడిగినా వెంటనే "ఎంతసేపు, ఇలా తే.." అని వెంటనే చేస్తారు.

ఓసారి సెలవులకివచ్చిన నాకు నాన్న కనిపించలేదు. అతికష్టంమీద ఓ రెండురోజుల తరువాత నాన్నని చూశాను. అది కూడా అర్ధరాత్రి.

"నువ్వు చాలా మారిపోయావు నాన్నా..." అన్నాను.

ఎప్పటిలాగే తేలిగ్గా తీసుకోలేదు.

"మామూలు ఆఫీసు ఉద్యోగం అయితే ఈ కష్టాలు ఉండవుకదా నాన్నా. మీనాన్న నిన్ను చదివించకుండా బలవంతంగా పౌరోహిత్యంలోకి దింపాడని

## 'జూలీ' మాటలు నమ్మొచ్చా?

*ఈ సినిమా పేరు వింటే అలనాటి హీరోయిన్ లక్ష్మి టక్కున గుర్తుకు వస్తుంది. కానీ ఈ జూలీ ఆ జూలీ కాదు. 'జూలీ 2' సినిమాలో హీరోయిన్ పేరులో కూడా లక్ష్మి ఉంది. ఆమె ఎవరో కాదు రాయ్ లక్ష్మి. టాలీవుడ్‌లో తన అదృష్టాన్ని పరీక్షించుకుని, ఆ తరువాత బాలీవుడ్ బాట పట్టింది ఈ లక్ష్మి. 'జూలీ 2'లో అవకాశం వచ్చినప్పటి నుంచి ఆ సినిమాకి సంబంధించి రాయ్‌లక్ష్మి ఎక్కువగా బికినీల్లోనే కనిపిస్తోంది. అంతే కాకుండా ఛాన్స్ దొరికినప్పుడల్లా ఈ సినిమా గురించి బోలెడన్ని ముచ్చట్లు చెబుతోంది. ఈ సినిమా కోసం ఓ దశలో విపరీతంగా బరువు పెరిగి డబుల్ ఎక్సెల్ సైజుకి చేరుకుందట! వెంటనే తిరిగి సైజ్ జీరోకి దిగిపోయిందట! ఇంతలా బరువు తగ్గడానికి 36 మంది ట్రైనర్ల సహాయం తీసుకున్నానని చెబుతోంది రాయ్ లక్ష్మి. ఇవన్నీ ఓకే కానీ, అంత బరువు ఇంత తక్కువ కాలంలో ఎలా తగ్గిందా? అనేదే చాలా మంది అనుమానం. అనుష్క శెట్టి గతంలో ఇలాంటి ప్రయోగమే చేసి ఇప్పటి వరకూ బరువు తగ్గలేకపోయింది. కానీ రాయ్ లక్ష్మి మాత్రం తన బరువును తగ్గించుకున్నానని అంటోంది. ఈ మాటల మీదే సినీ జనాలు అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు. సినిమాకి హైప్ తేవడం కోసం నోటికొచ్చినట్టు మాట్లాడితే తేడా కొడుతుందని తెలియదా? అని కూడా అంటున్నారు.*

పిస్తోందా..." అన్నాను.

"లేదు తల్లీ! మానాన్న ఏది చేసినా ఎంతో ఆలోచించే చేశాడు. అయినా ఈ జీవితంనుంచి నేను ఏదీ ఎక్కువ ఆశించలేదు. ఏదో కావాలనుకోలేదు. ఎక్కువ చదువుకోలేదు కాబట్టి, నాకు ఏదీ తెలియదనుకున్నాను. ఇది నాకు అవకాశం అనుకున్నాను. ఈ వృత్తిలో నేను ఎన్నో నేర్చుకున్నాను. ప్రతీదాన్లో ఓ ఫిలాసఫీ కనిపించేది. నేను మామూలుగా వుంటే ఏదీ నేర్చుకునేవాడిని కాదు. మానాన్న చూపించిన ఈ వృత్తిజీవితం నాకో గొప్ప టీచరు. నాకు ఎన్నో నేర్పించింది. ఒకరుకాదు, ఇద్దరుకాదు ఎంతోమంది మహర్షులు, యోగులు కొన్ని వేల సంవత్సరాల క్రితమే తమ తపస్సంపద, జ్ఞానసంపదల్ని మంత్రాలు, వేదాలు, ఉపనిషత్తుల రూపంలో నిక్షిప్తం చేసి మనకందించారు. అవన్నీ నేర్చుకోవాలంటే గురుకులాల్లో ఉండాలి. ఆ అదృష్టం నాకులేదు. ఏదో నాకువచ్చిన మంత్రాలతో పెద్దగా సంతృప్తి చెందకపోయినా, కనీసం ఈ మాత్రమైనా వచ్చినందుకు తృప్తిగా ఉంది. ఈ శుభకార్యాలతోనే గడిపేస్తున్నాను. ఈ కార్యాలూ అవీ చేయిస్తున్నప్పుడు, ఆ మంత్రాలూ అవీ చదువుతుంటే, నాలో ఏదో పవిత్రత, పరిశుద్ధత కలిగినట్టు అనిపిస్తుంది. నాకెంతో జ్ఞానం కలుగుతున్నట్టు అనిపిస్తుంది. ఈ అదృష్టం ఎంతమందికి దక్కుతుందిచెప్పు?"

......... .............

"అయినా, అప్పటి మా పరిస్థితి అలాంటిది, డబ్బుకి ఇబ్బంది. ఊళ్ళో వున్న అప్పర్‌ప్రైమరీస్కూల్లో చదువుకున్నాను. పై చదువులకి బయటికివెళ్ళలేనిస్థితి, అందుకే నాన్నవెనకాల చెప్పుల్లేకుండా కాలినడకన పక్కఊళ్ళకి వెళ్ళాల్సివచ్చేది. సంభావన పెద్దగా ముట్టకపోయినా, ఆ వరహాకోసమే మైళ్ళదూరం రోజూ నడిచే వెళ్ళేవాళ్ళం. ఆ చిన్నసంభావనలే మాకు పెద్ద అదనపు ఆదాయంలా ఉండేది. అంచెలంచెలుగా అన్ని కార్యక్రమాలూ నేర్చుకున్నాను. నాన్నగారు పోయాక నేనే చేయిస్తున్నాను. అదనంగా పైఊళ్ళ నుంచి సంధ్యావందనం, దాని విధివిధానం తెలుసుకోవాలనే ఉత్సాహం ఉన్నవాళ్ళు, కొత్తగా ఒడుగులు చేసుకున్నవాళ్ళు నేర్చుకోడానికి వస్తారు. వాళ్ళకి ప్రవర, సంకల్పం దగ్గరనుంచి అన్నీ నేర్పిస్తాను. ఇవన్నీ ఎంతోఇష్టంగా చేస్తానుతప్ప పౌరోహిత్యంలోకి రావడం బలవంతం అనుకోలేదు. ఎందుకిలా అయిందని ఎప్పుడూ అనుకోలేదు. ఓసారి వెనక్కితిరిగి, గడిచినవాటిల్లోని అన్నిచుక్కల్నీ కలిపితే, జీవితంలో గడిపిన ప్రతీక్షణం నాకు ఏదోఒకటి ఇస్తూనే ఉంది. అందుకే నేనీరోజున ఇన్ని కార్యాలూ, పూజలూ, గృహప్రవేశాలూ చేయించగలిగాను. నిన్ను ఇంజనీరింగ్ చదివించగలిగాను. నేను ఇవ్వగలిగేది ఇదే, జీవితాన్నివ్వలేను కదా"

నాన్న ఏమీ ఇవ్వలేదంటాడుగానీ, తనలోని ఓ ముక్కనే నాకు ఇచ్చాడు. అది అపురూపమైనది. నాకు చదువు చెప్పించాడు. మనిషికి ఇవ్వాల్సిన సంస్కారాన్నిచ్చాడు. ఓ విత్తనంనాటి చెట్టుని చేశాడు. చెట్టు పెద్దగా అయింది. ఈరోజు ఆ చెట్టు నీడన నాన్నని కూచోపెట్టాల్సిన సమయం వచ్చింది.

బస్సుదిగాక ఇంటికెళ్ళాను. అమ్మ చెప్పిందంతా విని నాన్నని ఆసుపత్రికి తీసుకెళ్ళాను. అన్ని పరీక్షలు చేయించాక మందులు కొనిచ్చి, ఓ మూడు రోజుల తరువాత ఇంటికి తిరిగెళ్ళిన నాకు, ఇంట్లో అన్నీ పరాయిగా అనిపించాయి. ఎందుకంటే, "మీనాన్న ఎలా ఉన్నారు?" అని ఎవరూ నన్ను అడగలేదు. ఇంట్లో ఇలాంటి వాతావరణం ఉంటే నా మనసులో ఉన్నది చెప్పగలనా అన్న సందేహం. కానీ చెప్పకతప్పదు. అందరూ ఉన్నప్పుడు విషయం ప్రస్తావించాను.

"మా నాన్నని మనింటికి తీసుకువద్దామనుకుంటున్నాను" అని ఓసారి అందరివైపూ చూశాను, వాళ్ళ రియాక్షన్స్ ఎలా ఉన్నాయో అని.

ఎవరూ ఏం మాట్లాడలేదు. ఓసారి నామొహంకేసి చూశారంతే. నాకు ఏం చేయాలో తోచలేదు. 'మీకిష్టంలేకపోతే మానాన్నకోసం వేరే ఇల్లు తీసుకుని నేను విడిగా ఉండదలుచు కున్నాను' అనొచ్చు, కానీ అనలేను. అనలేను కాదు, అది పరిష్కారం కాదు. ఈ క్షణాన నేను ఏం మాట్లాడితే ఏం అవుతుందో అని భయం వేసింది. కానీ ఇప్పుడు చెప్పకపోతే, సమయం మించిపోవచ్చు.

"మానాన్నగారికి ఆల్జీమర్స్! ఇదివరకులాగా ఆయన ఉండడంలేదు. ఏదీ గుర్తుండడం లేదు. తలుపు తీసివుంటే బయటికి వెళ్ళిపోతున్నారు. ఇల్లుని, మనుషుల్ని మర్చిపోతున్నారు. రెండుసార్లు పోలీసులు పట్టుకుని ఇంట్లో దింపారు. మీకు తెలుసు కదా, అమ్మకూడా ఏం చిన్నదికాదు. నేనుతప్ప వాళ్ళకి ఎవరూలేరు. అన్నయ్యలు ఇద్దరూ ఒకేసారి రోడ్డుప్రమాదంలో పోయారు. వాళ్ళే ఉంటే ఈ రోజున ఈ పరిస్థితి వచ్చేదికాదు. ఈ సంగతి మీకు తెలుసు. ఇలాంటి సమయంలో నేను వాళ్ళని ఆదుకోవాలి. నాన్నని ప్రతీక్షణం కనిపెట్టుకుంటూ ఉండాలి. డాక్టర్లదగ్గరికి తీసుకెళ్తూండాలి. అందుకని..." ఆగిపోయాను. చెప్పాల్సింది చెప్పేశాను.

"ఏదైనా ఆశ్రమంలో పెడితేసరి" అత్తగారు అన్నారు. గుండెలో ఓ ముల్లు గుచ్చుకుంది. ఇంతకన్నా మంచిపరిష్కారం ఆమెకి తోచలేదా!

"అదెప్పుడు? వాళ్ళకి ఎవరూ లేనప్పుడుకదా, కానీ వాళ్ళకి నేనున్నానుకదా. నేనుకూడా లేకపోతే అప్పుడు మీరన్నట్లుగానే ఆశ్రమంలో ఉంచచ్చు, కానీ ఇప్పుడు వాళ్ళని చూడాల్సిన బాధ్యత నాది"

"అదెలా కుదురుతుంది! ఇంట్లో మా అమ్మా నాన్నా ఉన్నారుకదా!" సురేంద్ర వెంటనే అన్నాడు.

"అవును ఉన్నారు. వాళ్ళతోపాటు వీళ్ళుకూడా ఉంటారు. మీ వాళ్ళెంతో నా వాళ్ళూ అంతే. మీ వాళ్ళని చూడడం మీ బాధ్యత అనుకుంటే నేను కూడా అదేమాట అనగలను. కానీ అలా అని




ప్రేమపిచ్చిపట్టి తెగ నచ్చినాడని
ఓ పచ్చి నయవంచకుణ్ణి నమ్మితే
రెచ్చిపోయి పగలు రేయి విచ్చలవిడిగా తిరిగితే
కామంతో కళ్ళు పొరలు కమ్మితే
కడుపు పండితే, ఖర్మకాలి
పెళ్ళికి ముందే తల్లయితే
వాడుకున్న వాడు తర్వాత ఎంత వేడుకున్నా

## ఆడపిల్లలు - అగ్ని పర్వతాలు

పుట్టిన బిడ్డకు
తాను తండ్రినే కాదంటే
పరువు పోతుందని
పాపం ఏ పాపం ఎరుగని
ఆ ముసి ముసి నవ్వుల పసికందును
ఏ మురికిగుంటల్లోనో
ఏ ముళ్లపొదల్లోకో విసిరేసి చున్నీతో ఫ్యానుకు
ఉరివేసుకొని ప్రాణాలు తీసుకుంటే
మీమీద గంపెడు ఆశలు పెట్టుకొని
మీరు కలెక్టర్లు కావాలని
కంప్యూటర్ ఇంజనీర్లు కావాలని
కన్నవాళ్లు కమ్మని కలలెన్నో కంటూవుంటే
అన్ని టీవీ ఛానెల్స్‌లో
మీరు ప్రేమ పరీక్ష వ్రాసి ఫెయిలయ్యారని,
అందుకే ఆత్మహత్య చేసుకున్నారని
ప్రాణాలు తీసుకున్నారని
బ్రేకింగ్ న్యూస్ వస్తూవుంటే
గుట్టుగా బ్రతికే అమ్మానాన్నల
గుండెల్లో ఆశలు ఆరిపోవా
అగ్ని పర్వతాలు బద్దలైపోవా
అందుకే ఓ అమాయకపు ఆడపిల్లలారా!
ఇకనైనా ఆలోచించండి
'ప్రేమ విద్య' అనే
నాలుగు అక్షరాల మధ్య నలిగి పోకండి
విద్య కన్న ప్రేమకే ఎక్కువ విలువ నివ్వకండి
'అనురాగం అమృతం విషం' అన్న నగ్నసత్యాన్ని



మరవకండి
'ప్రేమ ఊబిలో' కూరుకుపోకండి
తొందరపడి ఏ తప్పు చేయకండి
తప్పటడుగులు వేయకండి
తల్లిదండ్రుల పరువు తీయకండి
గుండెల్లో గునపాలు గుచ్చకండి
కన్నవారి కళ్లను కన్నీటి సముద్రాలుగా మార్చకండి
మా ఈ మంచి మాటలు వింటారు కదూ!....
ప్రేమకు దూరంగా
వుంటారు కదూ!.....
ఇట్లు
ప్రేమతో మీ నాన్న
ఆశతో మీ అమ్మ

—పోలయ్య
సెల్: 9110784502

దెబ్బలాడను. మీరంతా ఒక్కసారి ఆలోచించండి. మా నాన్న నన్నెప్పుడూ ఓ బరువు అనుకోలేదు, ఓ బాధ్యత అనుకున్నారు. నేనుకూడా అంతే. నాన్న నాకు బరువుకాదు. కర్తవ్యం, బాధ్యత అనుకుంటు న్నాను. ఈ కప్పుకింద ఐదుగురం ఉంటున్నాం. ఇప్పుడు మరో ఇద్దరు. ప్రకృతిపరంగా బలహీను లైన వాళ్ళని తెచ్చుకుందాం. అందరం కలిసి ఉందాం. ఓ వృద్ధాశ్రమంలో ఎవరిపనులు వాళ్ళు చేసుకుంటూ ఒకరివిషయాల్లో తలదూర్చకుండా ఎలా ఉంటారో ఇక్కడకూడా అలాగే ఉంటే ఏ గొడ వారాదు" ఆపి భర్తవైపు చూశాను. గబగబా అన్నం తింటున్నాడు. అది కోపం అని తెలుసు.

"పాతికేళ్ళు ఓ వాతావరణంలో పెరిగి, మీ ఇంటికొచ్చాను. మీ వాతావరణం, మీ పద్ధతులు, మీ అలవాట్లు అన్నీ వేరు. అన్నీ కొత్తఅయినా అన్నింటినీ నేను అడాప్ట్ చేసుకున్నాను. నాకు పెళ్ళంటే ఏంటో తెలుసు. అత్తగారింట్లో ఎలా ఉండాలో ఎలా మసలుకోవాలో మావాళ్ళు నాకు నేర్పించారు. ఎంతో త్యాగం చేయాలని తెలుసు. ఎన్నింటికో రాజీపడడం తెలుసు. రాజీ అని అనను. మనస్ఫూర్తిగా అన్నింటినీ అంగీకరించాను. నా మూలంగా ఇంట్లో ఫ్రిక్షన్స్ రాకూడదని, గొడవలు రాకూడదని చాలావిషయాల్లో చాలావిధాలుగా నన్ను నేను సమాధానపర్చుకున్నాను. అత్తయ్య గారిని మా అమ్మలాగానే భావించాను. ఏ విధ మైన ఇబ్బందిరాకుండా అత్తయ్య, మామయ్యగారి డైట్ రెస్ట్రిక్షన్స్ తెలుసుకుని ఓ చార్ట్ తయారు చేసుకుని, ఆ విధంగా టైం ప్రకారంగా అన్నీ చేస్తు న్నాను. పెద్దబరువుగా భావించలేదు. ఆఫీసు, ఇల్లు రెంటినీ బాలెన్స్ చేసుకున్నాను.

మీవాళ్ళని నావాళ్ళే అనుకున్నాను. నేను అలా అనుకున్నప్పుడు మీరుకూడా అలా అనుకుంటే కుటుంబం అనే పదానికి సరైన అర్థం ఇచ్చిన వాళ్ళ మవుతాం. ఇందులో మానవత్వంతో కూడిన రాజీ ఉంది.

నాకు తెలుసు ఇక్కడ వ్యక్తిత్వాలమధ్య, అహం కారాలమధ్య గొడవలు వస్తాయని. వంటల మూలంగా గొడవలు రాకుండా వంటమనిషిని పెట్టుకుందాం. చిన్నచిన్న పనులు చేయడానికి ఓ మనిషిని పెట్టుకుందాం. ఎక్కడ ఏ సమస్యవచ్చినా, సామరస్య పరిష్కారంవైపు ఆలోచిద్దాం. మానాన్న గారు ఎన్నిరోజులు బతుకుతారో తెలీదు. ఈ కొన్ని రోజులూ వృద్ధాశ్రమంలో పెట్టడం నాకిష్టంలేదు. అందరం ఒకరికొకరం తోడుగా, స్నేహితుల్లా ఉండి, మనపిల్లలకి ఓ ఉదాహరణగా ఉందాం. కుటుంబం అంటే అమ్మానాన్నా మాత్రమేకాదు, వీళ్ళందరూ కూడా వస్తారని ప్రాక్టికల్‌గా చూపిద్దాం" అన్నాను.

ఎవరూ మాట్లాడలేదు.

"అయినా ఇది నువ్వు చెప్పినంత సులభం కాదు. ఈ వయసులో రోజువారీవచ్చే ఈ గొడవల్ని నేను ఓపలేను" అని చాలా సేపటికి అత్తగారన్నారు.

"గొడవలనేవి ఎవరికీ ఇష్టం ఉండదు. అవి రాకుండా నేను చూసుకుంటాను. నేను మీ అంద రికీ చెప్పదగినదాన్ని కాదు. మీరందరూ పెద్దవాళ్ళు, ఉద్యోగాలు చేసినవారే. మాఅమ్మ ఉద్యోగం చెయ్యక పోయినా సర్దుకుపోయేతత్వంగల మనిషి. ఓవిధంగా, అందరూ ఇంటెలిజెంట్లే. అందరికీ తెలివితేటలు న్నాయి. కానీ అదిప్పుడు పనికొస్తుందో లేదో తెలీదు.

ఇప్పుడు మనకి కావల్సింది ఇంటెలిజెన్స్ కోషంట్ కాదు. ఇమోషనల్ కోషంట్. దీన్నే మేము క్రైసిస్ మేనేజ్‌మెంటులో ఉపయోగిస్తుంటాం. ఇప్పుడు మనం దానిని పెంచుకోవాలి.

ఎదుటిమనిషి అర్థం కావాలంటే మనసుకి ఉన్న కళ్ళజోడు తీసెయ్యాలి. ఓ సముద్రాన్ని, ఓ కొండని, ఆకాశాన్ని చూసినంత ప్రశాంతంగా చూడాలి. వీటిమీద అభిప్రాయాలు ఎవరికీ ఉండవు. వాటిని అలాగే చూస్తున్నాం. ఇది ప్రాక్టీసు చేస్తే, మనకు ఎవరితోనూ శత్రుత్వం, అసూయ ఉండదు. మన ప్రవర్తన, మన భావోద్వేగాలపైన మనకు అదుపుండాలి. కోపం, ఈర్ష్య, ఏడుపు, నవ్వు...అన్నీ మనలో జరిగే రసాయనికచర్యలే. మనం ఎవ్వరం శాశ్వతం కాదు. జీవితాంతం గడ పాల్సింది మనతోనే. అందుకే దీనిని కేవలం రసా యనికచర్యగా కాకుండా, మన తెలివి, శక్తి ఉప యోగించి, ఈ జీవశక్తిని అమృతంగా మారుద్దాం.."

ఎవరూ మాట్లాడలేదు. ఓ ఉదయాన్నే ఆఫీసుకి తయారయ్యే హడావుడిలో ఉన్నాను. పేపరు చదువు కుంటున్న మామగారు నన్ను పిలిచి, ఇలా అన్నారు.

"ఈ నాలుగురోజులూ మేం ముగ్గురం బాగా ఆలోచించుకున్నాం. నువ్వు చెప్పింది బాగానే ఉన్నట్ట నిపించింది. ఉన్నన్ని రోజులూ నిజమైన ఆనందాన్ని మన ఇంట్లోనే అనుభవిద్దాం. మన మమకారాలమీద, అహంకారాలమీద అదుపు సాధిద్దాం. అందరం కలిసి ఉందాం. ఒకరికొకరం తోడుగా, ఆసరాగా, ఆధా రంగా, ఆలంబనగా, మన ఇంట్లోనే ఓ ఆశ్రమంలో ఉంటున్నట్టు ఎవరి పరిధుల్లో వాళ్ళు ఉందాం".

సెల్: 88976 43009

# లైంగిక వ్యాధులకు హోమియోతో చెక్


డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




రోజువారిలాగే క్లినిక్‌లో పేషంట్స్‌ను చూస్తున్నాను. వచ్చీపోయే పేషంట్స్‌తో క్లినిక్ అంతా చాలా బిజీగా ఉంది. సిసిటివిలోంచి గమనిస్తున్న నాకు హాల్‌లో కూర్చున్న ఒక యువకుడిలో ఏదో తెలియని భయం, ఆతృత, విపరీతమైన ఆందోళనా కనిపించాయి. ఆ తరువాత ఆ యువకుడు నా చాంబర్‌లోకి వచ్చాడు. "కూర్చో" అన్నాను. ఏదో బిగదీసుకుపోయినట్లు కూర్చున్నాడు. " ఏంటి ప్రాబ్లమ్?" అన్నాను. ఏదో శక్తినంతా కూడగట్టుకుని, సార్! నా పేరు కిశోర్. నాకు 28 ఏళ్ల. గుంటూరు నుంచి వచ్చాను. నాకో పర్సనల్ ప్రాబ్లం ఉంది. విషయం ఏమిటంటే రెండు నెలల క్రితం నేను ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. అదొక మధురమైన అనుభూతిని ఇచ్చిన మాట నిజమే. కానీ, ఓ 10 రోజుల తరువాత నా పురుషాంగం మీద చిన్నచిన్న ఎర్రని నీటి పొక్కులు కనిపించాయి. బాగా దురద వేయసాగాయి. విపరీతంగా భయపడిపోయి ఊళ్లో ఉన్న డాక్టర్‌కు చూపించాను. దాదాపు 8 రోజుల్లో సమస్య బాగా తగ్గిపోయింది. కానీ, మందులు మానేసిన కొద్దిరోజులకే మళ్లీ రావడం మొదలయ్యింది. అందుకే ఈ సమస్య శాశ్వతంగా పోయే వైద్య విధానం కోసం వెతుకుతున్నాను. హోమియోలో ఈ సమస్యకు అలాంటి మందులు ఏమైనా ఉన్నాయేమో తెలియచేయండి డాక్టర్ గారూ!" అన్నాడు. అతని ఆందోళన చూస్తే చాలా బాధాకరంగా అనిపించింది. అతని జననాంగం మీద చిన్న చిన్న నీటి పొక్కులు ఉన్నాయి ముందు భాగమంతా ఎర్రగా వాచి ఉంది. అతనికి ఉన్నది హెర్పస్ వ్యాధి అని స్పష్టమయ్యింది. "నువ్వేమీ భయపడకు ఈ వ్యాధిని నేను పూర్తిగా నయం చేస్తాను." అంటూ ధైర్యం చెప్పి కొన్ని మందులు రాసి పంపించాను.

**హెర్పిస్ జెనిటాలిస్ :** లైంగిక కలయిక తరువాత పురుషాంగం మీద చెమటకాయలంత ఆకారంతో ఎర్రటి నీటిపొక్కులు కనిపిస్తాయి. నొప్పితో పాటు విపరీతమైన దురద ఉంటుంది. వెంటనే తగు జాగ్రత్తలు తీసుకోకపోతే ఇది ఇతరులకు సోకే ప్రమాదం కూడా ఉంది. దీనివల్ల ఇతరమైన లైంగిక సమస్యలు తలెత్తడంతో పాటు, కొంతమంది స్త్రీలకు గర్భస్రావం అయ్యే అవకాశం కూడా ఉంది.

**గనేరియా :** మూత్రంలో మంట, మూత్రనాళం దగ్గర దురద శృంగారం తరువాత ముందుగా కనిపించే గనేరియా లక్షణం. దీనికి తోడు జిగురుగా ఒక ద్రవం వస్తుంది. పొత్తి కడుపులో నొప్పి, వీర్యంలో మంట, వీర్యంలో రక్తం రావడం కూడా ఈ వ్యాధి లక్షణాలే.

**వెనెరల్ వార్ట్స్ :** పురుషాంగం మీద చిన్నచిన్న కాలిఫ్లవర్ లాంటి పులిపిర్లు వస్తాయి క్రమంగా ఇవిగుత్తులు గుత్తులుగా తయారవుతాయి.

**షాంకరాయిడ్ పుండ్లు :** ఇది కూడా రతిక్రియ ద్వారా సంక్రమించే సమస్యే. లైంగిక సంపర్కం జరిగిన 3 నుంచి 5 రోజుల లోగా ఈ వ్యాధి బయటపడవచ్చు. జననాంగం మీద రెండుమూడు పుండ్లు ఏర్పడతాయి. ఎర్రగా ఉండి ఇవి రుద్దినప్పుడు బాగా మంట కలిగిస్తాయి.

**పరిష్కారం ఏమిటి? :** లైంగిక క్రియ ద్వారా సంక్రమించే ఈ వ్యాధులన్నిటినీ నయం చేసే వైద్య చికిత్సలు హోమియోలో ఉన్నాయి. ఇతర వైద్య విధానాల్లో చేసే పై పూతల వల్ల వ్యాధి తాత్కాలికంగా తగ్గినా ఆ వ్యాధి తిరిగి వచ్చే ఆస్కారం ఉంది. అయితే హోమియో వ్యాధి మూలకారణాల్ని గుర్తించి సమస్యను సమూలంగా తొలగిస్తుంది. ఏమైనా కిశోర్ నేను రాసిన మందులన్నీ వాడి హెర్పస్‌నుంచి విముక్తి పొందాడు.

# హెపటైటిస్-బికి హోమియోతో చికిత్స

ఆ రోజు సోమవారం. క్లినిక్ పేషెంట్స్‌తో బిజీగా ఉంది. 10 గంటలకు నా ఛాంబర్‌లోకి ఒక మధ్యవయస్కురాలు వచ్చింది. వారితో పాటు ఆమె భర్త తోడుగా వచ్చారు. జూనియర్ డాక్టర్ తీసుకున్న కేస్‌షీట్‌ను నా చేతికిచ్చింది. మొహంలో ఆందోళన,భయం. 'చెప్పమ్మా! ఏంటి నీ ప్రాబ్లమ్, ఎక్కడి నుంచి వచ్చారు?' అని అడిగాను. మాది మచిలీపట్నమండీ(ఏడుపు దిగమింగుకుంటూ)"డాక్టర్‌గారూ నాకు పెద్ద సమస్య వచ్చింది అని కళ్లలో నీళ్లు తెచ్చుకుంది. వెంటనే ఆమె భర్త నా భార్యకు హెపటైటిస్ బి వచ్చింది. ఎలా వచ్చిందో తెలియడం లేదు. నా భార్య చాలా భయపడుతోంది. ఏం చేయాలో మా ఇద్దరికీ అర్థం కావడం లేదు. వెంటనే ఆమె కల్పించుకుని డాక్టర్‌గారూ నాకు చనిపోవాలని ఉంది. చాలా భయంగా ఉంది. మీ ఆర్టికల్స్ చదివాను, మీ టీవీ షోస్ చూశాను. మీరు చెప్పిన విషయాలు విన్న తరువాత జీవితంపై ఆశ కలిగింది. అందుకే మీ దగ్గరకు వచ్చాను. నిజంగా ఇది తగ్గుతుందా? జీవితాంతం ఈ సమస్యకు పరిష్కారం లేదని అంటున్నారు. నిజం చెప్పండి " అంటూ కన్నీళ్లు పెట్టుకుంది. చూడమ్మా హెపటైటిస్ అనేది కాలేయానికి సంబంధించినది. మానవ శరీరంలో కాలేయం అతి ముఖ్యమైన భాగం. ఈ వైరస సోకగానే బయటకు ఎటువంటి లక్షణాలు కనిపించవు. కొంతకాలంపాటు ఆ వైరస్ శరీరంలో నిద్రాణంగా ఉంటుంది.

### హెపటైటిస్-బి అంటే ఏమిటి?

ఏకారణం చేతనైనా కాలేయం దాని సహజపరిమాణం కంటే వాచి వ్యాధిగ్రస్తం కావడాన్ని హెపటైటిస్ అంటారు. సాధారణ భాషల్లో దీన్ని పచ్చకామెర్లు, పసరికలు, జాండిస్ అని పిలుస్తుంటారు. ఈ వ్యాధి వైరస్ కారణంగా సంక్రమిస్తుంది. చాలా మందికి కాలేయం దెబ్బతినే వరకు హెపటైటిస్ ఉన్న విషయం తెలియదు. వ్యాధిని గుర్తించే సమయానికి తీవ్రమవుతుంది.

### కారణాలు

రక్తదానం, వీర్యం, కలుషితమైన రక్తం, దానికి సంబంధించిన ప్లేట్‌లెట్స్, ప్లాస్మా వంటివి శరీరంలోకి ఎక్కించినపుడు స్టెరిలైజ్ చేయని సూదులు, సిరంజిలు వాడటం, ఒకేసూదితో ఎక్కువ మంది పచ్చబొట్టు వేయించుకోవడం, ఒకేటూత్‌బ్రష్ ఎక్కువ మంది వాడటం, ఇతరులు ఉపయోగించిన బ్లేడ్‌లు వాడటం, హెపటైటిస్ ఉన్న వారితో లైంగిక సంబంధాలు పెట్టుకోవడం వల్ల వైరస్ సంక్రమించే అవకాశం ఉంది.

### లక్షణాలు

చాలా మంది హెపటైటిస్ రోగుల్లో లక్షణాలు బయటపడవు. వ్యాధి ముదిరే కొద్ది లక్షణాలు బయటపడుతుంటాయి. తరుచుగా జ్వరం, ఒళ్లనొప్పులు, మూత్రం, కళ్లలో పచ్చదనం, మలం తెల్లగా రావడం, రోగనిరోధక శక్తి తగ్గడం, తరచుగా తలనొప్పి, కండరాల నొప్పులు, గొంతులో నొప్పి,వెలుతురు చూడలేకపోవడం, భోజనం రుచించకపోవడం వంటి లక్షణాలుంటాయి. హెపటైటిస్ వ్యాధి క్రానిక్‌గా మారినపుడు లివర్ సిర్రోసిస్, లివర్ ఫెయిల్యూర్, లివర్ కేన్సర్ వచ్చి లక్షణాలు బయటపడతాయి. ఈ దీర్ఘవ్యాధి బయటపడటాని 5 నుంచి 20 సంవత్సరాల సమయం పడుతుంది.

అన్ని విషయాలు వివరంగా చెప్పిన తరువాత ఆ ముఖంలో కొంచెం ఆశ కనిపించింది. మీరు చెప్పినట్లు ట్రీట్‌మెంట్ తీసుకుంటాను అంది. శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు పరిశీలించి మందులు ఇచ్చాను. లక్షణాలను బట్టి మందులు మార్చుతూ వచ్చాను. ఏడాదిపాటు ట్రీట్‌మెంట్ కొనసాగించాను. ప్రతినెల ఆమెలో శారీరకంగా, మానసికంగా ఆమెలో చాలా మార్పు కనిపించింది. ఆకలి పెరిగింది. బాగా యాక్టివ్ అయింది. ఏడాది తరువాత పరీక్ష చేస్తే వైరల్ లోడ్ డిటెక్షన్ లిమిట్‌కు వచ్చింది. ఆమె ఎంతో సంతోషించింది. భార్యాభర్తలిద్దరూ ఎంతగానో కృతజ్ఞతలు చెప్పారు.




**నిధి సాలోచనగా పరిసరాలను పరికించి చూశాడు. ఎక్కడా ఏ విధమైన అలికిడీలేదు. గోరంట పొదమీదనుండి ఉత్తరీయాన్ని తీసుకుని, రక్తం మరకల్ని కాసేపు చూస్తూ ఉండి పోయాడు. అవి రక్తం మరకలే; సందేహం లేదు. అవి అవని నెత్తురు మరకలే అయి ఉంటాయి. ఉత్తరీయం ఆమె శరీరం మీదే ఉండి ఉంటుంది. నిధిలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.**

అవనిని ఎవరో బలవంతంగా, ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా తీసుకెళ్ళారు. ఆమె ప్రతిఘటించింది. ఓడిపోయింది. ఆమెనుండి దూరమైపోయి, పొదకి తగులుకున్న ఉత్తరీయం ఆ సంగతిని స్పష్టం చేస్తోంది. ఆమెను అపహరించిన వ్యక్తి లేదా వ్యక్తులు సరోవరంలోని తామరపువ్వుల్ని తెంపుకుని వెళ్ళి ఉంటారు. నిధి ఆలోచిస్తూ దూరంలో కనిపిస్తున్న చెట్ల గుంపు వైపు చూశాడు. చెట్లకి అటువైపున పొగ పైకి లేస్తూ, ఆకాశంలో వ్యాపిస్తోంది. అక్కడ ఏదో నిప్పు ఉంది. నిప్పు లేకపోతే పొగరాదు. అక్కడ ఎవరో ఉన్నారు. ఎవ్వరూ లేకపోతే నిప్పు రాజుకోదు!

నిధి వాయు మీద చేతిని వేశాడు. శ్వేతాశ్వం అతని దగ్గరగా జరిగింది. కొలనువైపు వచ్చే టప్పుడు తను గుర్రం గురించి ఆలోచించలేదు. కళ్ళెమూ, జీనూ వేయలేదు. నిధి ఆలోచించడం మాని గుర్రం మీదికి చేరాడు. ముందుకు వంగి, వాయుని ప్రేమగా నిమిరాడు. "వాయూ, మనం పొగ వస్తున్న ప్రదేశానికి వెళ్ళాలి! పద!" అన్నాడు. వాయు కదిలింది.

***

మెలికలు తిరుగుతున్న కాలిబాట మీద వాయు పరుగుతీస్తూ, వృక్షాల గుంపును సమీపించింది. నిధి చేతిస్పర్శతో గుర్రం వేగాన్ని తగ్గించి, చెట్ల మధ్య నడవనిచ్చాడు. లీలగా ఏవో చర్మవాద్యాల శబ్దాలు వినిపిస్తున్నాయి. నిధి అశ్వాన్ని ఆపాడు. చెట్లు అరణ్యంలా లేవు; అడ్డుగోడలా ఉన్నాయి. కొంచెం దూరంలోని సమతల ప్రదేశంలో వందలాది ఇళ్ళు కనిపిస్తున్నాయి. గ్రామం! గ్రామానికి ఒక వైపునుండీ పొగ ఆకాశంలోకి లేస్తోంది. ఆ పొగ ఏదో అగ్నికార్యాన్ని సూచిస్తోంది. చర్మవాద్యాల మోత ఏదో ఉత్సవాన్ని సూచిస్తోంది. నిధి చెయ్యి కదిలింది. అశ్వం గ్రామం వైపు వేగంగా వెళ్ళ సాగింది.

వాయు కాసేపట్లో గ్రామాన్ని సమీపించింది. ఎక్కడి నుండో వస్తున్న సన్నపాటి ఏరు ఎక్కడికో ప్రవహించుకు పోతోంది. స్వచ్ఛంగా ఉన్న నీటిలోనుంచి చిన్నచిన్న బండలూ, రాళ్ళూ కనిపిస్తున్నాయి. ఏటిమీద దూలాలతో నిర్మించిన కర్ర వంతెన. గుర్రం వంతెన దాటింది. పూరి పాకలు, మట్టిమిద్దెలు, రాతిమిద్దెలు, అక్కడక్కడా చిన్న చిన్న మేడలు కనిపిస్తున్నాయి. ఇళ్ళ తలుపులన్నీ మూసి ఉన్నాయి. ఇళ్ళ ఆవరణలలో పశువులున్నాయి. ప్రతీ ఇంటి ద్వారం ముందూ పంజరం. పంజరంలో పక్షులు. ఇరుకు సందులోంచి నిధి గుర్రం ప్రధానవీధిలోకి తిరిగింది. నిధి అప్రయత్నంగా గుర్రాన్ని ఆపాడు. విశాలమైన వీధి.

## జరిగిన కథ

**బా**కీపడ్డ కప్పం చెల్లించేందుకు, యువరాణిని కాపాడేందుకు నవనిధుల సాధనకు బయలుదేర తాడు నిధి. హరిహరపురం చేరిన నిధి, అశ్వత్థామ సహాయంతో, శరభాద్రి చెరనుంచి వాయుని విడి పిస్తాడు. దారిలో చిన్ని అనే యువతిని ఆటవిక స్త్రీల బారినుంచి రక్షిస్తాడు. అక్కడినుంచి బయలు దేరిన నిధికి భూమాత దర్శనమిస్తుంది. అవనిగా, ఓ మానవ కాంతగా తనను తాను విశ్లేషించుకుం టుంది భూమాత. కొలనులో స్నానానికి వెళ్ళిన అవని జాడలేకుండా పోతుంది.

ఆ తర్వాత...

రెండు వైపులా పెద్దపెద్ద అరుగులున్న రాతి మేడలు. పొడవుగా ఉన్న వీధి చివర అడ్డుగా కట్టిన గోడలా, ఎత్తయిన, చిన్న కొండ. నల్లగా, నునుపుగా ఉన్న కొండ. కొండరాతి మీద ఏదో విగ్రహం చెక్కబడి ఉంది. ఎత్తుగా, బలంగా ఉన్న విగ్రహం. ఆ విగ్రహం కాళ్ళు పెద్ద ఏనుగు తొండాల్లా ఉన్నాయి. చేతులు గున్న ఏనుగు తొండాల్లా ఉన్నాయి. వెడల్పుగా ఉన్న వక్ష భాగం. దానికింద బోర్లించిన పెద్ద బానలా కడుపు! ముఖ్యంగా ఆ విగ్రహానికి రెండు తలలు. రెండు తలల వెనుక భాగాలు ఆనుకుని ఉన్నాయి. అటు ఒక ముఖం. ఇటు ఒక ముఖం. రెండు నోళ్ళూ పెద్దగా తెరచుకుని ఉన్నాయి.

రెండు తలల దేవుడు! ఏ దేవుడో! గ్రామదేవతో, గూడెం దేవతో అయ్యుండాలి! ఆడా మగా, చిన్నా పెద్దా – అందరూ విగ్రహం ముందు, వీధికి రెండు వైపులా క్రిక్కిరిసి ఉన్నారు. ఇళ్ళ తలుపులు ఎందుకు మూసి ఉన్నాయో అర్థమవుతోంది నిధికి. కోలాహలంగా చర్మవాద్యాలు మ్రోగుతున్నాయి. ఆ దరువు మధ్య మధ్య ఉన్నట్టుండి 'కుయ్' అంటూ కొమ్ము మ్రోగుతోంది. ఒక దృశ్యం నిధి చూపుల్ని ప్రత్యేకంగా ఆకర్షిస్తోంది.

నేల మీద నుండి, విగ్రహం ముఖాల సమీపా నికి మొరటుగా రూపొందించిన రాతి మెట్లున్నాయి. విగ్రహం కుడివైపు మెట్లమ్మట పురుషులు వరసగా ఎక్కుతున్నారు. ప్రతీ పురుషుడూ రెండు చేతుల్లో పెద్ద ముంతను పట్టుకున్నాడు. విగ్రహం ముఖాన్ని సమీపించిన వ్యక్తి, చేతుల్లోని ముంతను ఒకసారి నుదురుకు తాకించుకుని, ముంతను విగ్రహం నోట్లోకి వంపుతున్నాడు. తెల్లటి ద్రవం విగ్రహం నోట్లోకి ధారగా కారుతోంది...

మనిషి తరువాత మనిషి. ముంత తరువాత ముంత. తెల్లటిద్రవం, పాలు కాబోలు... విగ్రహం నోట్లోకి మాయమవుతోంది! పురుషులు వందలాదిమంది చీమలబారులా మెట్లెక్కుతున్నారు. ద్రవం అర్పించు కున్న భక్తులు క్రిందికి దిగుతున్నారు.

విగ్రహం ఎడమ ముఖం వైపున్న మెట్లమ్మట స్త్రీలు ఎక్కుతున్నారు. దోసిళ్ళలో గోధుమ రంగులో గుండ్రటి ముద్దలున్నాయి. ఆ ముద్దలు పెద్ద వెలగ పండు పరిమాణంలో ఉన్నాయి. విగ్రహం ముఖాన్ని సమీపించగానే దోసిళ్ళలోని ముద్దలను కళ్ళకి అద్దు కుని, పెద్దగా తెరచుకున్న విగ్రహం నోటిలోకి వదులు తున్నారు స్త్రీలు! స్త్రీలు కూడా చీమలబారులాగే!

స్త్రీలు ఘనాహారం. పురుషులు ద్రవాహారం! ఆ ఘన, ద్రవ నైవేద్యాలు ఎక్కడికెళ్తున్నాయి? విగ్రహం బానబొజ్జలోకా?! ఆ బొజ్జలో అన్ని ముద్దలు పట్టేంత స్థలం ఉందా! నిధి గుర్రం దిగి, నెమ్మదిగా ముందుకు నడిచాడు. ఇప్పుడు అతని చూపులు విగ్రహం పాదాల వద్ద ఉన్నాయి. పాదాల ముందు అగ్నిగుండం మండుతోంది. పూజారులు ముంతలతో నేతిని పోస్తు న్నారు. ముంతను వంపినప్పుడల్లా పొలికేకల్లా అరు స్తున్నారు. అర్థం లేని అరుపు, తనకు అర్థం కాని అరుపు! నిధి గుర్రాన్ని ఒక ఇంటిచాటున నిలబెట్టాడు. దాని శరీరాన్ని ఒకసారి నిమిరి వీధిలోకి వచ్చాడు. ఎదురుగా రెండిళ్ళ మధ్య నుండి ఒక వృద్ధుడు తడ బడుతూ వస్తున్నాడు. అతని చేతిలో పొడుగాటి కర్ర ఉంది. ఆ కర్ర అటూఇటూ కదులుతూ అతను నడిచే దారిని పరిశీలిస్తోంది! నిధి వృద్ధుడి ముఖంలోకి చూశాడు. వృద్ధుడి కళ్ళు ఉండాల్సిన చోట రెండు గుంటలన్నాయి! ఆ గుంటల మీద తెల్లబారిపోయిన కనుబొమలు..

నిధి అప్రయత్నంగా ఆ వృద్ధుడి వైపు నడిచాడు. చేతికర్రతో దారిని 'చూస్తున్నాడు' వృద్ధుడు.

"తాతా... ఎక్కడికెళ్లాలి?" నిధి అడిగాడు.

"ఏదో అరుగుమీద కూచోవాలి.." వృద్ధుడు అన్నాడు.

నిధి అతని చేతిని పట్టుకున్నాడు. "రా తాతా... కూర్చోబెడతాను."

వృద్ధుడు కుడిచేతిలోని కర్రను నిధి పట్టుకున్న ఎడమ చేతిలోకి మార్చుకున్నాడు. కుడిచేత్తో నిధి చేతిని పట్టుకున్నాడు.

'ఎవరు నాయనా నువ్వు... కొత్తవాడిలా ఉన్నావు? ఈ ఊళ్లో అన్నిచేతులూ నాకు తెలుసు!" వృద్ధుడు నిధి చేతిని నిమురుతూ అన్నాడు.

"నాది ఈ ఊరు కాదులే తాతా! ఎక్కడికో వెళ్తూ, దారితప్పి ఇక్కడికి వచ్చాను" నిధి వృద్ధు డిని అరుగువైపు నడిపిస్తూ అన్నాడు.

"అలాగా! నీ అదృష్టం బాగుండి దారి తప్పా వులే! రావాల్సిన చోటికి, రావాల్సిన సమయంలో వచ్చావు. ఈ 'భేరుండవనం' గ్రామంలో, ఆ గండ భేరుండదేవర జాతర సమయానికి వచ్చావు. ఆ జోడు శిరస్సుల గండభేరుండ దేవర నీ దారి తప్పిం



చాడు...."

"నిజమే అనిపిస్తోంది తాతా! ఆ జోడు తలల దేవుడి నోళ్ళలోకి భక్తులు ఏవో అర్పిస్తున్నారే... ఎన్ని ముంతలు! ఎన్ని ముద్దలు!" నిధి అన్నాడు.

"ఆ దేవర శక్తి అంతా ఇంతా కాదు నాయనా! మగభక్తులు, ఆ దేవర నోట్లో కల్లు అర్పించు కుంటారు. ఆడభక్తులు గోధుమరంగుతో ఉన్న అన్నం ముద్దలు అర్పించుకుంటారు. ఆ దేవుడికి నోళ్ళు రెండ యినా, బొజ్జ ఒక్కటే! నువ్వు భక్తితో ఎన్ని వందల, వేల ముంతల కల్లైనా పోసుకో; ఎన్ని వందల, వేల ముద్దల అన్నమైనా వేసుకో! ఆ బంగారు బొజ్జ నిండదు! ఆ గండభేరుండ దేవర ఆరగించి, అరిగించేసుకుం టాడు."

"అగ్నిగుండం.. ఏమిటి తాతా?"

"ఆ దేవుడికి ఇష్టమైన నిప్పుసేవ నాయనా అది. ఆ అగ్గిలో గుగ్గిలం వేస్తారు. నెయ్యి పోస్తారు. మూలిక వేస్తారు. తామరపువ్వులేస్తారు! మా ఇల వేల్పు గండభేరుండ దేవుడంటే నాకు ఎనలేని భక్తి. అందరూ అగ్నిగుండంలో ముంతలతో నెయ్యిపోస్తారా? నేనేమో భక్తితో పెచ్చరిల్లిపోయి ఆ దేవర బొజ్జంత బానతో నెయ్యి పోసేశాను. మంట మింటికెగిసి, నా కళ్ళను కాల్చేసింది! రెండు తలల దేవర సేవలో కళ్ళు పోగొట్టుకుని కబోది అయిపోయాను. అయితేనేం! నలభయ్యేళ్ళుగా బతుకు లాగేస్తున్నా కదా!" వృద్ధుడు ఉత్సాహంగా చెప్పాడు.

"తామరపువ్వులు ఆహుతి చేస్తారన్నావు. అడవి దగ్గరున్న కొలనులోంచి కోసుకొస్తారా?" నిధి అడిగాడు.

"అంతేగా! గంపెడు తామరలు కావాలిగా! పూజారి కాపాలి శిష్యులతోవెళ్ళి తామరలు కోసి తెచ్చా డట. స్వయంగా ఆయన తామరపువ్వుల కోసం వెళ్ళిన ప్రతీసారీ ఏదో ఒక అద్భుతం జరుగుతుంది! ఈసారి ఏం జరిగిందో తెలుసా!" వృద్ధుడు ఉత్సా హంగా అడిగాడు.

"ఏం జరిగింది తాతా? కోయకుండానే పువ్వులు ఎగిరి గంపలో పడ్డాయా?" నిధి అమాయకత్వం నటిస్తూ అన్నాడు.

"కొలనులో కమలాల మధ్య కన్నెపిల్ల కనిపించిం దట! తామరపువ్వులతో బాటు ఆ కన్నె పిల్లనూ తీసుకొ చ్చారట! అంతా మా గండభేరుండ దేవర జేసే లీల!"

నిధి ఆవేశాన్ని నిగ్రహించుకుంటూ, మళ్ళీ అమాయ కత్వం ధ్వనించేలా అడిగాడు "పువ్వుల్ని అగ్నిగుం డంలో ఆహుతి చేసినట్టే, ఆ కన్నెపిల్లను గండభేరుండ దేవరకి బలిచ్చేస్తారా?"

"ఛఛ! మా రెండు తలల దేవుడు నరబలి కోరడు నాయనా! తామరపువ్వులు కోసే వేళలో కొలనులో కన్నెపిల్ల ఉంటే, ఆ పిల్ల పూజారి ఇల్లాలైపోతుంది. అది ఆచారం! మా పూజారి కాపాలికి ఆ విధంగా ఇద్దరు ఇల్లాళ్ళు దొరికారు. ఇద్దరు పెళ్ళాలున్నారన్న మాటే గానీ సంతులేదు. తను పోయాక పూజలు చేయడానికి వారసుడుండాలిగా పూజారికి! తొంభ య్యేళ్ళొచ్చేసినయ్ గదా, పాపం!"

"అలాగా, అయితే ఆట్టేకాలం ఉండే అవకాశం..." నిధి అన్నాడు.

"వారసుడు 'జనిమించే'దాకా వందేళ్ళయినా పోవడానికి లేదులే! గండభేరుండ దేవర వరం అది! ఇద్దరు పెళ్ళాల కతల్లో తిరకాసుందిలే! మొదటి ఇల్లాలు మేనమామ కూతురే! కాపాలిని మనువాడే ఆశతో, సమయం చూసి, కొలనులో దిగింది. రెండోది రోగిష్ఠి. ఈసారి దొరికిన చిన్నది అన్నిందాలా చక్కగా ఉందట! ఈసారి మా పూజారికి వారసుడు పుడ తాళ్ళే!" వృద్ధుడు ఉత్సాహంగా అన్నాడు.

"తొంభైయేళ్ళ ముసలి వగ్గు అంటున్నావుగా తాతా..." నిధి చిన్నగా నవ్వాడు.

"పూజారి కాపాలికా? ఆయన వయిసుతో పనే ముంది నాయనా?" తేలిగ్గా అన్నాడు. "ఆయన తాళి కడతాడు. కడుపున కాయగాసేది ఆ రెండు శిరసుల దేవర దయ! సంసారం చేసేది ఆ పూజారి మొగుడు కాదు నాయనా... ఆ గండభేరుండ దేవర.. ఆ!"

"గండభేరుండ దేవరా?" నిధి ఆశ్చర్యంగా అన్నాడు.

"ఆ దేవుడు ప్రతీ పున్నమినాడూ కాపాలి మీదికి పూనకంగా వస్తాడు. పేరుకు పూజారి... కన్ను దెరి చేదీ, కడుపు పండించేదీ గండభేరుండ దేవరే! చుట్టు పక్కల జనం అందరికీ ఎరుకైన గొప్ప సత్తెం గదా ఇది! ఇద్దరు ఇల్లాళ్ళ వరస సరిగాలేదు, కడుపులు పండలేదు. ఈ పూట తాళి కట్టించుకునే పిల్ల, ఏడాది తిరిగేలోగా కవలపిల్లల తల్లి కావాల్సిందే! కన్నుతెరచి, కనికరించేదీ, కాపాలిలో పరకాయ ప్రవేశం జేసేదీ గండభేరుండ దేవరే గద!"

"కవలపిల్లలా?"

"ఆ! మా దేవుడికి కవల శిరస్సులు గంద! మరిచి పోయావా?" వృద్ధుడు నవ్వుతూ అన్నాడు. "వెళ్ళు... వెళ్ళి ముంతడు కల్లు అర్పించుకో! అన్నట్టు నీకు మను వైందా?"

"లేదు తాతా?"

"కన్నెపిల్లతో మా కాపాలి పూజారి కల్యాణం జూసిపో! ఆరు పున్నమలు తిరిగేలోగా నీకు మను వవుతుంది!"

"కాపాలి కల్యాణం చూసే వెళ్తాను తాతా!" నిధి అన్నాడు.

***

నిధి జనంలో దూరుతూ, మోచేతి బలం ఉప

**గండభేరుండ దేవర ఉత్సవం జరుగుతోంది. భక్తుడిలాగా జనాల్లో కలిసిపోయాడు నిధి. అక్కడే ఉన్న వివాహ వేదిక వైపు నడిచాడు. అక్కడే ఓ పళ్ళెంలో అంగుళానికి ఒక్కటి చొప్పున పసుపుకొమ్ములు కూర్చి కట్టబడిన దండ. మధ్యలో గుండ్రంగా ఉన్న పెద్ద పసుపు కొమ్ము! మంగళసూత్రం...నిధి దృష్టి దానిమీద నుంచి పరిసరాల మీదకు మళ్ళింది. అవని కోసం అన్వేషిస్తున్నాడతను. మరి అతని అన్వేషణ ఫలించిందా? అవని కనిపించిందా?**

యోగిస్తూ ముంతలలో కల్లు అందజేస్తున్న చోటికి చేరుకున్నాడు. పెద్దపెద్ద బానలు వరసగా పెట్టి ఉన్నాయి. ఒక్కొక్క బాన ముందు ఒక వ్యక్తి నిలుచు న్నాడు. బానల దగ్గరగా ఉన్న ముంతలతో, భక్తులకు కల్లు అందిస్తున్నారు బానల ముందు నిలుచున్న భక్తులు. నిధి తనకు అందించిన ముంతను రెండు చేతుల్లో పట్టుకుని భక్తుల వెంట నడవసాగాడు. కల్లు వాసన గాలిలో ఘనీభవించినట్టుంది. భక్తులు గండభేరుండ దేవర బొజ్జను కల్లుతో నింపే ముందే భక్తితో తమ బొజ్జలు నింపుకున్నట్టున్నారు. కల్లు సమర్పించుకున్న భక్తులే మళ్ళీమళ్ళీ ముంతలతో వస్తున్నారు; దేవుడికి కల్లు మళ్ళీ మళ్ళీ సమర్పించు కుంటున్నారు!

గండభేరుండ దేవరమీద తనకు భక్తి ఉందో లేదో, ఉండాలో, అవసరం లేదో నిధికి తెలీదు. తను ఒక సాహసం చేయాలి. అందుకోసం ఊసరవెల్లిలా పరిసరాల్లో కలిసిపోవాలి. ఆలోచనల్లో మునిగిన నిధి తాను గండభేరుండ దేవర శాశ్వతంగా తెరిచే ఉంచు కున్న నోటి ముందుకు చేరినట్టు గుర్తించాడు. అందరి లాగే భక్తి నటిస్తూ కల్లును దేవర నోట్లో సమర్పించు కుని, వెనుదిరిగి మెట్లు దిగసాగాడు. అతని కళ్ళు పరిసరాలను పరిశీలిస్తున్నాయి. అవని ఎక్కడుందో, ఎక్కడ ఏస్థితిలో ఆమెను ఉంచారో తెలీదు. పూజారి కాపాలి కల్యాణం దర్శించమన్నాడు వృద్ధుడు. అంటే ఆ పెళ్ళి భక్తులందరూ 'దర్శించుకునేలా' బహిరంగంగా జరుగుతుందని అర్థమవుతోంది. ఆ సమయంలో తాను చేయిచేసుకోవాలి. ఈలోగా వివాహ వేదిక ఏదో తెలుసుకోవాలి. అశ్వాన్ని అందుబాటులో, అను వైన ప్రదేశంలో సిద్ధంగా ఉంచుకోవాలి. నిధి ఆలో చిస్తూ విగ్రహం ముందు హోమం జరుగుతున్న చోటికి వెళ్ళి, చూస్తూ నిలుచున్నాడు. పొలికేకల మంత్రా లతో తామరపువ్వుల్ని అగ్నిగుండంలో వేస్తున్నాడు పూజారి. ఎత్తయిన ఆసనం మీద ప్రత్యేకంగా కూర్చున్న వ్యక్తి పూజారి కాపాలి అని నిధి గ్రహించాడు.

శరీరమంతటా అతని వయసు ఎంతో లిఖించినట్టు తెలుస్తోంది. అస్థిపంజరంలా ఉన్న శరీరానికి అతుక్కు పోయి, ముడతలుపడిన ముసలి చర్మం. చర్మంలోంచీ పైకి కనిపిస్తున్న నీలిరంగు నరాలు. ముగ్గుబుట్ట లాంటి తల. తెల్లగా మెరుస్తున్న గుబురు కనుబొమలు. వాటి కింద చిన్నచిన్న ఏనుగు కళ్ళు మిణుగురు పురు గుల్లా మెరుస్తున్నాయి. బోసి నోరు. ఎముకలు పైకి పొడుచుకు వచ్చినట్లున్న రొమ్ముమీద పచ్చ పొడవ బడిన గండభేరుండ దేవర తలలు! ఈ ఎండుపుల్ల, పండుటాకు అవనిమెడలో తాళి... నిధి నవ్వకుండా ఉండలేక పోయాడు.

అతని చూపులు పక్కకి తిరిగాయి. అగ్నిగుండా నికి కొంచెం దూరంలో వివాహవేదిక రూపొంది,



## ఎనిమిది గంటలు అక్కడే గడుపుతోందట!

***టా**లీవుడ్ జేజమ్మ అనుష్కశెట్టి పెరిగిన బరువును తగ్గించుకోవడానికి పడుతున్న పాట్లు అందరికీ తెలిసినవే! కాకపోతే ఆమె ప్రయత్నాలేవీ ఇంత వరకూ సత్ఫలితాన్ని ఇవ్వలేదు. దాంతో ముంబయి నుంచి ట్రైనర్‌ని పిలిపించుకుని ఆయన పర్యవేక్షణలో ఎక్సర్‌సైజులు చేస్తోంది, ఇందుకోసం ఎనిమిది గంటలు జిమ్‌లోనే గడుపుతోందట! బయట ఎవరినీ కలవడానికి కూడా ఇష్టపడడం లేదట! బరువు తగ్గిన తరువాతే బయట కనపడాలని జేజమ్మ డిసైడ్ అయిందట! ఈ ప్రయత్నం అన్నా ఫలించి తమ అభిమాన హీరోయిన్ మునుపటిలా తయారైతే చూడాలని ఆమె అభిమానులు తెగ ఎదురు చూస్తున్నారట!*



సిద్ధంగా ఉంది! ఐరేని కుండలు వివిధ వర్ణాల చిత్రాలతో మెరుస్తూ ఒకదానిమీద ఒకటిగా, దొంతరలుగా నాలుగు మూలల్లో పెట్టి ఉన్నాయి. వాటి మధ్య కంబళి పరచి ఉంది. పళ్ళేలలో ఆకులూ, పువ్వులూ ఉన్నాయి. ఒక పళ్ళెంలో బియ్యం మీద జాగ్రత్తగా పెట్టబడిన వస్తువు నిధి దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షిస్తోంది. అంగుళానికి ఒక్కటి చొప్పున పసుపు కొమ్ములు కూర్చి కట్టబడిన దండ. మధ్యలో నిమ్మకాయ ఆకారంతో గుండ్రంగా ఉన్న పెద్ద పసుపు కొమ్ము! పసుపుతాడు, మంగళసూత్రం... నిధి చిరునవ్వు నవ్వుకుంటూ వెనుదిరిగాడు. ఉత్సవం చూడటానికి వచ్చిన భక్తుడిగా అటూ ఇటూ తిరుగుతూ తన అన్వేషణ కొనసాగించాడు. తాను వివాహ వేదికకు దూరంగా ఉండాలి. అదే సమయంలో మెరుపు వేగంతో వేదికను, అవనిని చేరుకోవాలి. అంతేవేగంతో అశ్వాన్ని చేరుకోవాలి... అవనిని తీసుకుని. కాసేపట్లో నిధి ఒక నిర్ణయానికి వచ్చాడు. వాయుని ఉంచిన ప్రాంతంవైపు నడిచాడు. తనకు తెలుసు. తన శ్వేతాశ్వం వాయు చాలామంది దృష్టిని ఆకర్షిస్తుంది. ఆ విధంగా తన కదలికలకు చక్కటి అవకాశం కల్పిస్తుంది. తన సాహసం భక్తుల్ని గందరగోళంలో పడేస్తుంది. సగం మంది తమ పూజారిని చూస్తూ ఉండిపోతారు. సగం మంది తన గుర్రాన్ని చూస్తూ ఉండిపోతారు. ఒకవేళ అందులో కొందరు తనను చూస్తూ, ఆవేశపడితే వాళ్ళను నిరుత్సాహ పరచడానికి తన కత్తి ఉంది!

***

ఉన్నట్టుండి వాద్యఘోష దరువు మారింది. ఎవరో బిగ్గరగా అరిచారు. "గండభేరుండ దేవరా!"

వందలాది కంఠాలు అందుకున్నాయి. వాద్యఘోష విజృంభించింది. ఎన్నో జేగంటలు మ్రోగుతున్నాయి. భక్తుల గుంపు గండభేరుండ దేవర నామధేయాన్ని బిగ్గరగా మూడుసార్లు పలికారు. పూజారి కాపాలి ఏదో అరిచారు. అది మాటకాదు; దేనికో సంకేతం. హోమగుండం దగ్గర్నుంచీ ఇద్దరు వ్యక్తులు జనం వైపు వస్తున్నారు. ఒకతని తలమీద వెడల్పాటి మట్టిపాత్ర ఉంది. పాత్ర కంఠానికి తోరణంలా మామిడాకులు కట్టి ఉన్నాయి. రెండో వ్యక్తి చేతిలో వేపమండ ఉంది. జనం వాళ్ళ వైపు ఎగబడుతున్నారు. పాత్రలో ఏదో తీర్థం ఉన్నట్టుంది. వేపమండల్ని అందులో ముంచి, అందరిమీదా చల్లుతున్నాడు వేపమండ వ్యక్తి. జనం భక్తితో చేతులు జోడించి తలలు వంచుతున్నారు.

తీర్థప్రోక్షణ జరుగుతూ ఉండగానే వాద్యసంగీతం పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు వేరే వాద్యాలు సున్నితంగా మ్రోగుతున్నాయి, వేరొక కార్యక్రమాన్ని సూచిస్తూ. నిధి నిలుచున్న చోటి నుండే కాపాలి వివాహ వేదిక చక్కగా కనిపిస్తోంది. జనం క్రమపద్ధతి పాటిస్తూ, వీధికి రెండువైపులా బారులుగా కూర్చుంటున్నారు. పూజారి కాపాలి వివాహాన్ని అందరూ వీక్షించాలి కద! పెళ్ళికాని వాళ్ళందరికీ ఆరు పున్నములలోగా పెళ్ళిళ్ళు కావాలి కద! నిధి రెప్పపాటు లేకుండా చూస్తున్నాడు. అతని కళ్ళు అవని రాకకోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాయి.

ఐరేని కుండల మధ్య పూజారి కాపాలి ఠీవీగా కూర్చున్నాడు. అతని బోసినోరు నీళ్ళు నముల్తున్నట్టు కదుల్తూనే ఉంది. అతని దగ్గరగా లావుపాటి వ్యక్తి కూచున్నాడు. గుబురుగా ఉన్న గిరజాల జుత్తు. నల్లటి ముఖం మీదా, శరీరం మీదా ఎర్రటి గీతలు. కుంకుమతో గీతలు రాసుకున్నట్టున్నాడు. మెలితిరిగిన బుర్రమీసాలతో, ముందున్న పళ్ళేలను అటు ఇటూ సర్దుకున్నాడు. పెళ్ళి జరిపించే వ్యక్తిలా ఉన్నాడతను.

"కూన! కూన!" ఉన్నట్టుండి అరిచాడతను.

నిధి గుండె దడదడ కొట్టుకుంది. 'కూన' అంటే 'పిల్ల' అనీ, పిల్ల అంటే పెళ్ళికూతురనీ అతనికి అర్థమైపోయింది. లావుగా, పొట్టిగా ఉన్న ఇద్దరు స్త్రీలు పెళ్ళికూతుర్ని పట్టుకుని నడిపించుకుని తీసుకొస్తున్నారు. పెద్దపెద్ద మట్టిగాదెల మీద పెట్టిన పెద్దగుమ్మడికాయల్లా ఉన్నాయి వాళ్ళ తలలు.

"పూజారోడి ఇల్లాళ్ళే పట్టుకొస్తున్నారు పెళ్ళికూతుర్ని! కళ్ళు తెరిచి, చూడే! ఇల్లాలంటే యెట్టా ఉండాలో ఆ తల్లుల్ని జూసి నేరుసుకో!" ఎవరో పురుషుడు భార్యతో అంటున్నాడు.

నిధి చెవులు వింటున్నా, కళ్ళు మాత్రం వధువు మీదే ఉన్నాయి. ఎర్రచీర కొంగు ఆమె తల మీద నుండి ముసుగులా వేలాడుతోంది. ముఖం కనిపించడం లేదు. వధువు కట్టుకున్న చీర 'అవని' చీర కాదు. వస్త్రాలు వేరే అయినా, ముఖం కనిపించకపోయినా – ఆమె అవని అని నిధికి తెలుసు. ఆకర్షణీయమైన సన్నటి ఆకారం, ఆ నడక, అవనివే! రెండు లావుపాటి తుమ్మమొద్దుల మధ్య తీగలా ఉంది అవని.

పెళ్ళి జరిపించే వ్యక్తి సైగతో అవనిని వరుడి సరసన కూర్చోబెట్టి, తలమీదుగా ముఖాన్ని కప్పిన చీర కొంగును వెనక్కి లాగారు. నిధి ఊపిరి బిగబట్టి చూశాడు. అవని శిరోజాలు నెత్తి మీద మూటలా కట్టి ఉన్నాయి. ముఖమంతా నిలువుగా పసుపు, కుంకుమల గీతలున్నాయి. నుదురు మీద పసుపు దట్టించి ఉంది. దానిమీద నుదురు మధ్యలో కనుబొమల నుండి, తల వెంట్రుకల దాకా, పెద్దగా, గుండ్రంగా ఎర్రటి బొట్టు. తను ఎప్పుడో, ఎక్కడో చూసిన గ్రామదేవతలా ఉంది అవని! అవని చలనం లేకుండా, తన అసమ్మతిని తెలియజేయకుండా బొమ్మలా కూచుంది! ఎందుకు? ప్రశ్నను వెంటాడుతూ సమాధానం అంది వచ్చింది నిధికి. ఆమె మీద ఏ మత్తుమందో ప్రయోగించబడింది. బలవంతంగా ఏదో తాగించి ఉంటారు. సందేహం లేదు!

పెళ్ళివాద్యాలు ఊపు అందుకున్నాయి. పెళ్ళి జరిపిస్తున్న వ్యక్తి ఏదో గొణుగుతూ సైగ చేశాడు. ఎక్కణ్ణుంచో ఇద్దరు ఆడవాళ్ళు వచ్చారు. చెరోకుండను తలమీద మోస్తున్నారు. కాపాలి భార్యలు ఎడంగా జరిగారు. ఆడవాళ్ళు కుండలను వంపారు. పసుపు పచ్చటి ద్రవం 'కుండపోత'గా అవని మీద పడుతోంది. ఎర్రటిద్రవం పెళ్ళికొడుకు కాపాలి మీద పడుతోంది. అతను అరచేతుల్ని కళ్ళకు అడ్డంగా పెట్టుకున్నాడు. అవని రాతివిగ్రహంలా చలనం లేకుండా కూచుంది. కుంకుమ వర్ణంలో వరుడు! పసుపు వర్ణంలో వధువు!

జనం ఉత్సాహంగా అరుస్తున్నారు. వాద్యాలు రెచ్చిపోతున్నాయి. పళ్ళెంలో ఉన్న పసుపు కొమ్ముల దండను అందుకున్నాడు పెళ్ళి జరిపించే వ్యక్తి. ఏదో గొణుగుతూ, ఆ దండను 'ఉఫ్' అంటూ మూడుసార్లు ఊదాడు. 'ముడి! ముడి! ముడి!' అంటూ కాపాలికి అందించాడు. కాపాలి బోసినోరు తెరచి నవ్వుతూ, మెల్లగా పైకిలేచాడు. ముందుకు వంగాడు. జనం హర్షధ్వానాలు వాద్యాల శబ్దాన్ని మ్రింగేస్తున్నాయి.

నిధి కుడి చెయ్యి కదిలింది. అతను కాలక్షేపంగా రూపొందించిన దోదుమ్మి గాలిలో దూసుకెళ్ళింది. పసుపుకొమ్ముల మాలను పట్టుకున్న కాపాలి చేతిని బలంగా తాకింది. కాపాలి బిగ్గరగా అరిచాడు. ఏం జరిగిందో ఊహించేలోగా పసుపుకొమ్ముల మాల ఎగిరి ఎక్కడో పడింది. దోదుమ్మి తన లక్ష్యాన్ని ఛేదించి ప్రయోగించిన చేతివైపు అంతే వేగంతో దూసుకెళ్తోంది. నిధి దోదుమ్మిని ఒడుపుగా పట్టుకుని దట్టీలో భద్రపరిచాడు.

కాపాలి మణికట్టు విరిగినట్టుంది. అతను గావుకేకలు పెడుతున్నాడు. అతని భార్యలు గోలగా అరుస్తున్నారు. నిధి ఒక్కసారి ఈలవేసి, పెళ్ళి వేదికవైపు పరుగెత్తాడు. కాపాలి కిందపడి దొర్లుతూ మూలుగుతున్నాడు. అతని భార్యలు ఏడుస్తున్నారు. పెళ్ళి చేయించడానికి వచ్చిన వ్యక్తి దొర్లుతున్న కాపాలిని కదలకుండా పట్టుకునే ప్రయత్నంలో ఉన్నాడు. అంతసేపూ బొమ్మలా కూచున్న అవని మెల్లగా లేచి నిలబడింది. మెరుపు వేగంతో ఆమెను సమీపించిన నిధి అవలీలగా ఆమెను ఎత్తి భుజం మీద బోర్లా వేసుకున్నాడు.

తడిసిపోయిన వస్త్రాల్లో ఉన్న అవనిని భుజం మీద మోస్తున్న నిధి కల్లు బానలున్నవైపు పరుగెత్తాడు.

శ్వేతాశ్వం వాయు సకిలింతా, దాని గిట్టల చప్పుడూ అతనికి వినిపిస్తున్నాయి. జనం అరుస్తున్నారు. ఆశ్చర్యంతో బంగారు గీత ఉన్న తెల్లటి గుర్రాన్ని చూసి వాళ్ళు అరుస్తున్నారని నిధికి తెలుసు. నేలమీద పడి మూలుగుతూ దొర్లుతున్న పూజారి, తన గుర్రం భక్తుల దృష్టిని ఆకర్షించాయి. తన ఊహ తప్పలేదు!

నిధి పరుగు ఆపి, ఒక ఇంటి ముందున్న అరుగు మీదికి గెంతాడు. తిరిగి చూశాడు. గండభేరుండ దేవర పాదాల వద్ద ఉన్న అగ్నిగుండం దగ్గరగా ఆగి, అసహనంగా కదను తొక్కుతోంది వాయు. నిధి మళ్ళీ బిగ్గరగా ఈల వేశాడు. గుర్రం అతనివైపు తిరిగింది. జనం మధ్యలో దూరుతూ తన వైపు పరిగెట్టుకు వస్తోంది. జనం ఆశ్చర్యంగా చూస్తున్నారు.

గుర్రం అడుగు దగ్గరగా ఆగింది. నిధి రెప్పపాటులో గుర్రం మీదికి చేరాడు. అతని చేతి స్పర్శను అర్థం చేసుకున్న గుర్రం పరుగు ప్రారంభించింది. జనం తేరుకుని ఏం జరుగుతోందో అర్థం చేసుకునేలోగా, గుర్రం వీధి చివరికి చేరుకుంది. తమ ఊరి పూజారి మనువాడబోతున్న పెళ్ళికూతుర్ని ఎవరో గుర్రం మీద తీసుకెళ్ళిపోతున్నాడని అర్థం చేసుకున్న జనం గోలగా అరుస్తూ వీధిలో పరుగు ప్రారంభించారు. ప్రధాన వీధిలోంచి మలుపు తిరుగుతూ, గుంపుగా, పొలికేకలు పెడుతూ వెంటాడే ప్రయత్నం చేస్తున్న జనాన్ని వాలుగా చూస్తూ, అశ్వాన్ని హెచ్చరించాడు నిధి. వాయు




గాలిని రెండుగా చీల్చుకుంటూ దూసుకెళ్తోంది.

ఎవరో యువకుడు అడ్డంగా, ఉపవీధుల గుండా పరుగెడుతున్నట్టున్నాడు... అశ్వం వంతెనను చేరేసరికి, అతనూ వంతెనను చేరుకున్నాడు. ఒక్కసారిగా గంతేసి, నిధి కుడి కాలును పట్టుకున్నాడు. నిధి బలంగా కాలిని లాక్కున్నాడు. మళ్ళీ పట్టుకోవడానికి ప్రయత్నిస్తూ, గుర్రం దగ్గరగా పరుగుతీస్తున్న యువకుడి ఎదమీద కుడికాలు మోపి, నిధి బలంగా తన్నాడు. యువకుడు ఎగిరి నీళ్ళలో వెల్లకిలా పడి, మునిగిపోయాడు. ఉక్కిరిబిక్కిరవుతూ నీళ్ళలోంచి, పైకి లేచి తేరుకుని చూసేసరికి నిధి గుర్రం పెట్టని గోడలా ఉన్న చెట్లను సమీపిస్తోంది. యువకుడు ఏటిలోంచీ గట్టుమీదికి చేరుకుని, గుర్రం కోసం చూశాడు. ఆశ్చర్యంతో అతని నోరు తెరుచుకుంది. శ్వేతాశ్వం సరోవర ప్రాంతాన్ని దాటి అరణ్య సమీపానికి తెల్లటి మబ్బులా దూసుకుపోతోంది. పరుగెట్టుకు వచ్చిన గ్రామ యువకులు, నీటిలోంచీ వెలికి వచ్చిన యువకుడిని ప్రశ్నార్థకంగా చూస్తూ నిలుచున్నారు. అతను నిరాశగా భుజాలు ఎగరేసి, గ్రామం వైపు బరువుగా అడుగులు వేయసాగాడు. అందరూ అతన్ని అనుసరిస్తున్నారు.

***

గత రాత్రి విశ్రమించిన ప్రాంతంలో గుర్రాన్ని ఆపి క్రిందికి దిగాడు నిధి. అవనిని నెమ్మదిగా భుజం మీద నుండి పచ్చిక మీదికి చేరవేశాడు. వెల్లకిలా, తడి బట్టలలో పడుకున్న ఆమె వైపు ఆందోళనగా చూశాడు. ఆమె కళ్ళు మూసుకునే ఉన్నాయి.

"ఎందుకు ఆగావు?" అవని కళ్ళు మూసుకునే ప్రశ్నించింది.

నిధి ఉలిక్కిపడి చూశాడు. అవని లేచి కూర్చుని, అతనివైపు తలెత్తి చూస్తూ, చిరునవ్వు నవ్వింది.

"నువ్వు... నువ్వు ఏదో మత్తులో ఉన్నావనుకున్నాను?" నిధి కంఠంలో ఆశ్చర్యం.

"పెళ్ళిమండపానికి తీసుకురాకముందే మత్తు వెలిసిపోయింది. అది తెలిస్తే, మళ్ళీ మత్తు మందు ప్రయోగిస్తారన్న భయంతో మత్తులోనే ఉన్నట్టు నటించాను.."

"భయపడ్డావా?"

"మొదట్లో అపహరణకు గురి అయినప్పుడు, ఆ రాక్షసుడూ, వారి భార్యలూ బలవంతంగా మత్తు మందు నా గొంతులో పోసినప్పుడు భయపడ్డాను. నా కోసం కాసేపు చూసి నువ్వు వస్తావన్న నమ్మకం ఉంది నాకు. వేదిక వద్దకు రాగానే, మేలిముసుగు లోంచి నిన్ను చూశాను. భయం పారిపోయింది!"

"ఇంతకీ ఏం జరిగింది అవనీ?"

"స్నానం ముగించి, చివరిసారిగా నీళ్ళల్లో మునకవేసి, పైకిలేచాను. నా ముందు ఆరుగురు యువకులున్నారు నీళ్ళలో! వాళ్ళవెనక ముసలి దరిద్రుడు గట్టుమీద నిలుచున్నాడు. వాడి చేతిలో ఒక తామర ఉంది. నన్ను చూడగానే "కూన! కూన!" అంటూ అరిచాడు.

"సింగా, దేవరిచ్చిన కూనని ఒడిసిపట్టుకో... మనువాడి మగడవుతా! రేయ్... మీరు తామరలన్నీ తెంపండెహె! అన్నాడు ముసలాడు. వంతెన మీద నీచేత తన్నులు తిని నీళ్ళలో పడిపోయాడే... వాడే సింగడు. నన్ను బలంగా పట్టుకుని భుజం మీద వేసుకున్నాడు. పెనుగులాడాను. గోళ్ళు దిగేలా రక్కేశాను. వాడి ముఖం మీద రక్తం చిమ్మింది. నా మీద ఉన్న నీ ఉత్తరీయంతో రక్తం తుడుచుకున్నాడు. ఉత్తరీయాన్ని పొదల మీదికి విసిరాడు. ఆ రాక్షసుడు యేమన్నాడో తెలుసా? 'మా ముసలి పూజారి పసుపు కొమ్ముల దండేసినా, నిన్ను ఏలుకోలేడు. పళ్ళులేని వాడు చెరకు గడ నమల్లేడుగా! నేనున్నాలే! ఏలుకుంటా!' అన్నాడు!" అవని ఆగి, నవ్వింది.

నిధి బిగ్గరగా నవ్వాడు. "నా భుజం మీద మత్తులో ఉన్నట్టు, కదలిక లేకుండా ఉండి పోయావు. ఎందుకు? భయమా!"

అవని తల అడ్డంగా ఊపింది. "ఆ సింగడు అనే రాక్షసుడు నీలాగే నన్ను భుజం మీద బోర్లా వేసుకున్నాడు. ఆ క్షణాల్లో, అసహ్యంగా, భయంగా అనిపించింది. నువ్వు భుజం మీద వేసుకున్నప్పుడు ఏదో రక్షణగా, తోడుగా, భద్రంగా, ధైర్యంగా అనిపించింది. ఆ అనుభూతులను ఆస్వాదిస్తూ అలాగే ఉండిపోయా!"

"నీ విశ్లేషణ బాగుంది! వీలైనంత త్వరగా మనం ఈ ప్రాంతానికి దూరంగా వెళ్ళిపోవాలి!" నిధి అన్నాడు.

"ఔను... వెళ్ళిపోదాం" అవని పైకి లేస్తూ అంది.

నిధి పొద సమీపంలో ఉంచిన గుర్రానికి అమర్చే పరికరాల వైపు అడుగులు వేశాడు.

***

వాయు వాయువేగాన్ని అందుకునే ప్రయత్నంలో పరుగెడుతోంది.

"ఉదయం చిన్న కొయ్యముక్కతో చేసిన ఆయుధం అద్భుతంగా ఉపయోగపడింది!" నిధి వెనుక కూర్చున్న అవని అంది.

"మొదట్లో బాకు విసరాలనుకున్నాను. కానీ అది తిరిగి రాదు!" నిధి నవ్వాడు. "ఇంత త్వరగా దోదుమ్మిని ప్రయోగించాల్సి వస్తుందని నేను ఊహించలేదు."

"వాడి మణికట్టు విరిగినట్టుంది. పెళ్ళికూతుర్నీ, పసుపుకొమ్ములతాడునీ మరిచిపోయి, చేతిని పట్టుకుని రోదిస్తూ ఉండిపోయాడు."

"ఆ పసుపుకొమ్ముల తాడు నీ మెడలో పడి ఉంటే ఏమయ్యేదో తెలుసా?"

"ఏమయ్యేది? నేను వాడి భార్యనయ్యేదాన్నిగా?"

"కాదు... నీకు గండభేరుండ దేవర భర్త అయ్యేవాడు. ఎలాగో చెప్తా విను!" అంటూ నిధి గ్రుడ్డి ముసలివాడు చెప్పిందంతా వివరించాడు. "ప్రతీ పున్నానికీ గండభేరుండ దేవుడు పూజారిగారిలోకి పరకాయ ప్రవేశం చేసేవాడట! నిన్ను ఏలుకోడానికి!"

అవని పగలబడి నవ్వింది. "నిధీ, ముందుగా ఈ ఎర్రవస్త్రాలకి అంటిన పసుపు రంగును వదిలించుకోవాలి!"

"అందుకేగా, ఆగకుండా వస్తున్నాం! అదిగో... ఎదురుగా నది మనల్ని రమ్మంటోంది" నిధి అన్నాడు.

కాసేపట్లో స్వచ్ఛమైన జలప్రవాహంతో ఉన్న నదిని చేరుకున్నారు ఇద్దరూ. నిధి క్రిందికి దిగి, చేతుల సహాయంతో అవనిని దింపాడు. నది అవతలి గట్టుకి కొంచెం ఎత్తుగా ఉన్న ప్రదేశంలో పెద్ద నల్లరాయి ఉంది. దాని మీద కొంచెం చిన్న నల్లరాయి. దానిమీద ఇంకొంచెం చిన్నరాయి. రాయి మీద రాయి. పైనవున్న రాయి కొబ్బరికాయ ఆకారంలో కలశంలా ఉంది. అయిదు నల్లరాళ్ళు ఒకదాని మీద ఒకటి కూర్చుని ఆలయగోపురం ఆకారాన్ని సంతరించుకున్నాయి.

ఉన్నట్టుండి రాగయుక్తంగా ఒక శబ్దం ఆ ప్రదేశంలో గంభీరంగా ధ్వనించింది. చాలా పెద్దదైన, అద్భుతమైన పురుషకంఠం ఉచ్చరించిన శబ్దం అది. ఆ శబ్దం ప్రణవనాదం. నిధీ, అవనీ భయాందోళనలతో ముఖాలు చూసుకుని, చెవులు రిక్కించారు.

గుహలోంచీ ప్రతిధ్వనిస్తున్న సింహనాదంలా మళ్ళీ బిగ్గరగా, రాగయుక్తంగా వినవచ్చింది ఆ నాదం, "ఓమ్..."

**(ఇంకా వుంది)**



**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

# హెపటైటిస్, హెర్పిస్‌లకు దీటైన వైద్యం

## హెపటైటిస్

ఈమధ్యకాలంలో చాలా మందిని భయపెడుతున్న వైరస్ ఇది. ఇతర జబ్బులకు చికిత్స కోసం వెళ్లినపుడు, అనుకోకుండా చేసిన పరీక్షల్లో హెపటైటిస్ ఉన్నట్లు భయటపడుతుంది. దాంతో ఇక తమ జీవితం ముగిసనట్టేనని నిర్ధారణకు వస్తారు. ఈ వైరస్ శరీరంలో నుంచి పూర్తిగా పోదని, దీర్ఘకాలంలో కాలేయం దెబ్బతినే అవకాశం కూడా ఉందని వైద్యులు చెప్పడంతో వాళ్ల ఆ నిర్ణయానికి వస్తారు. నిజానికి హెపటైటిస్ వైరస్‌ను కట్టడి చేసే మందులు హోమియోలో ఉన్నాయి. హెపటైటిస్ ఉందని నిర్ధారణ అయ్యాక భయపడకుండా హోమియో వైద్యం తీసుకుంటే ఆరోగ్యవంతమైన జీవితం గడిపే అవకాశం దక్కుతుంది. ఆకలి వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. కడుపులో ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి వంటి లక్షణాలు ఉంటాయి. అయితే అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో పూర్తికాలం మందులు వాడితే హెపటైటిస్ వైరస్ పూర్తిగా నియంత్రణలోకి వస్తుంది.

## హెర్పిస్ సింప్లెక్స్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. సాధారణ పొక్కులే కదా అని వాటిని నిర్లక్ష్యం చేస్తారు. కానీ ఆ నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు మాదిరిగా తయారవుతాయి. పురుషుల్లోనే కాకుండా స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి ఉంటుంది. ఈ సమస్యకు చికిత్స తీసుకోకుండా వదిలేస్తే అనేక ఇతర సమస్యలకు దారితీస్తుంది. శృంగార జీవితం దెబ్బతింటుంది. సుఖం దూరమవుతుంది. దంపతుల మధ్య గొడవలకు కారణమవుతుంది. అయితే హెర్పిస్ సమస్యకు హోమియో వైద్యం అద్భుతంగా పనిచేస్తుంది. ఇతర వైద్య విధానాల్లో చికిత్స తరువాత మళ్లీ వ్యాధి తిరగబెడుడుతంది. కానీ హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు. శృంగార జీవితం ఆనందమయం అవుతుంది.

# సయాటికా నొప్పి సమూలంగా తగ్గింది

**"డాక్టర్‌గారు,** ఎన్ని డబ్బులు ఖర్చయినా పర్వాలేదు, నాకు ఈ నడుంనొప్పి తగ్గేలా చూడండి. జీవితాంతం మీకు రుణపడి ఉంటాను" అంటూ ఓ మధ్య వయస్సు వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. ముందు కూర్చుని నిదానంగా వివరాలు చెప్పమని అడిగా. అందుకు ఇలా చెప్పుకొచ్చాడు. "సార్... నా పేరు నారాయణ. మాది కర్నూలు. ఇక్కడే ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాను. నాకు ఏడాది క్రితం నడుం నొప్పి ప్రారంభమైంది. ప్రారంభంలో కొద్దిగానే ఉండేది. క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది. నొప్పి నడుంలో నుంచి కాలికి, పాదాల వరకు వ్యాపించింది. అడుగు తీసి అడుగు వేయాలంటే కష్టమవుతోంది. ఒక్కోసారి కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. డాక్టర్‌కు చూపిస్తే సయాటికా సమస్య అని చెప్పారు. పెయిన్‌కిల్లర్స్ రాసిచ్చారు. వాడినప్పుడు ఉపశమనంగా ఉంటుంది. తరువాత మళ్లీ మామూలే. మీరే నాకు పరిష్కారం చూపించాలి" అంటూ వేడుకున్నాడు. ఆయన చెప్పినదంతా ఓపిగ్గా విని ఏం భయపడాల్సిన పనిలేదని సయాటికా సమస్యకు శాశ్వత పరిష్కారం చూపిస్తానని మాటిచ్చాను.

### చికిత్స తరువాత

నారాయణ చెబుతున్న లక్షణాలు, మానసిక అంశాలను పరిశీలించి మందులు ఇచ్చా. సయాటికా సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పిని పూర్తిగా దూరం చేయవచ్చు. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల ఫలితం ఉంటుంది. నెలరోజులు మందులు వాడి మళ్లీ కనిపించమని చెప్పా, నెల తరువాత వచ్చినపుడు కొంచెం ఉల్లాసంగా ఉన్నాడు. నొప్పి తగ్గిందనే ఆనందం ఆయన ముఖంలో స్పష్టంగా కనిపించింది. కాళ్లలో తిమ్మిర్లు కూడా తగ్గాయన్నాడు. నొప్పి తగ్గింది కదా మందులు మానేయకుండా పూర్తి కోర్సు వాడమని సూచించా. ఆరు నెలల తరువాత సయాటికా సమస్య పూర్తిగా పోయింది. యథావిధిగా ఉద్యోగం చేసుకుంటున్నాడు. అయితే వెహికిల్‌పై ఎక్కువ తిరగడం, ఎక్కువ సమయం కూర్చోవడం చేయకూడదని కొన్ని జాగ్రత్తలు చెప్పి పంపించా.

# హెచ్ఐవి ఉన్నా జీవితం ఉంది

కరీంనగర్ బ్రాంచ్‌లో టేకప్ చేసిన కేసు ఇది. అతనికి 30 ఏళ్లు ఉంటాయనుకుంటా.. చాలా ఆందోళనగా ఉన్నాడు. సమస్య ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. సార్, మాది జమ్మికుంట. నాలుగేళ్ల క్రితం ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ అమ్మాయికి ఎటువంటి జబ్బు ఉన్నట్లుగా అనిపించలేదు. రెండు నెలల నుంచి నాకు జ్వరం, దగ్గు, విడవకుండా మోషన్స్ అవుతున్నాయి. డాక్టర్ దగ్గరకు వెళితే పరీక్ష చేసి హెచ్ఐవి ఉందని అన్నారు. బరువు కూడా బాగా తగ్గాను. నాకైతే బతుకాతననే ఆశ లేదు. ఎలాగైనా మీరే కాపాడాలి అంటూ కన్నీటి పర్యంతమయ్యాడు. భయపడాల్సిన పనిలేదని ధైర్యం చెప్పి మరికొన్ని వివరాలు తీసుకున్నా.

**చికిత్స తరువాత :** హెచ్ఐవి సోకిన వారిలో చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడంపైనే దృష్టి పెడుతుంది. అతనికి పరీక్ష చేయిస్తే సీడీ కణాల సంఖ్య 320 ఉంది. భయపడాల్సిన పనిలేదని వెంటనే చికిత్స ప్రారంభిద్దామని చెప్పి మందులు రాశా. ఒక నెల రోజులు మందులు వాడి మళ్లీ కనిపించమన్నా. నెల రోజుల్లో అతనిలో చాలా మార్పొచ్చింది. ఆకలి పెరిగిందన్నాడు, నీరసం తగ్గిందన్నాడు. మళ్లీ జీవితంపై నాకు ఆశలు కలుగుతున్నాయని చెప్పుకొచ్చాడు. మరో నెల రోజుల పాటు మందులు వాడమని సూచించా. ఆ తరువాత మరోసారి సీడీ4 కౌంట్ పరీక్ష చేయిస్తే 710 వచ్చింది. ఇప్పుడు తను అందరిలాగే సాధారణ జీవితం గడుపుతున్నాడు.




**వలచి, వలపించాడు కృష్ణుడు. గోపికలు ఆనందించి, ఆ ఆనందంలో అర మోడ్పుగా కళ్ళు మూసారు. అంతే! అదృశ్యుడయ్యాడు కృష్ణుడు. గోపికలు కళ్ళుతెరచి చూసేసరికి కనిపించకుండాపోయాడు. కనిపించని కృష్ణుని అన్వేషిస్తూ గోపికలు వెదకని పొదలేదు. వినిపించని సొదలేదు. పొగడకొమ్మలూ, మొగలిగుబురులూ చూసిచూసి అక్కడెక్కడా కృష్ణుడు లేడని అల్లాడిపోయారు. విరహాగ్నిలో వేగి పోయారు.**

# కృష్ణుని రాసక్రీడ-గోపికల జలక్రీడ

కృష్ణుడు బృందావనిలో లేడు. మరెక్కడ ఉన్నట్టు? గోపికలంతా కూడబలుక్కున్నారు. యమునాతీరానికి చేరుకున్నారు. అక్కడి ఇసుక తిన్నెల్లో పవళించారు. వెన్నెల్లో విరహవేదన అనుభవిస్తూ, కనిపించని కృష్ణునికి మొరపెట్టుకున్నారిలా.

నాథా! ఎక్కడ ఉన్నావయ్యా! నీకోసం వెదకని చోటు లేదు. కరుణామూర్తివంటారే! నీకీ కినుక తగునా? విషజలాలనుండి, కాళీయుని వాడికోరలనుండి మమ్మల్ని కాపాడావే! ఆర్తత్రాయపరాయణుడివే! అలాంటివాడివి, మన్మథుని కరకుటమ్ములకు మమ్మల్ని బలి చేసి, తప్పుకోవడం భావ్యంగా ఉందా? కృష్ణా! నువ్వు యశోదానందనుడివేకాదు, సర్వాంతర్యామివి. పరమేశ్వరుడవు. బ్రహ్మప్రార్థన అనుసరించి, ఈ భూమిపై వెలిశావు. మహనీయుడవు. మా సంసార బాధపోగొట్టి, నీ చేతిని మా శిరస్సుపై ఉంచి, అభయాన్ని ప్రసాదించు.

గోవులవెంట తిరిగే గోపకుల పాపాల్ని హరించే వాడివి, నీ వెంటే తిరిగే మమ్మల్ని ఎందుకు దూరం చేస్తున్నావు? ఏ పాపాలు చేశామని మమ్మల్నిలా ఏటిపాలు చేస్తున్నావు. నీ చరణాలు వెదురుపొదల్లో కాదయ్యా ఉండాల్సింది, మా గుండెల మీద ఉండాలి. నీ చరణాలకింద మా మన్మథబాధ నలిగిపోవాలి. నుగ్గునుగ్గయిపోవాలి. నీ నవ్వు, నీ కడగంటి చూపు, నీ విలాసవిహారం, నీ మంజులాలాపం మా గుండెల్లో గట్టిగా నాటుకున్నాయయ్యా! కాని నువ్వు మాత్రం కనిపించక దాగుంటున్నావు. శోకహరణం, సంభోగకాంక్షావర్ధకం, మురళీగానమాధురీ మిళితం నీ అధరామృతం మాకందించవయ్యా! మా తపన చల్లార్చవయ్యా!

అయినవాళ్ళు, బంధువులు, పెద్దలు వద్దు వద్దన్నా వినలేదు. నీ వేణుగానం విన్నంతనే పరిగెత్తుకు వచ్చాం. వచ్చినందుకా ఇంతటి శిక్ష? మా మొర లాలకించవేమి? కృష్ణా! రావా! కనరావా! ఇంతలా వేడుకుంటున్నా నీ మనసు కరగడం లేదంటే... అది బండరాయే! కాదు కాదు వజ్రసమానం.

వగరుస్తూ, విలపిస్తూ, తలపోస్తూ, తపించిపోతున్న గోపికలను చూసి జాలిచెందాడు కృష్ణుడు. జగన్మోహనమైన సుందరాకారంతో వారి ముందు ప్రత్యక్షమయ్యాడు. కట్టెదుట కృష్ణుడు. నమ్మలేకపోయారంతా. అంతలోనే పట్టుకుని చూసి, పొంగిపోయారు. ప్రాణాలు లేచివచ్చినట్టనిపించి, కృష్ణా అన్నారు ముక్తకంఠంతో. ఓ గోపిక చేతులు జోడించి నమస్కరించిందతనికి. నమస్కరిస్తూనే అతని చేతిని ఆలంబనగా చేసుకుని నిల్చుంది. మరో గోపిక, కృష్ణుని మరో చేతిని అందుకుని, ఆ చేతిని గుండెలపై ఉంచుకుని కళ్ళు మూసుకుంది. దీర్ఘంగా నిట్టూర్చింది. ఇంకో గోపిక, కృష్ణుని చెంపకు చెంపనాన్చింది. మరో గోపిక, కృష్ణుని పాదాలను గట్టిగా పట్టుకున్నది. కౌగలించుకున్నది వాటిని. ఇంకో గోపిక అలక కనబరిచింది. పళ్ళు పటపటకొరికి, కోపం నటించింది. కృష్ణుడు రమ్మని పిలుస్తున్నా వినిపించుకోనట్టుగా కదలక ఉన్నచోటనే ఉంది.

కృష్ణుడు ఒక్కడు. గోపికలు అంతమంది. చుట్టుముట్టారతన్ని. సూటిపోటిమాటలాడారు.

వలచి వలపించి ఎక్కడికి పోయావు కృష్ణా?

నన్ను కాదనిపోడానికి నీ మనసెలా ఒప్పిందో!

**గోపికలందరినీ దగ్గరగా తీసుకున్నాడు కృష్ణుడు. ఆ వెన్నెలరాత్రి వారిని యమునానదిలోకి తీసుకుపోయాడు. తపనతో తడబడుతున్న చెలులను సందిట చేర్చుకున్నాడు. ఆ కౌగిలి మందారమల్లికాది కుసుమ పరిమళాలు వెదజల్లింది. కృష్ణుని కౌగిటచేరిన గోపికలందరికీ విరహవేదననుండి విముక్తి పొందినట్టయింది. ఆ తర్వాత చిరుకోపంతో కృష్ణుడిపై ప్రశ్నలు కురిపించారు. వారేమని ప్రశ్నించారు? కృష్ణుడు ఏం చెప్పాడు?**

నీకోసమే బతికి ఉన్నాను కృష్ణా! బతికి లేనంటే నువ్వొచ్చిన క్షణం ప్రాణం పోసుకున్నాను.

వద్దుకృష్ణా! మళ్ళీ నన్నొదిలి పారిపోవద్దు!

ఏ పూర్వజన్మపుణ్యఫలమో! నిన్ను మళ్ళీ చూడగలిగాను. ఈ తనువు, నాలోని అణువణువూ నీదే కృష్ణా! స్వీకరించు.

ముద్దిచ్చి మాట్లాడవు. కౌగిలించుకుని కోరిక తీర్చవు. మనసిచ్చి మరలిపోతావు. మోసగాడివయ్యా! నిన్ను నమ్మను! నీ దగ్గరకు రాను!

అందరి అలకలూ కన్నాడు కృష్ణుడు. అందరి మాటలూ విన్నాడు కృష్ణుడు. కొందరిని కనుసైగ చేసి పిలిచాడు. మరికొందరిని మనసుతో మెలిపెట్టాడు. ఆఖరికి అందరినీ దగ్గరగా తీసుకుని ఆ వెన్నెల రాత్రి మెల్లమెల్లగా యమునానదిలోనికి తీసుకుని పోయాడు. తపనతో తడబడుతున్న చెలులను సందిట చేర్చుకున్నాడు. ఆ కౌగిలి మందార మల్లికాది కుసుమ పరిమళాలను వెదజల్లింది. గండుతుమ్మెదల ఝుంకారధ్వని వినిపించింది. రగలిపోతున్న మనసుకీ, తేలిపోతున్న కళ్ళకీ వెన్నెలవెలుగు కరగిపోయి, చీకటి అలముకున్నట్టయింది. ఆ చీకటిలో, కృష్ణునికౌగిటలో విరహవేదననుండి విముక్తిపొందినట్టయింది అందరికీ. ఊపిరి పీల్చుకున్నారంతా. చీర చెరగులతో మెత్తనిపీఠాన్ని ఏర్పరిచారు గోపికలు. దాని మీద కూర్చోమని కృష్ణుణ్ణి వేడుకున్నారు. కాదనలేదు కృష్ణుడు. కూర్చుని దేదీప్యమానంగా ప్రకాశించాడు. అప్పుడు అతని కాళ్ళను మెత్తగా ఒత్తుతూ చిరుకోపంగా, ప్రేమగా ప్రశ్నించారిలా.

కృష్ణా! ప్రేమిస్తేనే కొందరు ప్రేమిస్తారు. ప్రేమించకపోయినా కొందరు ప్రేమిస్తారు. ఈసడించుకున్నా, అసహ్యించుకున్నా కొందరు ప్రేమిస్తారు. ఎవరు ఏ కోవకు చెందుతారో దయచేసి చెప్పు?

సమాధానంగా ముందు నవ్వాడు కృష్ణుడు. తర్వాత అన్నాడిలా.

మిమ్మల్ని నేను ప్రేమించట్లేదనేగా మీరనేది. మీకు నేను కనుమరుగైనాననేగా మీ బాధ. మీరనుకుంటున్నట్టు నేను మిమ్మల్ని ఈసడించుకోవట్లేదు. అసహ్యించుకోవట్లేదు. నేను పరమకరుణామూర్తిని. మీ అందరికీ నిత్యబాంధవుణ్ణి. నిరంతరం మీరు నన్నే ధ్యానించాలని అప్పుడలా అదృశ్యుణ్ణయ్యాను.

మర్యాదమాట, ధర్మాధర్మాలమాట తలపెట్టక నాకోసం వస్తే, నేను మిమ్మల్ని కాదన్నందుకు నన్ను క్షమించండి. మీ విరహవేదన నాకు తెలియనిది కాదు. దానికి ఉపశమనం నా ధ్యానమని గుర్తించండి. నా వియోగం నేను చేసిన తప్పుగా భావించకండి.

తప్పు ఒప్పుకున్నాడు కృష్ణుడు. క్షమించమంటున్నాడు. కాదనలేకపోయారు గోపికలు. నవ్వుతూ అతని సాన్నిధ్యంలో పువ్వులైపోయారు. పువ్వుల్లా



ఉన్న ఒకొక్క గోపికకూ చేరువయ్యాడు కృష్ణుడు. అనేకంగా వెలిశాడు. అందరితోనూ వలయాకార పరిభ్రమణాలతో మనోహరంగా రాసక్రీడ ప్రారంభించాడు. మైమరపు కలిగించాడు. గోపికలు కొందరు వీణలు వాయిస్తే, కృష్ణుడు వారికి అనుగుణంగా వేణువూదాడు. ఆ గానానికి గాలికూడా పరవశమైంది. కాసేపటికి ఇంకొక రాసక్రీడ ప్రారంభించాడు కృష్ణుడు. ప్రతి గోపిక భుజాన తలవూని నవ్వసాగాడు. తర్వాత శంఖం, పద్మం, వజ్రం, కందుకం, చతుర్ముఖం, చక్రవాళాదిగా రకరకాలపద్ధతుల్లో రాసనర్తనాన్ని సాగించాడు. వివిధముద్రలతో, వేర్వేరు ఆకాశ సంచారప్రక్రియలతో క్రీడను కొనసాగించి, గోపికలగుండెలు దోచుకున్నాడు. కృష్ణుని రాసక్రీడ ఇటు గోపికలనేకాదు, అటు అమరులను కూడా మహదానందభరితుల్ని చేసింది. ఆ ఆనందానికి కృతజ్ఞతగా అమరులు పుష్పవృష్టి కురిపించారు. దిక్పాలకులు అనేకులు కృష్ణుని రాసక్రీడ తిలకించేందుకు విమానాలపై వచ్చి, ఆకాశాన నిలిచి చూశారు. పరమానందం పొందారు.

అలసి చిరుచెమటలు చిందిస్తున్న గోపికలు సహా కృష్ణుడు యమునానదీతీరంగాల్లో జలక్రీడకు సిద్ధమయ్యాడు. జల్లుపోరాటానికి రారమ్మన్నాడందరినీ. వచ్చారంతా. గోపికలంతా ఒకవైపు. కృష్ణుడొక్కడే ఒకవైపు. దోసిళ్ళతో నీరు జల్లుకున్నారు. తడిసిన దుస్తులతోనే పొదరిళ్లలోనికి ప్రవేశించారు. పచ్చికశయ్యపై పవళించారు. వివిధవిలాసాలతో, నిరంతరభోగాన్ని అనుభవించారు అని ఆగాడు వైశంపాయనుడు. జనమేజయుని ఇబ్బందిని గమనించాడతను. కృష్ణుని రాసలీలలు ఆసక్తిని కలిగించలేదు సరికదా, ధర్మం అనిపించలేదు జనమేజయునికి. అధర్మం అనిపించింది. గ్రహించాడది వైశంపాయనుడు. అందుకే ఆగాడతను. జనమేజయుణ్ణి చూశాడు. నీ అనుమానాల్ని నివృత్తి చేసుకో అన్నట్టుగా ఉంది ఆ చూపు.

మునీంద్రా! కృష్ణుని రాసక్రీడలు వింటుంటే ఆశ్చర్యంగా ఉంది. శ్రీహరి స్వయంగా ధర్మకర్త. ధర్మసంరక్షకుడు. ధర్మస్వరూపుడు. ధర్మసంరక్షణార్థమే అతను ఈ భూమ్మీద జన్మించాడు. అలాంటి అవతారపురుషునికి పరాంగన సాంగత్యం ధర్మం ఎలా అవుతుంది? ఒకవేళ ధర్మమే అనుకుంటే అది ఎలాంటి ధర్మం? కరుణించి నాకు ఆ వివరాలు తెలియజేయండి అడిగాడు జనమేజయుడు.

తప్పకుండా అన్నాడు వైశంపాయనుడు. సన్నగా నవ్వాడు. తర్వాత చెప్పాడిలా.

మహారాజా! అగ్నిదేవుడు సర్వభక్షకుడు. ఎలాంటి అమలినాన్ని దహించినా అతనికి దోషంలేదు. అలాగే మహాతేజోవంతులైన సూర్యచంద్ర దేవేంద్రాదులు ఎలాంటి దోషకృత్యాలు ఆచరించినా వారికీ దోషం లేదు. పరకాంతా సాంగత్యదోషం నుండి బయటపడగలిగేది ఆ పరమేశ్వరుడే! ఒక్క ముక్కంటి తప్ప కాలకూటాన్ని కుత్తుకలో నిలుపుకోగలిగినవాడు ఈ లోకంలో మరొకరున్నారా? లేరుకదా!

మహామహాయోగీశ్వరులే కృష్ణుని మనసారా ధ్యానించి, తమ కర్మబంధనాలను తుత్తునియలు చేసుకుంటున్నారు. అంతటిగొప్పవాడు కృష్ణుడు. అలాంటి కృష్ణుడు, ఏ తీరులో ప్రవర్తించినా అతనికి సంసారబంధనాది దోషాలు అంటే అవకాశం లేదు. పైగా గోపికలలో, గోపాలురలో సకలచరాచరసృష్టిజాలంలో ఉన్నది ఆత్మారాముడు ఆ పరమేశ్వరుడే! సర్వాత్మకుడైన కృష్ణుడే! ఆ కృష్ణుడే గోపికలతో లీలామాత్రంగా విహరించాడు. అంతేగాని అందులో తప్పు ఎంతమాత్రం లేదు.

వైశంపాయనుని సమాధానంతో జనమేజయుని అనుమానం తీరిపోయింది. దాంతో కృష్ణుని ధ్యానిస్తూ కళ్ళు మూసుకున్నాడు జనమేజయుడు. కాసేపటికి ధ్యానాన్ని ముగించి, కళ్ళు తెరిచాడు. అప్పుడు అతనితో చెప్పాడిలా వైశంపాయనుడు.

మహారాజా! అలా జలక్రీడలు ముగిసిన తర్వాత గోపికలు కృష్ణుని వీడ్కొని బ్రహ్మముహూర్తంలో ఇళ్ళకు చేరారు. వచ్చినవారిని ఎవరూ అదిలించలేదు. బెదిరించలేదు. శ్రీకృష్ణునిమాయామోహితులైన గోపికల బంధుజనం నోరిప్పలేదు. ఇంతరాత్రివరకూ ఎక్కడ ఉన్నారు? ఏం చేశారు? అన్న ప్రశ్నలే సంధించలేదు.

అలా కొద్దిరోజులు గడిచాయి.

ఒకనాడు యశోదానందులాదిగా గోపాలకులందరూ ఉమామహేశ్వరులను పూజించేందుకు అంబికావనానికి చేరుకున్నారు. ముందుగా అక్కడి సరస్వతీనదీజలాల్లో స్నానాలు ఆచరించారు. తర్వాత అత్యంత భక్తిశ్రద్ధలతో పార్వతీపరమేశ్వరులను పూజించారు. బ్రాహ్మణులకు బంగారం, వెండి, గోవులను దానం చేసి, నీటిని మాత్రమే స్వీకరిస్తూ, అక్కడే ఉపవాసవ్రతాన్ని ఆచరించసాగారు.

అర్ధరాత్రి దాటింది. ఏకాంతంగా నిద్రిస్తున్న నందుణ్ణి కాటు వేసి కబళించేందుకు ఒక సర్పం ముందుకు ఉరికింది. జరజరమన్న శబ్దానికి కళ్ళు తెరచి చూశాడు నందుడు. పాము కనిపించింది. భయపడ్డాడతను. కృష్ణా! కృష్ణా! అని కేకేశాడు. ఆసరికే పాము అతని పాదాన్ని అందుకుంది. విదిలించుకోజూశాడు నందుడు. అతనివల్ల కాలేదు. అప్పుడు మళ్ళీ మొరపెట్టుకున్నాడిలా.

కృష్ణా! పెనుపామొకటి నన్ను మింగజూస్తోంది. కాపాడు తండ్రీ!

నందుని కేకలకు చుట్టుపక్కల నిద్రిస్తున్న గోపాలురు మేల్కొన్నారు. పెద్దపెద్దకర్రలతో పరుగున వచ్చారక్కడకి. నందునిపాదాన్ని అందుకుని అతన్ని మింగజూస్తున్న పాముని చూశారు. కర్రలతో మోదారు దాన్ని. అయినా నందుని కాలొదిలి పారిపోలేదది. అప్పుడు కృష్ణుడు వచ్చాడక్కడికి. పాము మీద కుడికాలుపెట్టి, అదేపనిగా దానిని తొక్కితొక్కి మాంసం ముద్దను చేశాడు. చూస్తూండగానే ఆ మాంసంముద్ద చూడముచ్చటైన గంధర్వునిగా మారింది. కృష్ణునికి చేతులు జోడించి, అతనికట్టెదుట నిలిచింది. ఆశ్చర్యపోయాడు కృష్ణుడు. అడిగాడిలా.

గంధర్వోత్తమా! ఎవరు నువ్వు? ఇంత అందంగా ఉండి, బంగారురంగులో మెరిసిపోతున్న నువ్వు పాములా ఎలా మారావు? దానికి కారణం ఏమిటి? ఆ కథేమిటి? నీ పేరేమిటి?

—అరణి




## కథలతో తెలివితేటలు!

**త**ల్లులు పిల్లలకు చెప్పే కథలకూ వారి తెలివితేటలకూ సంబంధం ఉంది అంటున్నారు పరిశోధకులు. ఏడాది రెండు సంవత్సరాల వయస్సు ఉన్న పిల్లలను ఒడిలో కూచోపెట్టుకుని తల్లి వారికి చెప్పే కథల ద్వారా వారిలో తెలివితేటలు పెరుగుతాయన్న విషయం ఇటీవలి పరిశోధనలో వెల్లడైంది. 250 మంది తల్లీ బిడ్డల మీద వీరు సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. తల్లీబిడ్డల్ని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపులో ఉన్న తల్లులను పిల్లలకు కథలు చెప్పమని చెప్పారు. మరో గ్రూపు తల్లులు పిల్లలకు ఏమీ చెప్పలేదు. ఈ రెండు గ్రూపుల్లో ఉన్న పిల్లల వయస్సు ఏడాది నుంచి రెండు సంవత్సరాల లోపే! మూడు సంవత్సరాల అనంతరం పిల్లల తెలివితేటలను పరిశీలించారు. మొదటి గ్రూపులో ఉన్న పిల్లల్లో ఐక్యూ ఎక్కువగా ఉండగా, రెండవ గ్రూపులోని పిల్లల్లో అది కనిపించలేదు. మొదటి గ్రూపులో ఉన్న పిల్లలకు చిన్నతనంలో తల్లులు కథలు వినిపించడం వలనే వారిలో ఐక్యూ పెరిగిందని అధ్యయనకారులు అంటున్నారు. అయితే కేవలం కథలు వినిపించడం వలనే ఐక్యూ పెరుగుతుందా? అనే విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేకపోతున్నారు. పిల్లలకు కథలు చెప్పడం వలన చిన్నతనంలో ఆలోచనా శక్తి పెరిగే అవకాశం ఉందని వారు అంటున్నారు.





## కొవ్వును కరిగించే కొబ్బరినూనె?

**త**లకు మాత్రమే ఆరోగ్యాన్నీ, అందాన్నీ ఇచ్చే కొబ్బరినూనె శరీరంలో పేరుకుపోయిన కొవ్వును కరిగించడానికి సహాయపడుతుంది అంటున్నారు పరిశోధకులు. ఇందులో ఉండే మాధ్యమిక ట్రైగ్లిజరాయిడ్ ల్యూరిక్ యాసిడ్ జీవక్రియ సక్రమంగా జరిగేటట్టు చూస్తుందన్న విషయం ఇటీవల నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. అంతేకాకుండా కొబ్బరినూనెలో ఉండే లాంగ్ చెయిన్ ఫ్యాటీ యాసిడ్స్ శరీర భాగాల్లో పేరుకు పోయిన కొవ్వును కరిగించడానికి దోహదపడతాయని వారు చెబుతున్నారు. ఈ ఫ్యాటీ యాసిడ్ ఆకలిని నిరోధిస్తుందని అంటున్నారు. వీటి కారణంగా టైప్ 2 డయాబెటీస్ వచ్చే అవకాశాలు సన్నగిల్లుతాయని వారు అభిప్రాయపడుతున్నారు. కొబ్బరినూనెను ఆహారపదార్థాల తయారీలో ఉపయోగించడం వలన పలు రకాల ఆరోగ్య సమస్యల నుంచి సులభంగా తప్పించుకోవచ్చని వారు సూచిస్తున్నారు.

## టి.వి. చూస్తే నడవలేరట!

**అ**దేపనిగా టి.వి. చూసేవారిలో ఊబకాయం సహా రకరకాల ఆరోగ్యసమస్యలను గుర్తించిన పరిశోధకులు ఇప్పుడు మరో ఆరోగ్య సమస్యను కనుగొన్నారు. ముఖ్యంగా సాయం సమయంలో ఐదు గంటలకు మించి టీవీ చూసే వృద్ధులు రాబోయే కాలంలో నడిచే శక్తిని కోల్పోతారని అమెరికా పరిశోధకులు అంటున్నారు. వీరు 50 నుంచి 70 సంవత్సరాల వయస్సుగల 300 మంది వృద్ధుల మీద పది సంవత్సరాల పాటు అధ్యయనం నిర్వహించారు. వృద్ధుల రోజువారీ కార్యక్రమాలను, వ్యాయామం చేసే సమయాన్నీ, టీవీ వీక్షణం తదితర అంశాలను పరిశీలించారు. పది సంవత్సరాలు గడిచేసరికి వీరిలో పది శాతం మంది నడిచే శక్తిని కోల్పోయారు. వీరందరూ ప్రతిరోజూ సాయం సమయంలో ఐదు నుంచి ఆరు గంటల పాటు కుర్చీలో కూచుని టీవీ చూసే అలవాటు ఉన్నవారే. ఈ అలవాటే వీరిలో నడిచే శక్తిని హరించిందని అధ్యయనకారులు అంటున్నారు. ఎక్కువ సేపు ఒకే ప్రదేశంలో కూర్చుని ఉండడం వలన కండరాల్లో కదలిక తగ్గిపోతుందనీ, దాంతో శరీర భాగాలు సక్రమంగా పనిచేయవని వీరు అంటున్నారు. వృద్ధులు కేవలం ఒకేచోట కదలకుండా కూర్చోవడం వలన నడవలేకపోతున్నారా? లేదా మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద ఇంకా అధ్యయనాలు నిర్వహించాలని వారు చెబుతున్నారు.



## మౌనంతో మెదడుకు ఆరోగ్యం?

**మౌ**నంగా, నిశ్శబ్దంగా ఉండడానికీ మెదడుకీ అవినాభావ సంబంధం ఉంది అంటున్నారు పరిశోధకులు. బాగా ఒత్తిడికి గురైన సందర్భంలో ఎవరితోనూ మాట్లాడకుండా మౌనంగా ఉంటే ఒత్తిడి తగ్గిపోవడంతో పాటు కొత్త కొత్త ఆలోచనలు కూడా వస్తాయని వీరు చెబుతున్నారు. మౌనంగా ఉన్న సమయంలో మెదడులోని హిప్పోకేంపస్ అనే భాగంలో కొత్త కణాలు ఏర్పడతాయి. ఈ కణాలు కొత్త ఆలోచనలు రావడానికి సహాయపడతాయి. ఇదే విషయం మీద వీరు ఎలుకల మీద పరిశోధన నిర్వహించారు. వీటిని కొన్ని రోజుల పాటు ప్రశాంతమైన ప్రదేశంలో శబ్దాలు రాని చోట ఉంచారు. కొన్ని నెలల అనంతరం వీటి మెదడును పరిశీలించగా మెదడులోని హిప్పోకేంపస్ ప్రాంతంలో కొత్త కణాలు ఏర్పడడాన్ని వీరు కనుగొన్నారు. వ్యక్తిలోని భావోద్వేగాలను, జ్ఞాపకాలను, నైపుణ్యాన్ని హిప్పోకేంపస్ నియంత్రిస్తుంది. ఈ ప్రాంతంలో కొత్త కణాలు ఏర్పడడం వలన మన మెదడు మరింత చురుకుగా ఆరోగ్యంగా ఉంటుందని వారు చెబుతున్నారు. ఈ విషయం మీద ఇంకా పరిశోధనలు చేయవలసి ఉందని పరిశోధకులు అంటున్నారు. ఏది ఏమైనా సమస్య ఎదురైనప్పుడు ఒత్తిడికి గురికాకుండా ప్రశాంతంగా ఉండగలిగితే ఆలోచనలు పెరగడంతో పాటు ఆరోగ్యం కూడా బాగుంటుందని వారు సూచిస్తున్నారు.

—అవినాష్

# చతుర్దశ భువనములు


వాస్తు విద్వాన్, సాయిశ్రీ

*గౌ. డా. దంతూరి పండరీనాథ్*






సత్యలోకము
తపోలోకము
జనలోకము
మహా లోకము
స్వర్గలోకము
భువర్‌లోకము
భూలోకము
— ఊర్ధ్వలోకము

అతలము
వితలము
సుతలము
తలాతలము
రసాత లము
మహాతలము
పాతాళము
— అధోలోకము

విశ్వంలో భూలోకానికి క్రింద నున్న లోకాలను '**అధోలోకము**' అంటారు. అవి ఏడు 1) అతలము 2) వితలము 3) సుతలము 4) తలాతలము 5) రసాత లము 6) మహాతలము 7) పాతాళము. భూమి అపై ఉన్న లోకాలను '**ఊర్ధ్వలోకము**' అంటారు. ఇవి ఏడు 1) భూలోకము 2) భువర్‌లోకము 3) స్వర్గలోకము 4) మహా లోకము 5) జనలోకము 6) తపోలోకము 7) సత్యలోకము. ఇవి ఏడేడు (ఏడు + ఏడు) పద్నాలుగు లోకాలు. వీటినే '**చతర్ధశ భువనములు**' అంటారు. '**అ**'కార '**ఉ**'కార '**మ**'కారములతో కూడిన '**ఓం**'కార శబ్దమైన '**ప్రణవనాదం**' చతుర్ధశ భువనముల పర్యంతం విస్తరించిన తీరును మన పురాణగ్రంధా లలో పేర్కొన్నారు. ఆ తీరు పటాన్ని ('**మహావస్తు**'ను) ఒక సారి గమనించండి.

## నా వివాహము ఎప్పడు?

- నా వివాహము ఎప్పుడు? బిజినెస్ వ్యక్తి? ఉద్యోగ వ్యక్తి? ఎవరు? విదేశం నుండా? ఉద్యోగము వస్తుందా? రెమిడిస్ ఏమిటి?

**– నాగ శిరీష, కృష్ణ జిల్లా.**

- వివాహం : 27వ ఏట. దక్షిణ దిక్కు నుంచి వచ్చే వ్యాపార వేత్తను జీవిత భాగస్వామిగా పొందే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి.
- **రెమిడి:** ప్రతి సోమవారం జలచరాలకు (ప్రకృతి సిద్ధంగా అవి నివసించే చోట) ఆహారం వేస్తూ ఉండండి. మీకు ఉద్యోగం, వివాహ విషయాలలో సానుకూల పరిస్థితులు నెలకొంటాయి.


వచ్చేవారం...

'దిక్కులను ఏలా తెలుసుకోవాలి?'



దంతూరివారి వాస్తు పర్యటన: సెప్టెంబర్ నెల
విజయవాడ, నెల్లూరు :16, 17 శని, ఆది
రాజమండ్రి, విశాఖ, శ్రీకాకుళం: 23, 24 శని, ఆది
**For Personal Visits & Appointments**
Ph : 040 - 2781 7446email: mahavasthu@hotmail.com
**Cell: 988 544 6501, 988 544 9458**


వాస్తువిద్వాన్ **డా॥ దంతూరి పండరినాథ్** పాఠకుల జాతక మరియు వాస్తు సమస్యలకు 'మహావాస్తు'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసినది.

పూర్తి పేరు:......................................................................
పుట్టిన తేది:............................ ఊరు:.......................................
జన్మనక్షత్రం:............................ తల్లి పేరు:...............................
చిరునామా:........................................................................
........................................................ఫోన్:.............................


మా చిరునామా : **వాస్తుసాయి సేవా ఆశ్రమం**
**మహావాస్తు, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.**



# ఓ వారాలబ్బాయి జయభేరి

(మురళీమోహన్ జీవితాలాపన)



(గతవారం తరువాయి)

చెన్నై ఆంధ్రాక్లబ్‌లో మేం వేయాల్సిన నాటకం, నాటిక రిహార్సల్స్ చూసి జడ్జి చేయడానికి ఇద్దరు ప్రముఖులు మా ఊరు వచ్చారు. వారిద్దర్లో ఒకరు కేవీయస్ శర్మగారు, మరొకరు రావుశర్మ గారు. కేవీయస్ శర్మగారు ఆ రోజుల్లో చాలా మంచి ఆర్టిస్ట్. చెప్పుకోదగ్గ చిత్రాలు చాలా చేశారు. మరీ ముఖ్యంగా పౌరాణిక చిత్రాల్లో మంచివేషాలు వేశారు. రావుశర్మగారు అప్పటికే హీరోగా చేశారు. వారు వచ్చారన్న విషయం ఊళ్ళో ఆ నోటా ఈ నోటా విన్నవారంతా గబగబా పనులు పూర్తి చేసుకుని వాళ్లను చూడ్డానికి సిద్ధం కాసాగారు. అంతలో పిల్లలంతా వారు దిగిన ఇంటి ముందు గుమిగూడారు. ఊళ్లో పెద్దాళ్లు కూడా వాళ్లను కలుసుకుని క్షేమసమాచారాలన్నీ కనుక్కున్నారు. ఆ రోజు నాటకం, నాటిక ప్రదర్శించే మా నటులందరం కూడా వెళ్లి వారిని కలిసి నమస్కారం చేసి వచ్చేశాం. పిల్లలు, పెద్దలు అందరి నోటా ఆ రోజు జరగబోయే ప్రదర్శనల గురించే.

వీచే పైరుగాలి ఈ ఘుమఘుమలను కూడా ఆ వేళ మోసుకొచ్చింది. ఆ వాసనల వెంటే మేం కూడా మా చిన్నాన్నగారింటి గుమ్మం ముందుకు చేరుకున్నాం. ఊళ్లో వాళ్లందరి పరిస్థితీ ఏమోగానీ.. 'రేపటి నుంచి మనం హీరోలం...మన ఊరు పరువు నిలబెట్టాం' అనే భావన నటించిన మా అందరిలోనూ ఉంది. అందుకే కాస్త దర్జాగా ఇస్త్రీ చేసిన బట్టలు తొడుక్కుని అక్కడికి చేరుకున్నాం.

రాగి గంగాళాల్లో నీళ్ళు ముంచుకుని కాళ్లు చేతులు శుభ్రం చేసుకుని భోజనాల దగ్గరకు చేరుకున్నారు ఇద్దరు అతిథులు. మా పిన్నమ్మకు మరి

## వాళ్లది ఒక మాట... ఊళ్లోవాళ్ళది ఇంకోమాట!

ముందురోజు అనుకున్నట్టుగానే రంగస్థలం ఏర్పాటు చేసుకున్నాం. అతిథుల ముందు మా సీనియర్లు నాటకం వేశారు. అది పూర్తయ్యాక మేం నాటిక వేశాం. చూస్తున్నంతసేపూ మా ఊళ్లోవాళ్లు అందరూ 'బ్రహ్మాండం బ్రహ్మాండం' అని చప్పట్లు కొట్టారు. మాతోటి కుర్రకారంతా ఈలలూ, గోలలూ... సరదాగా సాగింది. అంత సంబరాన్ని ఒక్కసారిగా చూడటంతో మేమంతా హుషారైపోయాం. జడ్జీల ముందు నాటక ప్రదర్శనప్పుడు మేం మరింత హుషారుగా ఎవరి డైలాగులు వాళ్లం చెప్పాం. 'ఇరగదీశార్రా అబ్బాయ్' అని ఒకరంటే.. 'మన ఊరి పరువు నిలబెట్టారురా' అని ఇంకొకరన్నారు. అబ్బో ప్రశంసలే ప్రశంసలనుకోండి. అన్నిటినీ చూసి ఉబ్బి తబ్బిబ్బైపోయాం. పొగడ్తలతో కడుపునిండటం అంటే ఏంటో ఆ రోజు నాకు బాగా అర్థమైంది.

'ఓ.. ఇంక ప్రైజ్ వచ్చేసినట్టే' అని మాలో మేం మాట్లాడుకోసాగాం. అమితానందంతో ఉన్నప్పుడు ముఖాల్లో ఒకరకమైన కళ వస్తుంది. అలాంటి తేజస్సు మాలో ప్రతి ఒక్కరిలోనూ ఆ రోజు కనిపించే ఉంటుందని నా గట్టి నమ్మకం.

### జడ్జీలకు విందు భోజనం

ఎవరైనా మన ఊరికి అతిథులుగా వస్తే వారికి గౌరవ మర్యాదలు చేయకుండా పంపం. ఇప్పటికీ చాలా పల్లెటూర్లలో ఆ సంప్రదాయం కొనసాగుతోంది. అలా మా నాటకాన్ని, నాటికను చూడ్డానికి జడ్జీలుగా వచ్చిన ఇద్దరికీ మా ఊళ్లో వాళ్లందరూ ఘనంగా విందు ఇవ్వాలనుకున్నారు. మా చిన్నాన్నగారింట్లో అందుకు కావాల్సిన అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి. గారెలు, బూరెలు, రకరకాల కూరలు, పచ్చళ్లు, వేపుళ్లు... సాయంత్రం పూట



కొంతమంది ఆడవాళ్లు వడ్డనలో సాయం చేస్తున్నారు. మెల్లగా భోజనాల దగ్గర కుశల ప్రశ్నలూ, ఊరి ముచ్చట్లూ అయ్యాక మా ప్రస్తావన వచ్చింది.

"మా వాళ్లు ఎలా చేశారండీ.. నాటకం బావుందా? నాటిక బావుందా? ఏది నచ్చింది మీకు... మాకైతే రెండూ బ్రహ్మాండం అనిపించాయి. మా కుర్రాళ్లందరూ చాలా బాగా చేశారు' అన్నారు మా చిన్నాన్నగారు. ఆ మాటలకు అతిథులు ఇద్దరు నవ్వుతున్నారు. ఏమీ మాట్లాడటం లేదు. కాసేపు అంతా నిశ్శబ్దంగా అనిపించింది. అందరూ ఎవరి ప్లేట్లలో భోజనం వాళ్లు శ్రద్ధగా తింటున్నారు.

మా పిన్నమ్మ ఒకరికి నెయ్యి వడ్డిస్తోంది. మరొకరికి వడియాలు పెట్టింది. మరో ప్లేట్‌లో ఆవకాయ ముక్క కాస్త నూనెవాటంగా తీసి వడ్డించింది. కానీ అందరూ మౌనంగానే ఉన్నారు.

ఎందుకో ఆ మౌనం కొన్ని సెకన్లపాటే ఉన్నా.. నా వరకు చాలా భారంగా అనిపించింది. అప్పటిదాకా ఉన్న ఆసక్తి ఒకరకమైన మాటల్లో చెప్పుకోలేని భావోద్వేగంగా రూపాంతరం చెందడాన్ని కిటికీ పక్కనే ఉన్న నేను గమనించాను. ఏమనుకున్నారో మరలా మా చిన్నాన్నే చొరవ చేసి,

'చెప్పండి.. పర్వాలేదు. ఏం బావుందా? లేదా? ఎలా ఉంది? చెప్పండి ఫర్లేదు' అన్నారు.

'రాళ్లు రత్నాలు' అని వేసిన నాటకంలో నటించిన వారందరూ బాగా చేశారు. కానీ కథా వస్తువు ఎంటర్‌టైన్‌మెంట్ నాటకంలాగా ఉంది' అన్నారు.

'అంటే?' చిన్నాన్న ప్రశ్నించారు.

'అంటే పార్టీ ప్రచారంకోసం చేసే ప్రచార నాటకం లాగా ఉందితప్పు, అది సోషల్ సబ్జెక్ట్‌లాగా లేదు. అందుకని దాన్ని సెలక్ట్ చేయడం లేదు' అన్నారు రావుగారు.

'మరి రెండోదాని సంగతేంటండీ?.. 'పోలీసు' నాటిక పరిస్థితి?' అని పక్కనున్న మా ఊరి పెద్దాయన ఒకరు అడిగారు. 'పోలీస్' స్క్రిప్ట్ చాలా బావుందండీ. చాలా మంచి స్క్రిప్ట్. కానీ వేదికమీద మాత్రం ఎవరూ బాగా వేయలేదు' అన్నారు.

## ఏమనుకోవద్దండీ!

అక్కడ భోజనం చేస్తున్న వారి పరిస్థితి ఏమో గానీ.. నాకు మాత్రం గుండె గుభేలుమన్నది. అక్కడ ఇంక నేను ఉండాలా? ఉండకూడదా? అని కూడా అర్థం కాని పరిస్థితి. ఒకవైపు మనసేమో అక్కడినుంచి వెళ్లమని తరుముతోంది. మరోవైపు బుద్ధిమాత్రం 'అసలేం చెప్తారో వింటేనే కదా.. తప్పు ఒప్పులు తెలిసేది' అని చెబుతోంది. ఒకరకమైన మానసిక సంఘర్షణ జరిగింది. బుద్ధికే ఓటేసి, వాళ్లేం మాట్లాడుకుంటున్నారో వినసాగా. నేను కద లకపోవడంతో, నా చుట్టూ ఉన్నవారు కూడా అలాగే నిలబడిపోయారు.

'మరి దేన్నీ సెలక్ట్ చేయట్లేదాండీ..' అని మెల్లిగా అసలు విషయం లేవనెత్తారు ఇంకో పెద్దమనిషి.

'ఏమనుకోవద్దండీ.. రెండూ సెలక్ట్ చేయడం లేదు..' అని తమ పని సక్రమంగా నిర్వర్తించామనే తృప్తితో చెప్పారు న్యాయనిర్ణేతలు.

ఆ మాట విన్నాక ఈసారి బుద్ధిని మనసు జయించింది. ఇంక అసలు అక్కడ ఉండలేక పోయాం. 'ఏంటో.. ఇంత కష్టపడి చేశాం. వీళ్లేమో ఇలా అంటున్నారు. మరి నిజంగా బాగా లేకపోతే ఊళ్లో వాళ్లు.. 'భలే చేశావురా.. భలే చేశావురా..' అని ఎందుకంటారు?.. అని ఒకటే ఫీలింగ్.

రాత్రి ఇంటికివచ్చి ఇంటిముందు మంచంమీద పడుకున్నా. దారిలోనూ ఎవరితోనూ ఏమీ మాట్లాడ లేదు. పైన ఆకాశంలో చుక్కలు క్రమపద్ధతిలో కాకుండా అక్కడొకటి, ఇక్కడొకటి విచిత్రంగా కని పించసాగాయి. మధ్యలో చందమామ నన్ను సేద తీర్చడానికి వెన్నెల కురిపిస్తున్నాడా? నా నాటిక ఎంపిక కానందుకు ఆటపట్టిస్తూ నవ్విస్తున్నాడా? అర్థంకాని స్థితి. కల్లోలం చెందిన మనసు నిద్రకు ఉపక్రమించదేమోకానీ, అలసిన మనసు ఆదమరచి నిద్రపోతుందంటారు. అలా నా కన్నులు మూతలు పడి నిద్రలోకి జారుకున్నాయి.

## సినిమాల్లోకి బాగా పనికొస్తావురా

ఉదయాన్నే అమ్మ కల్లాపి చల్లుతూ 'బాబూ.. లేవ్ పొద్దెక్కింది' అని లేపింది.

నిన్న వేసిన నాటకం తాలూకు ప్రభావం అమ్మ ముఖంలో అసలు కనిపించడం లేదు. అది అసలు విషయమే కానట్టు, పట్టించుకోనట్టే ఉంది. సరేనని నిద్రలేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ అడుగు బయటకు వేశా. మా ఇంటికి అవతల ఉన్న వేపచెట్టు పుల్లవిరిచి నోట్లో వేసుకుని, లుంగీ పైకి మడిచి దట్టీ కడుతూ తిరుగుతుంటే, ఊళ్లో వీధి చివరింటిమనిషి కనిపించారు. 'రేయ్ అబ్బాయ్.. నువ్వు సినిమాల్లోకి బాగా పనికొస్తావురా.. వెళ్లిపోరా సినిమాల్లోకి. మీ నాన్నగారితో కావలిస్తే నేను మాట్లాడుతాను' అన్నారు. నేనేమో షాక్. రాత్రి వాళ్లు బాగా నటించలేదని చెప్తే, వీళ్లందరూ బావుంది అంటారేంటి? అని మనసులో పడింది. ఆ రోజు సాయంత్రమే మరలా కుర్రాళ్లందరూ కలిసే చోటికి వెళ్లా. మా బంధువుల్లో ఒకాయన అటుగా వెళ్తూ 'ఇదిగో అబ్బాయ్.. ఇలా రా' అన్నారు.

'వస్తున్నా మావయ్యా' అని కూర్చున్నవాడి నల్లా గబగబా లేచి సమాధానం చెప్తూ వెళ్లా.

'నిన్న నాటిక చాలా బాగా వేశావురా. అచ్చం హీరో లాగే అనిపించావు. నీతో వేసినవాళ్ళు కూడా బాగా చేసి ఉంటే బావుండేది. రిహార్సల్స్ బాగా చేయలేదేమో నని నా అనుమానం. నిన్ను పిలిచిన విషయం ఏంటంటే, నువ్వు మరేమీ ఆలోచించకుండా సిని మాల్లోకి వెళ్లు. దానికి తగ్గ ప్రయత్నాలన్నీ చెయ్యి. నీకెప్పుడైనా సలహాలు కావాలంటే మన రామినీడు ఉన్నాడు, మన ఛటర్జీ ఉన్నాడు.. కావాలంటే మేమూ ఓ మాట చెబుతాం' అని గుక్కతిప్పుకో కుండా చెప్పసాగారు. వింటున్నానే కానీ, ఏమని సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. అందుకే తల అడ్డంగా, నిలువుగా, గుండ్రంగా.. ఎటు ఊపానో నాక్కూడా అర్థంకానంత అస్పష్టంగా ఊపా.

ఆయనే కాదు.. ఆ తర్వాత చాలామంది రోజుకు ఒక్కసారైనా నాతో సినిమాల ప్రస్తావన తెస్తూనే ఉన్నారు.



**ఊళ్ళో దిగిన జడ్జీలిద్దరూ మురళీమోహన్‌గారి బృందం ప్రాక్టీస్‌చేసిన నాటిక చూశారు. ఆ కార్యక్రమం ఎంతో ఉత్సాహంగా జరిగింది. పెద్దలు, పిన్నలూ చూసి, ఓహో! బ్రహ్మాండం అని ఎంతగానో ప్రశంసించారు. మర్నాడు కనిపించినవాళ్ళంతా సినిమాల్లోకెళ్ళమని మురళీమోహన్‌గారికి సలహాలిచ్చి ప్రోత్సహించారు. ఇదంతాసరేగానీ, అసలు న్యాయనిర్ణేతలు ఏమన్నారు? మురళీమోహన్‌గారి నాటకం సెలక్టయిందా? లేదా?**

## రామినీడుగారి పిలుపుతో మద్రాసుకి..

సుమారు నాలుగైదు వారాలు దాటాయను కుంటా. ఒకరోజు పోస్టుమేన్ మా చిన్నాన్నకు ఒక ఉత్తరం తెచ్చిచ్చాడు. అప్పుడు నేను అక్కడే ఉన్నా. 'చదువురా అబ్బాయి' అని మా చిన్నాన్న నా చేతిలో పెట్టారు ఉత్తరం.

ఉభయకుశలోపరితో మొదలైంది ఉత్తరం. 'మేం మీ నాటకాలను సెలక్ట్ చేయట్లేదని మీరేమీ అసంతృప్తికి లోనుకావద్దు. మేం ఎలాంటి నాట కాలు సెలక్ట్ చేస్తామో ఒకసారి మద్రాసువచ్చి చూడండి' అనేది ఆ ఉత్తరం సారాంశం. రాసింది మరెవరో కాదు.. రామినీడుగారు. అంత పెద్దమనిషి మన ఊరు కుర్రాళ్లను దృష్టిలో ఉంచుకుని రాశా రంటే ఎంతగొప్ప. అందరూ దాని గురించే మాట్లాడు కుంటున్నారు. 'ఇంకేం మరి.. కుర్రాళ్లందరూ వెళ్లండి' అని చిన్నాన్న అన్నారు. మాలో ఎవరికీ పనులు లేవు కదా.. వెళ్దామంటే వెళ్దామనుకుని అందరం కలిసి ట్రైన్‌లో మద్రాసు వెళ్లాం. టీనగర్‌లో ఛటర్జీగారి ఇంట్లో దిగాం. ఆయన్ని కలిసి కబుర్లు చెప్పి, వెంటనే రామినీడు గారి ఇంటికి చేరుకున్నాం. వాళ్ల ఇళ్లు పక్కపక్కనే ఉండేవి. దాంతో ఇక్కడ కొందరు, అక్కడ కొందరూ అంతా ఫ్రెష్ అయి టిఫిన్లుతిని, కాఫీలు తాగి, కాస్త నిదానంగా నాటకాల దగ్గరకు వెళ్లాం.

## సినిమా చూసినట్టే అనిపించింది

నాటకాలు మాకు కొత్తకాదు. మా ఊళ్లో, చుట్టుపక్కలా చాలా నాటకాలే చూశాం. అప్పట్లో ఎక్కువగా పౌరాణికాలే ఆడేవారు కానీ మద్రాసులో చూసినవన్నీ సాంఘికాలు. వాళ్లు నాటకాలు ఆడు తున్న తీరు, వాటిలోని కథావస్తువులు మాకు చాలా నచ్చాయి. ఒక రకంగా వాటిని చూస్తుంటే నాటకాలు చూసినట్టు అనిపించలేదు. సినిమా చూసినట్టు అని పించింది. మేం ఉత్సాహంగా చూస్తూ ఉంటే ఒక వ్యక్తి మమ్మల్నే గమనిస్తూ ఉన్నారు. ఆవిషయం మాకు తెలియలేదు. అంతలో ఒక గొంతు 'ఇదిగో ఇలా రండి' అని పిలిచింది. అది మాకు అంతకు ముందు అలవాటున్న గొంతే. అది ఎవరిదంటే...

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**



# మార్పు వెనుక మతలబేమిటి?

**ప్రధాని నరేంద్ర మోదీ చేపట్టిన మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ అటు పార్టీలో, ఇటు ప్రభుత్వంలో ఆయన బలాన్ని పెంచడానికి, పార్టీ, ప్రభుత్వం ఆయన చుట్టూనే తిరుగుతున్నాయని తేల్చి చెప్పడానికి తోడ్పడింది.**

ఇటీవలి కేంద్ర మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణతో ఒక్క విషయం అర్థమైపోయింది. ప్రధాని నరేంద్ర మోదీ జనాకర్షణే మళ్లీ కీలకమైపోయింది. ఎన్డీఏ కన్నా మిన్నగా బీజేపీ బలోపేతం కావడానికి ప్రయత్నాలు ప్రారంభమైపోయాయి. తన మిత్రపక్షాలు, ప్రాంతీయపక్షాల మీద ఆధారపడడం, వాటిని బుజ్జగించడం అన్నది ఇక బీజేపీ అజెండాలో కనిపించకపోవచ్చు. కేంద్రంలో మిత్రపక్షాలవారికెవరికీ ఈసారి స్థానం కల్పించకపోవడం ఆ నగ్నసత్యాన్ని చెప్పకనే చెబుతోంది. బీహార్‌కు చెందిన జనతాదళ్ (యు), మహారాష్ట్రకు చెందిన శివసేనకు ఈసారి మంత్రివర్గంలో స్థానం లభిస్తుందని విశ్లేషించిన మేధావులంతా నిర్ఘాంతపోయేటట్టు, మోదీ ఆ పార్టీలను లెక్కలోకే తీసుకోలేదు. సహజంగానే ఆ రెండు పార్టీలు కూడా అలిగి కూర్చున్నాయి.

ఎన్డీఏ మీద, కేంద్ర ప్రభుత్వం మీద బీజేపీ క్రమంగా పట్టు బిగిస్తోంది. ఆ పార్టీ తన పునాదుల్ని పటిష్ఠం చేసుకుంటోంది. జేడీ (యు), శివసేనలకు స్థానం కల్పించకపోగా, ఆ రాష్ట్రానికే చెందిన బీజేపీ నాయకులకు కేంద్ర మంత్రివర్గంలో స్థానం కల్పించడం ఆలోచించాల్సిన విషయం. అతిత్వరలో జరగబోయే బీహార్ ఎన్నికల్లో తమకు అనుకూలంగా జేడీ (యు) గనుక చాలినన్ని వెనుకబడిన తరగతుల ఓట్లు కూడగట్టే పక్షంలో ఆ పార్టీ మీద బీజేపీ దృష్టి పెట్టవచ్చునుకోవాలి. ఉత్తర ప్రదేశ్‌కు చెందిన రామ్‌నాథ్ కోవింద్‌ను రాష్ట్రపతి పదవికి ఎంపిక చేయడం వెనుక ఉద్దేశం కూడా దళిత ఓట్లు తమకు పడతాయనే. కోవింద్ బీహార్ గవర్నర్‌గా కూడా పనిచేశారు. ఆయనకు అత్యున్నత పదవి కట్టబెట్టడం ద్వారా బీహార్‌లో దళిత ఓట్లను రాబట్టుకోవచ్చని బీజేపీ అంచనా వేసింది.

బీజేపీ ప్రాంతీయ మిత్రపక్షాల్లో ఒకటైన శివసేన పరిస్థితి ప్రస్తుతం చాలా బలహీనంగా ఉంది. బీహార్‌లో దళిత ఓట్ల కోసం నితీశ్‌కుమార్‌తో చేతులు కలిపిన బీజేపీకి మహారాష్ట్రలో మాత్రం విచిత్రమైన పరిస్థితి ఎదురవుతోంది. ఇక్కడ మిత్రపక్షాలదే పైచేయిగా ఉంటోంది. ఈ పరిస్థితికి అడ్డుకట్ట వేసి, తమ బలాన్నీ, బలగాన్నీ పెంచుకోవడానికి బీజేపీ ప్రస్తుతం పావులు కదుపుతోంది. ఇక్కడ ఎన్డీఏకు ఉన్నంత బలం వ్యక్తిగతంగా బీజేపీకి లేకపోవడం ప్రస్తుతం ఈ పార్టీకి కంటగింపుగా ఉంది. ఈ ఎన్డీఏ బాధను వదల్చుకోవడం మీదే బీజేపీ దృష్టి పెడుతోంది. శివసేన, ఎన్సీపీ వంటి పార్టీలు తరచూ బీజేపీని బెదిరించడానికి ప్రయత్నిస్తుండడం ఆ పార్టీకి సుతరామూ నచ్చడం లేదు.

### ఒక దెబ్బకు రెండు పిట్టలు

విచిత్రమేమిటంటే, మోదీ, అమిత్ షా ద్వయానికి ఎన్డీఏ విషయంలోనే కాదు, ఎల్.కె. అడ్వాణీ, అటల్ బిహారీ వాజ్‌పేయీల విషయంలోనూ ఇటువంటి ఇరకాట పరిస్థితి ఉన్నట్టు అర్థం చేసుకోవాలి. అడ్వాణీ, వాజ్‌పేయీల వర్గానికి చెందిన కల్రాజ్ మిశ్రా, బండారు దత్తాత్రేయ, రాజీవ్ ప్రతాప్ రూడీ తదితరులను తప్పించడం వెనుక ఉద్దేశం అదే కావచ్చు. ఈ నాయకులంతా అడ్వాణీ, వాజ్‌పేయీల హయాంలో ఎంతో ప్రాధాన్యం సంతరించుకున్నారు. ప్రభుత్వంలో ఉన్నతాధికారంలో నీతి నిజాయతీలు, సమర్థతలను ప్రదర్శించిన అధికారులకు మాత్రం తన మంత్రి వర్గంలో కీలక పదవులు కట్టబెట్టడం మోదీ ప్రత్యేకత. పోలీసు అధికారులు, హోం శాఖ మాజీ కార్యదర్శి, ఢిల్లీలో అక్రమ కట్టడాలను కూల్చివేసి పేరు తెచ్చుకున్న మరో ఉన్నతాధికారి తదితరులను మోదీ మరచిపోలేదు.

ఇటువంటి చర్యను గతంలో ఏ ప్రధానీ తీసుకోలేదు. జాన్ మత్తయ్‌ని జవహర్‌లాల్ నెహ్రూ, మన్మోహన్‌సింగ్‌ను పీవీ నరసింహారావు తమ ఆర్థిక మంత్రులుగా తీసుకున్నప్పటికీ, మోదీస్థాయిలో ఇది ఇంత పెద్ద ఎత్తున జరగలేదు. కేరళకు చెందిన ఆల్ఫాన్స్‌ను మినహాయిస్తే ఈ మాజీ అధికారుల్లో ఎవరికీ ప్రజల మీద పట్టు లేదు. వారెవరికీ వర్గాలు, ముఠాలు లేవు. వారి రాష్ట్రంలో వారి ప్రభావమేమీ కనిపించదు. అంటే, కేంద్ర ప్రభుత్వం మోదీ జనాకర్షణ మీదే నడుస్తోంది తప్ప మరే నాయకుడి మీదా ఆధారపడి లేదని తేల్చి చెప్పడమే ఈ మార్పు, చేర్పుల ఉద్దేశం. వచ్చే ఎన్నికల్లో ఓట్లు కూడా మోదీని చూసే పడతాయి తప్ప మరే నాయకుడి వల్లా, ఓట్లను ఆకట్టుకోవడం జరిగే పని కాదు.

ఆల్ఫాన్స్, హర్దీప్‌పురీలకు మంత్రివర్గంలో స్థానం కల్పించడం, సయ్యద్ ముఖ్తార్ నక్వీని కేబినెట్ స్థాయికి ప్రమోట్ చేయడాన్ని బట్టి, అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన వారికి కూడా తమ ప్రభుత్వంలో స్థానం ఉందని మోదీ తేల్చిచెప్పినట్టయింది. తన ప్రభుత్వంలో మన్మోహన్‌సింగ్‌కు స్థానం కల్పించినప్పుడు ఆయన అల్పసంఖ్యాక




**- రాజశుక**

వర్గానికి చెందిన వ్యక్తిగా పీవీ భావించలేదు. ఆయనను ఓ నమ్మకమైన, నీతి నిజాయతీలు కలిగిన వ్యక్తిగా మాత్రమే పీవీ గుర్తించారు. కొన్నేళ్ల తర్వాత మన్మోహన్ సింగ్‌ను కాంగ్రెస్ పార్టీ తమ ప్రధాని అభ్యర్థిగా ఎంపిక చేసినప్పుడు మాత్రం సిక్కుల ఊచకోత (ఇందిరా గాంధీ హత్యానంతరం)కు పరిహారంగా భావించడం జరిగింది.

## దక్షిణాదిలో బలోపేతం

కేరళలో బీజేపీపట్ల ఉన్న దురభిప్రాయాలు తొలగించి, ఆ పార్టీకి కాస్తో కూస్తో బలం పెంచడానికి ఆల్ఫాన్స్ ఎంపిక ఉపయోగపడుతుందని ఆ అధికార పక్షం భావిస్తోంది. ఆయన మొదట్లో వామ పక్షాలకు చెందిన వ్యక్తి. ఆ తర్వాత ఆయన బీజేపీలోకి మారారు. ఆ రాష్ట్రంలో ఆర్ఎస్ఎస్‌కు, వామ పక్షాలకు మధ్య ఘర్షణలు పేట్రేగుతున్న స్థితిలో ఆల్ఫాన్స్‌ను మంత్రిగా ఎంపిక చేయడం ప్రాధాన్యం సంతరించుకుంది. ఆయనకు కేరళలో అభిమానుల సంఖ్య ఎక్కువగానే ఉంది. కేంద్ర ప్రభుత్వానికి ఇతర మతాలపట్ల విముఖత ఏమీ లేదనీ, ఇది అన్ని వర్గాలనూ కలుపుకునిపోయే ప్రభుత్వమనీ ప్రజల్లో ఓ అభిప్రాయం ఏర్పడడానికి ఆల్ఫాన్స్, హర్దీప్ పురీల నియామకం అవకాశం కలిగిస్తుంది.

దేశంలో మహిళలకు రక్షణ లేకుండా పోతోందని ఆందోళన చెందుతున్నవారికి చిన్న ఊరట. ఇప్పుడు దేశ 'రక్షణే' మహిళ చేతుల్లోకి వెళ్లిపోయింది. సహాయమంత్రిగా ఉన్న నిర్మలా సీతారామన్‌ను కేబినెట్ స్థాయికి ప్రమోట్ చేసిన మోదీ ఆమెకు ఏకంగా రక్షణశాఖే అప్పగించారు. ఇప్పుడామె దేశానికి విదేశాల నుంచి భద్రత కల్పించడమే కాదు, అంతర్గతంగా చెలరేగే ఉత్పాతాలు, దారుణాలు, ఉగ్రవాద దాడులు, అల్లర్ల నుంచి కూడా దేశానికి రక్షణ కల్పించాల్సి ఉంటుంది. రక్షణ మంత్రిగా ఆమె నలుగురు సభ్యుల ప్రధాని అంతరంగిక బృందంలో కూడా చేరిపోయినట్టయింది. ఈ నలుగురు సభ్యుల బృందాన్ని భద్రతపై కేబినెట్ కమిటీగా వ్యవహరిస్తారు. ఇది చాలా శక్తిమంతమైన కమిటీ. ఆమె రాజకీయ ప్రస్థానాన్ని బట్టి చూస్తే దేశంలో ఇందిరా గాంధీ మినహా మరే మహిళా రాజకీయ నాయకురాలికీ పట్టని 'యోగం' ఆమెకు పట్టిందనిపిస్తుంది. ఆమె రాజకీయాల్లో ప్రవేశించి పదకొండేళ్లే అయింది. ఆమె 2006లో బీజేపీలో చేరారు. ఆమె వాగ్ధాటి, వాక్చాతుర్యం, దూకుడుతనం పార్టీ అధిష్ఠానాన్ని, ముఖ్యంగా మోదీని వెంటనే ఆకట్టుకున్నాయి.

పార్టీలో ఆమెకు బాగా జనాకర్షణ కలిగిన వ్యక్తిగా, సమర్థురాలైన నాయకురాలిగా ఎంతో

**మంత్రివర్గవిస్తరణలో జెడీ(యు), శివసేన లాంటి మిత్రపక్షాలకు అవకాశం ఇవ్వకుండా మేధావులను సైతం నిర్ఘాంతపర్చారు నరేంద్రమోదీ. కీలకమైన దేశరక్షణ బాధ్యతలను ఊహించనిరీతిలో నిర్మలాసీతారామన్‌కు అప్పగించారు. నీతినిజాయతీ, సమర్థత ప్రదర్శించిన అధికారులకు కీలకపదవులు కట్టబెట్టిన ఈస్థాయి ప్రధాని గతంలోలేరు. ఈ మార్పులుచేర్పులన్నీ దేనికి సంకేతం? వచ్చే ఎన్నికల్లో జనం ఎవర్నిచూసి ఓట్లేస్తారు?**

పేరుంది. ఆ కారణంగానే ఆమెనే రక్షణ వంటి కీలక పదవి వరించింది. దక్షిణ భారతదేశంలో అతి శక్తిమంతమైన నాయకుడుగా ఎదిగిన ఎం. వెంకయ్య నాయుడును ఉపరాష్ట్రపతి పదవికి ఎంపిక చేసినందువల్ల, ఆయన స్థానంలో శక్తిమంతమైన నాయకుడి కోసం బీజేపీ వేట మొదలుపెట్టింది. ఆ వేటలో అందరి దృష్టి నిర్మలా సీతారామన్ మీద పడింది. అరుణ్ జైట్లీ, ప్రణబ్ ముఖర్జీ, జార్జ్ ఫెర్నాండెజ్, జశ్వంత సింగ్, ములాయం సింగ్ యాదవ్, పీవీ నరసింహారావు, శరద్‌పవార్, వీపీసింగ్, ఎస్‌బీ చవాన్, రాజీవ్‌గాంధీ, ఆర్. వెంకట్రామన్, ఇందిరా గాంధీ, జగ్జీవన్‌రామ్, వీకే కృష్ణమీనన్, కైలాస్‌నాథ్ కట్జూ వంటి సీనియర్ రాజకీయ నాయకులు కూర్చున్న సీట్లో ఆమె కూర్చోవడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే. ఏది ఏమైనా ఆమెకు ఈ పదవిని కట్టబెట్టడాన్ని బట్టి ఆమె మీద మోదీకి ఎంతో నమ్మకముందనే సంగతి అర్థమైపోతోంది. మరో విషయమేమిటంటే, రక్షణ శాఖలో ప్రధాని కార్యాలయం మాటే ఇక మీదట చెల్లుబాటవుతుందనే సంగతి కూడా ఈ పరిణామం వల్ల అర్థమవుతుంది. ఇక సుష్మా స్వరాజ్ కీలక విదేశాంగ శాఖ మంత్రిగా ఉన్నందువల్ల, దేశంలో రెండు అతి ముఖ్యమైన శాఖలు మహిళల చేతుల్లోనే ఉన్నా





యనుకోవాలి.

## మహిళా సాధికారికత?

నిజానికి తనకు రక్షణ శాఖ ఇవ్వాలని సుష్మా స్వరాజ్ ఈ మధ్య ఓ ప్రకటన చేసి మోదీని ఆశ్చర్యంలో ముంచెత్తారు. రక్షణ వంటి కీలక శాఖను ఓ మహిళకు అప్పగించడమేమిటనే ప్రశ్న కూడా బీజేపీలో తలెత్తింది. అయితే, మహిళా సాధికారికత మీద ఎంతో నమ్మకం, ఆశలు ఉన్న మోదీ దృష్టిలో నిర్మలా సీతారామన్ పడడం జరిగింది. అటు రాజకీయ వర్గాలు గానీ, ఇటు మీడియా గానీ ఏమాత్రం ఊహించని నిర్మలా సీతారామన్ పేరును మోదీ ఏకంగా రక్షణ మంత్రి పదవికి పరిగణించడం మాత్రం పార్టీలో సైతం ఎవరికీ కొరుకుడు పడడం లేదు. విచిత్రమేమిటంటే, హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్ సైతం రక్షణ శాఖను తనకు అప్పగించే అవకాశం ఉందని సూచనలిచ్చారు.

నిర్మలా సీతారామన్‌తో పాటు సహాయ మంత్రి పదవి నుంచి కేబినెట్ ర్యాంకుకు ప్రమోషన్ పొందిన మరో వ్యక్తి పీయూష్ గోయెల్. ఆయనకు రైల్వే శాఖ అప్పగించారు. రైల్వే మంత్రిగా ఆయనకు దేశంలోని ప్రజలందరితో సంబంధం ఉంటుంది. పైగా రైల్వేశాఖ అంటే మోదీకి కూడా ఇష్టం. ఈ శాఖకు సురేశ్ ప్రభు స్థానంలో సరైన సమర్థుడి కోసం మోదీ చాలాకాలంగా ఎదురు చూస్తున్నారు. చివరికి ఆయన దృష్టి గోయెల్ మీద పడింది. ఉమా భారతి మీద వేటు పడుతుందని అంతా భావించారు కానీ, చివరి క్షణంలో మోదీ మనసు మార్చుకున్నట్టు కనిపిస్తోంది. ఆమె దగ్గర నుంచి జలవనరులు, గంగానది పునరుజ్జీవన శాఖలు తీసేసుకుని నీరు, పారిశుధ్య శాఖలను అప్పగించారు. మరో 18 నెలల్లో ఎన్నికలు జరుగనున్న సమయంలో మోదీ మంత్రులు, పార్లమెంట్ సభ్యుల పనితీరు మీద దృష్టి కేంద్రీకరిస్తున్నారు. కేవలం మోదీ కారణంగానే ఎన్నికల్లో బీజేపీ గెలుస్తుందా లేక ఇటువంటి మంత్రివర్గ మార్పులు, చేర్పులతో పార్టీ గెలుస్తుందా అన్నది ఎన్నికల దాకా వేచి చూడాల్సిన విషయమే.

## తురగా కృష్ణమోహనరావు హాస్యకథలపోటీలో
## రూ. 5,000 బహుమతి పొందిన కథ

**పేపర్లో ఆవార్త చదవగానే బుద్ధేశ్వర్రావు గుండెజారి, జావగారి, ఓవర్ ఫ్లో అయి, నాలుగు కవాటాలకి పైపూత పూసింది.**

**అసలే బుద్ధేశ్వర్రావుది చిన్న ఉద్యోగం. సంపాదన గోచీకి పెద్దా, తువ్వాలుకి చిన్నా. తప్పనిసరి అవసరాలు, తప్పించుకోలేని ఖర్చులు, తడిసిమోపెడై, ఆరేస్తే డబుల్‌కాట్ బెడ్‌షీట్ అంత అవుతాయి.**

**బుద్ధేశ్వర్రావు పిసినారేగానీ పొదుపరి. అనవసరఖర్చుకి ఆమడదూరముంటాడు. పది పైసలు లాభం ఉంటే, పదడుగులు ముందుంటాడు.**

# కరెంట్ షాక్

### పోలాప్రగడ జనార్దనరావు



పేపర్లోపడ్డ 'రెండువందల ఒకటి' సంఖ్య పగ బట్టిన పాములా బుసకొట్టింది. చావుబాజాలా వినబడింది. సప్తకట్ల పల్లకీలా కనబడింది.

మళ్ళీమళ్ళీ పేపరు చదివాడు. తను చదివిందీ, అర్థం చేసుకున్నదీ కరెక్టే.

కరంటు టారిఫ్ సున్నానుంచి రెండువందల యూనిట్లవరకూ, యూనిట్‌కి ఐదురూపాయలు. రెండు వందలఒకటి నుంచి మూడువందలవరకు ఏడు రూపాయల ఇరవై పైసలు. మూడువందల ఒకటి నుంచి నాలుగొందలవరకు ఎనిమిదిరూపాయల యాభై పైసలు...

అయ్యబాబోయ్! అనుకుంటూ పాత కరంటు బిల్లులు తీసి చూశాడు. తన ఇంట్లో కరంటు వాడకం ప్రతినెలా ఇంచుమించు మూడువందల యూనిట్ల నుంచి నాలుగొందల యూనిట్ల వరకు ఉంది. పాత యూనిట్లని కొత్తరేట్లతో లెక్కకట్టాడు. గుండె లబ్‌డబ్ అనడంమానేసి లబోదిబోమంది.

'కొత్తరేట్లు వచ్చేనెల ఒకటోతారీఖునుంచి అమలు. కాలూ, చేయీ కూడదీసుకునేందుకు టైములేదు. వెంటనే ఎమర్జెన్సీ డిక్లేర్‌చేసి, కరెంటువాడకంలో కొన్ని కోతలు, మరికొన్ని మార్పులు చేయకపోతే జేబుకి చిల్లు ఖాయం' అనుకుంటూ ఆలోచించి ఆలోచించి, ఇక చించలేక, ఇంట్లో ఉన్న నలుగురితో ఎమర్జెన్సీ మీటింగ్ ఏర్పాటుచేశాడు బుద్ధేశ్వర్రావు.

తను అధ్యక్షస్థానంలో కూర్చున్నాడు. ఎనిమిదవ క్లాసు చదువుతున్న కొడుకుని, వచ్చేఏడు ఏడోక్లాసు చదివేస్తానని బెదిరిస్తున్న కూతుర్ని, మిత్రపక్షాల్లా పక్కనే కూర్చోపెట్టుకున్నాడు. ఎదురుగా తల్లీ, భార్య సుగుణ ప్రతిపక్షాల్లా కూర్చున్నారు. విషయం ఏమిటో తెలియకపోయినా మీటింగ్ మొదలవ్వకుండానే చెప్పబోయేదాన్ని ఎలా ఖండించాలా అని అత్తా, కోడళ్ళు గుసగుసలు మొదలెట్టారు.

"కరెంటురేట్లు పెరిగిపోయిన కారణంగా మన ఇంట్లో ఎమర్జెన్సీ డిక్లేర్ చేస్తున్నా. ఈరోజు నుంచే మన ఇంట్లో రాత్రి తొమ్మిదిగంటలనుంచి 'బ్లాక్ డే'. పిల్లలూ... మీరు బ్రహ్మ ముహూర్తంలో లేచి చదివి నన్నూ, బ్రహ్మగార్నీ ఉద్ధరించక్కర్లేదు. పగటిచదువు కంటికి, ఒంటికి మంచిది. తేడాపాడాలొస్తే తాట తీస్తా. సమయానుకూలంగా ఇంకా కొత్తకొత్త రూల్సు వస్తాయి. యుద్ధప్రాతిపదికమీద సైనికుల్లా అమలు పరచడానికి సిద్ధంగా ఉండండి. ఇంతటితో మీటింగ్ సమాప్తం. రాత్రి తొమ్మిదైంది బుద్ధిగా పడుకోండి" అంటూ లైట్లన్నీ ఆర్పేశాడు.

"ఒరేయ్! బుద్దా! నీకిదేం పోయేకాలంరా! రాత్రి తొమ్మిదిగంటలకి భక్తిఛానల్‌లో భగవద్గీత వస్తుంది. అది చూడందే నాకు నిద్దర పట్టదు"

"అమ్మా! నువ్వెళ్ళి నిద్దరమాత్రలు వేసుకుని పడుకో. లేకపోతే అవి నేను గుప్పెడు మింగుతా జాగ్రత్త".

"అయ్యో, శుక్రవారంపూట అవేం మాటలండీ... 'ఇంటికిదీపం ఇల్లాలే' సీరియల్ మంచిపట్టులో ఉంది. ఈవేళ అత్తాకోడళ్ళల్లో ఎవరు చస్తారో తేలిపోతుంది. తప్ప దనుకుంటేమాత్రం విషయం రేపటికి వాయిదా వెయ్యండి" అంటూ మంగళసూత్రం కళ్ళకద్దుకుంది సుగుణ.

"నాకు తిక్కరేగిందంటే మెయిన్ స్విచ్ ఆపుతా. కేబుల్ కనెక్షన్ పీకిస్తా. అరిస్తే పీక పిసుకుతా. నోరు మూసుకుని పడుకోండి".



చీకట్లో గుద్దుకుంటూ, తడుముకుంటూ, ఒకరి పక్కమీద మరొకరు వాలారు.

***

తెల్లారగట్ల లేవఖ్ఖర్లేదన్న ధీమాతో పిల్లలు హాయిగా మొద్దునిద్దరపోయారు. టైమ్ ప్రకారం స్కూలు ఆటో వాడొచ్చి, ఐదు నిమిషాలు హారన్ కొట్టీ కొట్టీ వెళ్ళిపోయాడు. పిల్లల్ని స్కూటర్ మీద స్కూల్లో దింపి, ఆరు కిలోమీటర్లకి పెట్రోల్ ఖర్చెంత? పిల్లలు తెల్లవారురూమున లేచి చదివితే రోజుకి ఎన్ని యూనిట్లు కరెంటు కాల్తుంది? ఇది అనులోమానుపాతమా? విలోమాను

**పేపర్లో ఆ వార్త చదివిన బుద్ధేశ్వర్రావుకి గుండెజారి గల్లంతైపోయింది. ఖర్చులు తడిసి మోపెడైపోయాయని బాధపడుతుంటే పులి మీదపుట్రలా కరెంటుఛార్జీల పెంపా? అని తెగ ఇదైపోయాడు. అత్యవసర సమావేశంపెట్టి ఇంట్లో ఎమర్జెన్సీ డిక్లేర్ చేశాడు. ఫ్యాన్ల జులాయి తిరుగుళ్ళు, పచ్చడినూర్పిళ్ళపై కఠిన ఉత్తర్వులు జారీచేశాడు. పడక ఏర్పాట్లన్నీ మార్చేశాడు. పర్యవసానం ఏమైందంటే....**

పాతమా? అని లెక్కలేసుకుంటూ' తెగని లెక్కకి కామా పెట్టి, తెగే లెక్క ఆఫీసులో వేసుకోవచ్చులే అని హడా విడిగా ఆఫీసుకి బయలుదేరాడు బుద్ధేశ్వర్రావు.

"వాటీజ్ దిస్ మిస్టర్ బుద్ధేశ్వర్రావు? ఏమిటయ్యా ఆఫీసు ఫైల్‌లో ఇంటి లెక్కలు? నీ బుర్ర పని చేస్తోందా? ఫ్యాన్‌లకి గీజర్‌కి ప్రత్యేక షీట్స్" ఆఫీసర్ అరుపులకి హడలిపోయాడు బుద్ధేశ్వర్రావు.

"అవి... అవి... మా ఆవిడ వేసిన పొదుపులెక్కలు సార్. పొరపాటున ఆ పేపర్స్ ఆఫీసు ఫైల్లో.. క్షమించండి సార్".

"నో... నో... మళ్ళీ ఇదో అబద్ధం. నీ చేతిరాత నాకు బాగా గుర్తు. నువ్వు ప్రిపేర్‌చేసిన ఎకౌంట్స్ నాకు నచ్చాయి. రేపాదివారం మా ఇంటికొచ్చి, మాఇంట్లో ఉన్న ఎలక్ట్రికల్ అప్లయన్స్ అన్నిటికి సెపరేట్ స్టేట్ మెంట్స్ తయారుచేసివ్వు. యూకెన్ గో".

బతుకుజీవుడా అనుకుంటూ బయటపడి, ఆఫీసు నుంచి వస్తూనే లోవాట్స్ బల్బులు ఓ అరడజను తెచ్చి, అప్పటివరకు ఇంట్లోవాడిన హైవాట్స్ బల్బులుతీసి భద్రపరచాడు. వాటి స్థానంలో లోవాట్స్ బల్బులు పెట్టాడు బుద్ధేశ్వర్రావు.

మసక వెలుతుర్లో తల్లికాలు మంచంకోడుకి కొట్టుకుని మోకాలుచిప్ప వాచిపోయింది. తల్లిని ఆటోలో ఆసుపత్రికి తీసుకెళ్ళి కట్టుకట్టించేసరికి ఆ ఖర్చుకి కళ్ళు తిరిగాయి.

రాత్రి భోజనం నోట్లో పెట్టుకునేసరికి కటికచేదు. "అయ్యో! మసక వెలుతుర్లో ఆవాలనుకుని తాలింపులో మెంతులు వేశా. అది పక్కన పడేయండి. ఇంకో కూరచేస్తా" అంది సుగుణ కన్నీళ్ళు పెట్టుకుంటూ.

పిల్లలు తండ్రికేసి 'ఇంటి దీపం ఆర్పేసిన ఘాతకుడు' అన్నట్టుచూసి నోట్లో పెట్టుకున్న కూరముద్దని తుపుక్కున ఉమ్మేశారు.

తన మొహంమీద ఉమ్మేయనందుకు సంతోషిస్తూ ముందుజాగ్రత్తచర్యగా వంటింట్లో మాత్రం కాంతిమంతమైన బల్బు పెట్టాడు.

లోవాట్స్ బల్బులవల్ల కరంటుబిల్లు ఏ మాత్రం కనికరం చూపలేదుగానీ, పిల్లలిద్దరికీ చూపు మందగించి కళ్ళజోళ్ళు వచ్చాయి.

పిల్లలకి జలుబూ, రొంపా, మాట్లాడితే తుమ్ములు, మాట్లాడకపోతే ముక్కు మూసీనది అయింది. ముక్కుని ఏ గుడ్డ దొరికితే దాంతో తుడుచుకుంటున్నారు. ఇచ్చింగ్ భరించలేకపోయిన పిల్లలు, ముక్కు తుడుచుకోవడంలో ఇస్త్రీ బట్టలకికూడా మినహాయింపు ఇవ్వలేదు. పిల్లలకి సేవలు చెయ్యలేక సణుగుతూనే ఉంది సుగుణ.

"పిల్లలకి రొంప పట్టడానికి మీరే కారణం" మొగుడితో ఘర్షణకి దిగింది సుగుణ.

"నేను కాదు కారణం. 'రెసిస్టెన్స్ పవరు' ఒంట్లో లేకపోవడంవల్ల" సంజాయిషీ అనిపించే లాజిక్ మాట్లాడాడు బుద్ధేశ్వర్రావు.

"ఒంట్లో కాదు ఇంట్లో పవరు లేకపోవడంవల్ల. ఇన్నేళ్ళూ ఏ కాలంలోనైనా వేణ్ణీళ్ళు పోసుకోవడానికి అలవాటుపడ్డ పిల్లలు, సడన్‌గా చన్నీళ్ళు పోసుకుంటే ఇదిగో ఇలానే అఘోరిస్తుంది"

"ఓహో! అదా సంగతి, గీజర్ కనెక్షన్ తీయించానని నీ ఏడుపు. పిల్లలన్నాక జలుబు చేయదా? ముక్కు ఉన్నాక కారదా?"

"అదీ మీదయవల్లే అంటున్నా. వెధవ కరంటు పొదుపూ మీరూను. పెద్దవాళ్ళం చన్నీళ్ళు పోసుకున్నా తట్టుకుంటాం. పాపం పిల్లల్ని బాధపడొద్దని వాళ్ళనుదుట కనీసం అమృతాంజనమైనా రాశాడోలేదో ఆ దేవుడు. మన కడుపున పుట్టడం వాళ్ళు చేసుకున్న పాపం".

"పోనీ ఇల్లు అమ్మేసి, కరంటు చవగ్గా ఉన్న రాష్ట్రానికి వెళ్ళిపోదామా?".

"అమరావతికి వెళ్ళలేనివాడు, ఆకాశానికి నిచ్చెనవేశాట్ట వెనకటికి మీలాంటివాడే." రొంప జి.యస్.టి.లా పాకి తనకి తగులుకునేసరికి నాలుగు తుమ్ములు తుమ్మి చిరంజీవ అనుకుంది సుగుణ.

సాయంత్రం ఆఫీసునుంచివస్తూ కూలాడి నెత్తిమీద పెద్ద రుబ్బురోలు, పొత్రంతో ప్రవేశించాడు బుద్ధేశ్వర్రావు. అదేదో కొత్త ఆయుధమో, యంత్రమో అని విడ్డూరంగాచూస్తూ పిల్లలు దాని చుట్టూమూగారు.

"ఏవిటండి ఇది?"

"ఆరోగ్యానికి రక్షా ఇస్తుంది రోలు" అంటూ లైఫ్ బాయ్ రాగం ఆలపిస్తూ "మనం ఈరోజు నుంచీ గ్రైండర్‌కీ, మిక్సీకీ కొన్నాళ్ళు లాంగ్‌లీవ్ ఇద్దాం. రోటి పచ్చటి ఆరోగ్యానికి చాలా మంచిదని మంతెన సత్యనారాయణరాజుగారు రోజూ టీవీలో చెబుతున్నారు"

"ఓహో! అదా సంగతి. మరి పిండెవరు రుబ్బుతారు శ్రీవారూ?"

"ఇంకెవరికీ ఆ అవకాశం మీరివ్వరని తెలుసు శ్రీమతిగారూ"

"అబ్బా! అలా వచ్చారా? నారు పోసినవాడే నీరు పొయ్యాలి, రోలు తెచ్చినవాడే రుబ్బి తీరాలండి".

"ఓహో! ఇలా వచ్చారా? రోలు తెచ్చిన కూలాడు వెళ్ళాపోయాడండీ"

"కూలాడు కేవలం డెలివరీ బోయ్. 'రోలు' ఓనరు మీరే కాబట్టి పిండిరుబ్బే 'రోల్' మీదే.



## కౌటిల్యుడి అర్థశాస్త్రం



"అర్థశాస్త్ర రచయిత విష్ణుగుప్తుడు. చణకునికుమారుడు కాబట్టి 'చాణక్యుడి'గా ప్రసిద్ధికెక్కాడు. కుటలమహర్షి ఆదిపురుషుడుగాగల 'కుటం' గోత్రీయుడు కాబట్టి 'కౌటిల్యుడు'గానూ ప్రసిద్ధికెక్కాడు.

చాణక్యుడు మౌర్యచంద్రగుప్తుడి అమాత్యుడే కాదు, తక్షశిల విశ్వవిద్యాలయ ఆచార్యుడు కూడా. క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దం (350-300)లో చాణక్యుడు జీవించాడు.

15 అధికరణాలు, 180 ప్రకరణలు, 150 అధ్యాయాలు, 380 కారికలతో (సూత్రాది వివరణలు) కూడిన ఆరువేల శ్లోకాల బృహత్ గ్రంథం కౌటిల్యుని 'అర్థశాస్త్రం'.

ఆర్థిక, రాజకీయ, వాణిజ్య, పరిపాలన నిర్వహణ, వాణిజ్య నిర్వహణ మొదలైన అనేక శాస్త్రాలకు బీజాలు ఈ గ్రంథంలోనే ఉన్నాయని 'చాణక్యనీతి మాలికలు' పుస్తకంలో డా. ఎన్వీ రామారావు పేర్కొన్నారు.

*సేకరణ: ఎన్.తారకరామారావు*

"ఇదెక్కడ న్యాయమే! తిండికి కావల్సిన వస్తువులు నేనే తెస్తున్నాననుకాబట్టి నేనే వంట చెయ్యాలా? పిల్లలకీ, మీకూ బట్టలు నేనే కొని తెస్తున్నాను కాబట్టి అవన్నీ నేనే కట్టుకోవాలా? అవసరమైతే ఈ విషయం మీద కోర్టుకెడతా!"

"వాదనలు అనవసరం. బొబ్బట్లు కావాలంటే రంగంలోకి దిగండి" అంటూ ఉడకేసిన సెనగ పప్పు గ్రైండర్ లోంచితీసి రోట్లో వేసింది. తప్పనిసరై, తనకి ఇష్టమైన బొబ్బట్లు ఎరవేసి, ట్రాప్‌లో పడేసినమూలాన నడుం బిగించి, కాస్సేపు రుబ్బి నీరసమొచ్చి చిన్నబ్రేక్ ఇచ్చాడు బుద్ధేశ్వర్రావు. సానుభూతితో కాస్త కాఫీ ఇచ్చి, పనిలోపనిగా రోట్లో బెల్లమేసింది సుగుణ.

రుబ్బిరుబ్బి అలసిపోయిన పొత్రం, రుబ్బురోల్లోంచి రానని కదలక, మెదలక, మొండికేసింది. ఎంతలాగినా బయటకు రానని మొరాయించింది.

బలం అంతా ఉపయోగించి, పొత్రాన్ని రోట్లోంచి లాగేసరికి అది స్లిప్ అయి, కుడిచేతి వేళ్ళు రోటిలో ఉండగానే వాటిమీద 'పొత్రం' పడింది.

వేరే చెప్పే అఖ్ఖర్లేకుండా చేతివేళ్ళు పచ్చడయ్యాయి. వేళ్ళకి కుట్లేసి కట్టుకట్టి, నెల్లాళ్ళపాటు ఆ వేళ్ళతో ఏవేళా ఏ పనీ చెయ్యొద్దని వేలకివేలు గుంజాడు డాక్టరు.

లాసాఫ్ పే మీద మెడికల్ లీవుపెట్టి, రోటిలెక్క, నోటిలెక్క వేసుకుంటూ... అదీ తెగక "ఒక గంట గ్రైండర్ వాడితే కరంటుఖర్చు ఎంత పెరుగుతుంది? అదే టైమ్‌లో రుబ్బురోలు వాడితే ఎంత మిగులుతుంది? ఏతావాతా లాసాఫ్‌పేతో పోలిస్తే లాభమా, నష్టమా?" అంటూ పిల్లలకి హోమ్‌వర్క్ ఇచ్చి కాల్చుకుతిన్నాడు. ఆ దెబ్బతో పిల్లలకి లెక్కలంటే భయం, జుగుప్స పుట్టుకొచ్చి లెక్కల్లో ఫెయిలయ్యారు.

కరంటు ఖర్చు తగ్గడానికి 'పడక పథకం' డిజైన్ చేశాడు బుద్ధేశ్వర్రావు.

"ఈరోజునుంచి మా అమ్మరూమ్‌లో మాత్రమే ఫ్యాన్ తిరుగుతుంది. పిల్లలూ! మనం అందరం హాయిగా హాల్లో కథలు చెప్పుకుంటూ పడుకుందాం. వీధి తలుపు తీసుంచితే చల్లటిగాలి వీస్తుంది"

"తలుపులు తీసుంటే దొంగాడొస్తాడేమో నాన్నా!"

"గ్రిల్ ఉందిగా, దానికి తాళం వేద్దాం. నేనున్నానుగా మీకేం భయంలేదు"

"నీతోనే మాకు భయం నాన్నా! కథ చెప్పినట్టే చెప్పి కరంటు లెక్కలు అడుగుతావు"

"ప్రామిస్ ఏం అడగను పడుకోండి"

అర్థరాత్రి పొట్టలో ఎవరో తన్నినట్లైతే ఉలికిపడి లేచాడు బుద్ధేశ్వర్రావు. కొడుకు తనపక్కలో దూరి ఐ.పి.యల్. లెవెల్లో కబాడీ ఆడుతున్నాడు. కూతురు తల్లిదుప్పట్లో దూరి కూచిపూడి చేస్తోంది.

బ్రహ్మచర్యం భరించలేక దొంగలా భార్యపక్కలో దూరాడు బుద్ధేశ్వర్రావు.

కూతురు అదిరిపడి లేచి భయంగా దొంగ దొంగ అని అరవడం మొదలెట్టింది. ఇంటిల్లిపాదీ లేచారు. లైట్లన్నీ వెలిగాయి.

"ఎక్కడ? ఎక్కడ?" అంటూ ఏమీఎరగనట్టు కర్ర తీసుకుని దొరకని దొంగకోసం వెతకడం మొదలెట్టాడు బుద్ధేశ్వర్రావు.

భర్త నటనచూసి, ఎవరూ చూడకుండా కొంగు అడ్డుపెట్టుకుని నవ్వుకుంది సుగుణ.

"దొంగాడు ఎక్కడ దాక్కున్నాడో? ఎప్పుడు నా బుర్ర బద్దలుగొట్టి నా గొలుసూ, గాజులూ, లాక్కుంటాడో అని భయంగా వుందే" అంటూ అత్తగారు కోడలు పక్కలో దూరి గట్టిగా కౌగలించుకుని పడుకుంది.

సిగ్గుతో చచ్చినంత పనైంది సుగుణకి. సుగుణ కౌగిలింతకు దూరమైనందుకు తనకర్రతో తన బుర్ర బద్దలు కొట్టుకోవాలన్నంత తిక్క పుట్టింది మన హీరోకి.

***

"అమ్మకి ఒంట్లో బావోలేదక్కా. ఇక్కడ ఆసుపత్రిలో అన్ని టెస్టులూ చేయిద్దామని తీసుకొచ్చా" అంటూ బుద్ధేశ్వర్రావు బావమర్ది, అత్తగారు దిగారు.

బావమర్ది విజయవాడలో వి.టి.పి.యస్‌లో ఇంజనీరు.

అత్తగారిది కరంటువాడకంలో భారీచెయ్యి. ఫ్యాన్ వేస్తే ఇరవైనాలుగు గంటలూ తిరుగుతూ ఉండాలి, ఆవిడ ఎక్కడ తిరిగినాసరే. దేవుడిదీపాల్లా ఇంట్లో రాత్రింబవళ్ళు లైట్లు వెలగవలసిందే. ఆవిడకు స్విచ్ వెయ్యడమేగానీ, ఆర్పడం రాకపోవడానికి కారణం కొడుక్కి కరంటు బిల్లు రాకపోవడమే.

పిల్లల్ని పిలిచి రహస్యసమావేశం ఏర్పాటుచేసి అమ్మమ్మమీద సర్జికల్‌దాడి ఎలా చెయ్యాలో, కరెంటు బిల్లు పెరగకుండా ఎలా కాపాడుకోవాలో ట్రైనింగిచ్చాడు బుద్ధేశ్వర్రావు.

అమ్మమ్మ ఫ్యాన్‌వేసి కాలు కదిపితే చాలు పిల్లలు స్విచ్ ఆఫ్ చేసేవారు. "మాయదారి కరెంటు హైదరాబాద్‌లో అస్తమానం పోతుంది" అని సణుక్కోవడం మొదలెట్టిందావిడ అసలు సంగతి తెలియక.

ఎంత పొదుపుగా వాడినా కరంటుబిల్లు కసికొద్దీ పర్స్‌కి చిల్లు పెట్టడం మానటంలేదు.

విసుగెత్తి, ఓల్డ్‌సిటీలో ఉండే తన కొలీగ్ కరీమ్‌తో తన కరంటుబాధ చెబితే,

"బుద్ధూ భయ్యా! మేం కరంటు బిల్లుకి భయపడం. మా బస్తీలో పోల్‌నుంచే డైరెక్ట్ ఇంటి కనెక్షన్" అంటూ ఒక టెక్నీషియన్‌ని తీసుకొచ్చాడు. వాడు ఏం మాయచేశాడో ఏమిటోగానీ మీటర్ని తిరక్కుండా ఆపుచేసి, వెయ్యిరూపాయలు ఫీజుపుచ్చుకుని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

దీపాలు విరామం లేకుండా వెలగడం, ఫ్యాన్లు జోరుగా జులాయిల్లా తిరగడం మొదలెట్టాయి. మీటరు తిరగకుండానే మూడు నెలలపాటు కరంటుబిల్లు మినిమమ్ వచ్చింది.

వెయ్యిపోతే పోయాయిగానీ, బిల్లు పెరగనందుకు ఇంటిల్లిపాది మొహాలూ వెలిగిపోయాయి.

ఒకానొక దుర్ముహూర్తాన, ఎలక్ట్రికల్ డిపార్ట్‌మెంట్ నుంచి చెకింగ్ ఇన్‌స్పెక్టర్ వచ్చాడు. "మూడు నెలల నుంచి కరంటుబిల్లులు ఘోరంగా తగ్గిపోయిన మీటర్లు చెక్కు చెయ్యడానికి వచ్చాం" అంటూ రంధ్రాన్వేషణచేసి, "మీటర్ ట్యాంపరింగ్ జరిగింది. ఐదువేలు పెనాల్టీ కట్టాలి" అంటూ బిల్లు రాయబోయాడు.

కాళ్ళా వేళ్ళాపడితే రెండువేలు లంచం పుచ్చుకుని "తొందరపడి మీటర్ బాగుచేయించకపోతే మీకూ, మాకూ లాభం. అప్పుడప్పుడు వస్తూ ఉంటా" అంటూ సెల్ నెంబరు నోట్ చేసుకుని వెళ్ళాడు. మూడువేలు మిగిలాయని సంబరపడ్డాడేగానీ, బుద్ధేశ్వర్రావుకి బుద్ధిరాలేదు. "ఎందుకండి కక్కుర్తిపనులు. నలుగురికీతెలిస్తే నామోషీ. అత్తయ్యగారి ఆరోగ్యం పాడైయింది. ఇంటికి కొత్తవాళ్ళు ఎవరొచ్చినా చెకింగ్‌కి వచ్చారని గుండెపట్టుకుని కూర్చుంటున్నారు. తప్పుడు పనులు చేసి కూడబెట్టినదానితో పిల్లలు అభివృద్ధిలోకి రారు. పిల్లలకి పుణ్యం ఇవ్వాలిగానీ, పాపిష్టి డబ్బు కాదు" అంటూ నెత్తీనోరూ బాదుకుంది సుగుణ.

మీటరు తిరక్కుండా ఆపేసినవాణ్ణి తీసుకొద్దామంటే వాడు జైల్లో ఉన్నాడని తెలిసింది. కాస్తబద్ధకం, మరికాస్త నిర్లక్ష్యంతో మీటర్ బాగుచేయించకుండా గడిపేశాడు బుద్ధేశ్వర్రావు. కానీ లోపలలోపల, ఎవడొచ్చి ఎప్పుడు గోచీలో టపాకాయ వేస్తాడో అన్న టెన్షన్‌తో బి.పి. షుగురు ఎటాకయ్యాయి. తనబాధ, బావగారి బాగోతం తమ్ముడితోచెప్పి కన్నీళ్ళు పెట్టుకుంది సుగుణ.

***

ఓ సుముహూర్తాన, మీటర్ చెకింగ్‌కి పెద్ద ఆఫీసర్ వచ్చారు.

"ఆరు నెలలనుంచి మీ మీటర్ మినిమమ్ రీడింగ్ చూపిస్తోంది. ట్యాంపరింగ్ జరిగింది. కొత్త రూల్సు ప్రకారం మీకు ఆరేళ్ళు జైలుశిక్ష. ఇప్పుడే పోలీసులకి ఫోనుచేస్తా" అంటూ సెల్‌ఫోన్ తీశారు.

ఇంతలో బుద్ధేశ్వర్రావు బావమర్ది ఇంట్లోకి వస్తూనే "హలో రమణారావు. వాటే సర్‌ప్రైజ్! ఏంటిలా వచ్చావు?" అంటూ ఆప్యాయంగా పలకరించాడు.

అన్నీ వివరంగా తెలుసుకుని తలూపి, "తప్పుకి దండనతప్పదు" అన్నాడాయన. "బావగారూ! ఈ రమణారావు ఇంజనీరింగ్‌లో నా క్లాస్‌మేట్. చాలా ఏళ్ళ తర్వాత కలిశాం. ఇప్పుడే వస్తాం" అంటూ రమణరావుతో గుసగుసలాడుతూ బయటకెళ్ళాడు.

"ఆ చెకింగ్ దొంగవెధవ వచ్చేలోపు మీటర్ బాగు చేయించండి. మా తమ్ముడి పుణ్యాన మనకి మంచి అవకాశం వచ్చింది" అంటూ తను కంగారుపడుతూ మొగుణ్ణి తొందరపెట్టింది సుగుణ.

***

బుద్ధేశ్వర్రావు ఎలక్ట్రీషియన్‌ని తీసుకొచ్చేసరికి ఏడుస్తూ అరుగుమీద కూర్చున్న భార్యాపిల్లల్ని చూసి అవాక్కై "అమ్మకేమయింది?" అంటూ కంగారుగా అరుస్తూ లోపలికి వెళ్ళబోయాడు. ఇంట్లోంచి వచ్చిన పొగ అతడికళ్ళని కమ్మేసింది.

"మనం ఆడిన నాటకం బాగానే రక్తికట్టింది. నేను నిజంగా చెకింగ్ ఆఫీసర్నే అనుకున్నాడు మీ బావ. పోనీలే ఏదో ఒకవిధంగా ఆయనకి బుద్ధొచ్చి ప్రభుత్వాన్ని మోసం చెయ్యకూడదన్న జ్ఞానోదయం కలిగితే అంతేచాలు" అంటూ ఇంట్లోకివస్తూ అక్కడ వాతావరణంచూసి "ఏమైంది?" అని ఎలక్ట్రీషియన్‌ని అడిగాడు రమణారావుగారు.

"షార్ట్ సర్క్యూట్ అయింది సార్, అన్నీ కాలిపోయాయి" అన్నాడు.

"కరంటు, మాబావకి షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చినట్టుంది" అన్నాడు బాధగా బు.బా (బుద్ధేశ్వర్రావు బావమర్ది).

సెల్:98491 42361




**పెళ్ళి వేడుక చూడటానికి వచ్చి, దూరదూరంగా నిలబడి ఉన్నారు కొందరు గ్రామస్థులు. అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చిన గంగారాంని గుర్తుపట్టేశాడు వారిలో ఒకతను.**

**'హేయ్.... నువ్వు ఇంకా ఇక్కడే ఉన్నావేమిటి? తన్ని తగలేసినా నీకు బుద్ధి రాలేదా?' కోరగా అడిగాడు అతను..**

**'బుద్ధి రాకపోవటమేమిటి సారూ... బాగా వచ్చింది. మీకు ఒక చిన్న రహస్యాన్ని చెప్పి పోదామని పనిగట్టుకుని మరీ వచ్చాను. ఒకసారి కొంచెం ఇవతలికి వస్తారా?' రహస్యంగా అడిగాడు గంగారాం.**

రకరకాల భావాలు వెంటవెంటనే ప్రత్యక్షం అయ్యాయి ఆ మనిషి ముఖంలో. తడవు చేయకుండా కదిలాడు. ఇంటికి దూరంగా ఉన్న పాక దగ్గరికి పోగానే, 'చెప్పు... ఏమిటా రహస్యం' అని అడిగాడు ఆత్రుతగా.

పిడికిలి బిగించి పైజమాకి రుద్దుకుంటున్నాడు గంగారాం. కంటికి కనిపించనంత వేగంతో పైకెత్తి బలంగా పొడిచాడు అతని ముఖం మీద.

అరిచి కేకలు పెట్టవలసినంత దెబ్బ అది. గ్రామంలో ఉన్న వారందరినీ ఎలర్ట్ చేయవలసినంత గట్టిగా తగిలింది.

అయితే అరుపు అతని కంఠనాళాలలో నుంచి బయలుదేరకముందే తప్పిపోయింది తెలివి. మొదలు నరికిన చెట్టు మాదిరి నిలుచున్న చోటులోనే నేలకూలిపోయాడు.

'నా బుద్ధిని గురించి మాట్లాడే హక్కు ఒక్క మా గురువుగారికి మాత్రమే ఉంది. ఇంకెవడయినా నోరు జారితే ఫలితం ఇలాగే ఉంటుంది' కచ్చ తీరనట్టు పడిపోయిన వ్యక్తి తొడలమీద లాగిపెట్టి తన్ని, మళ్ళీ అంతకుముందు వెళ్ళి నిలబడిన ప్రదేశానికి పోయి నిలుచున్నాడు.

ఈసారి అతన్ని గమనించే వెసులుబాటు అక్కడ గుమికూడిన వారికెవరికీ లేకుండా – తమలో తాము కుమిలిపోవటాన్ని దాటి పెద్ద కంఠంతో పెళ్ళి వారిని గురించి ఏడ్వటం కొనసాగించారు పెళ్ళి కూతురి బంధువులు.

'ఏం జరిగింది సారూ... అసలు ఏమిటి ఈ గోల?' తన ముఖం సరిగ్గా కనిపించకుండా కొద్దిగా తల వంచుకుని తన ముందున్న మనిషిని అతని భుజం మీది నుంచి అడిగాడు గంగారాం.

'కాంటన్ నగరం నుంచి వచ్చారు పెళ్ళివాళ్ళు మన దుకాణం యజమాని ఇంటిలో విడిది చేశారు. కట్నం డబ్బులు ఇంకో వెయ్యి ఎక్కువగా ఇస్తేగాని పెళ్ళి జరగదని కబురు చేశారు' తల తిప్పి అతనికేసి చూడకుండానే చెప్పాడు ఆ మనిషి.

'అదేంటి? అక్రమం కదా... ముందుగా మాట్లాడుకున్నది....' ఆశ్చర్యంగా కామెంట్ చేయబోయిన గంగారాం మాటలు ముగియకముందే, 'పెళ్ళి కొడుకు కాంటన్ నగరంలో ఉండే హుహుశాన్‌కి రెండు వేలు బాకీ ఉన్నాట్ట. అది తీరితేగాని పెళ్ళి జరగదని కబురు' అన్నాడు ఆ మనిషి.

మగపెళ్ళివారు దుకాణం యజమాని ఇంట్లోనే విడిది చేయటానికి కారణం బోధపడింది గంగారాంకి.

బాకీని వసూలుచేసే బాధ్యతను ఆ పెద్దమనిషికే అప్పగించబడినట్లుంది. తన పొడుగాటి చేతుల్ని విసురుగా ఊపుకుంటూ వెళ్ళి ఇంటిముందు నిలుచుని ఉన్నాడు అతను.

'త్వరగా తేల్చిచెప్పండి. నేను హుహుశాన్ సారుకి వెంటనే ఏదో ఒక కబురు పంపించాలి' ఆగి ఆగి అందరినీ తన కీచుకంఠంతో హడలగొడుతున్నాడు.

> ### జరిగిన కథ
>
> *కుంగ్‌ఫూ విద్యాపీఠానికి కాబోయే పీఠాధిపతి ప్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు షాడో. కాంటన్ సిటీలో హుహుశాన్ మనుషులతో గొడవ పడతాడు. డూడూ సామ్రాజ్యం గురించీ, అప్పటి కుంగ్‌ఫూ విద్యాపీఠాధిపతి సూసీయన్ గురించీ గంగారాంకి చెబుతుంటాడు షాడో. మధ్యలో ఆపి, ఆకలి తీర్చుకోవడానికి గ్రామంలోకి వెళ్ళి, హుహుశాన్ మనిషైన దుకాణ యజమాని మనుషుల్ని కొట్టి, కట్టిపడేస్తారు. ఆ తర్వాత పెళ్ళి జరగబోతున్న ఒక ఇంటికి వెళ్ళి, అక్కడే పాకలో కాసేపు విశ్రాంతి కోసం ఆగుతారు.*
>
> *ఆ తర్వాత...*

పాక దగ్గరికి తీసుకుపోయి తను పడుకోబెట్టి వచ్చిన గ్రామస్థుడి మాదిరిగానే అతన్ని కూడా అవతలికి తీసుకుపోతే ఎలా ఉంటుందోనని ఆలోచించాడు గంగారాం.

హుహుశాన్ పంపించిన చంచాలు ఇప్పుడు లేరు అతని వెనుక. కాళ్ళు చేతులు కదల్చలేని పరిస్థితిలో ఊరి బయట కుక్కిన పేనుల మాదిరి పడి ఉన్నారు.

అతన్ని పట్టుకోవటం గాని, ముఖాన్ని పచ్చడి చేయటం గాని ఏమంత పెద్దవైన పనులు కాబోవు. కాని ఆ తర్వాత ఎదురయ్యే పరిస్థితుల్ని తట్టుకోవటమే పెద్ద సమస్య.

తల వంచుకుని పెళ్ళికి సిద్ధపడితే ఎటువంటి గొడవా ఉండదు. హుహుశాన్‌కి భయపడి వెనకడుగు వేస్తే రచ్చ మరింత పెద్దదవుతుంది.

కాంటన్ సిటీలో జరిగిన అవమానాల్ని తలుచుకుని రగులుకుపోతున్న హుహుశాన్, ఇప్పుడు గ్రామీణ ప్రాంతాల్లో కూడా తన ప్రాపకం అభాసుపాలవుతున్నదని తెలిసి, సపరివారంగా వచ్చేయవచ్చు.

రెక్కాడితే గాని డొక్కలు నిండని ఈ పేదప్రజలు అతన్ని ఎదిరించటం అసంభవం.

అప్పటికప్పుడు సరయిన ఆలోచన తట్టకపోవటంతో, తల బరుక్కుంటూ వెనుతిరిగాడు గంగారాం.

ముఖం మీద పడిన దెబ్బనుంచి తేరుకుని అప్పుడే కళ్ళు తెరుస్తున్నాడు పాక ముందు అడ్డదిడ్డంగా పడిపోయి ఉన్న మనిషి. ఎడమ పాదాన్ని వెనక్కి తీసుకుని అతన్ని ఇంకో తన్ను తన్నబోయి, ఆఖరి క్షణంలో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు గంగారాం. ముందుకు వంగి, అతని భుజాలు పట్టుకుని లేపి కూర్చోబెట్టాడు.

'అరుస్తాను. అందరినీ పోగుచేసి నీకు తగిన శాస్తి చేయిస్తాను' బూరెల మాదిరి ఉబ్బిపోయిన తన బుగ్గల్ని తడుముకుంటూ బెదిరించాడు ఆ మనిషి.

'నువ్వు అరిచేలోపుగా ఇంకోసారి నీ ముఖం బజ్జీ అయిపోతుంది గాని, ఆవేశపడకుండా మాట్లాడుకుందాం.. సరేనా?' పిడికిలిని అతని ముక్కు దగ్గర ఆడిస్తూ అన్నాడు గంగారాం.

గుటకలు మింగాడు ఆ మనిషి. 'అలాగే... నువ్వు ఎలాచెపితే అలాగే. ఆవేశపడను. అరచి కేకలు పెట్టను' గబగబా చెప్పాడు.

'దుకాణం యజమాని నీకు ఏమవుతాడు?

చుట్టమా? పక్కమా? లేక బంధువా? బాగా కావాల్సిన వాడా?' అడిగాడు గంగారాం.

'ఏమీకాడు. కాంటన్ నగరం నుంచి సరుకుల్ని తెచ్చుకోవటానికి నా గుర్రపు బగ్గీని వాడుకుంటూ ఉంటాడు. సంవత్సరానికి ఒకసారి నాలుగు టిక్కీల ధాన్యం కొలిచి ఇస్తూ ఉంటాడు. పండుగలప్పుడు ఎప్పుడయినా ఒకటి రెండు ఉప్పు చేపల్ని ఇంటికి పంపిస్తాడు...' చెప్పాడు ఆ మనిషి.

'సంవత్సరం పొడవునా బండిని ఇచ్చినందుకు ముష్టి నాలుగు టిక్కీల ధాన్యమా? కాంటన్ నగరం ఇక్కడికి దగ్గర్లో ఉన్నదా?' ఆశ్చర్యంగా అడిగాడు గంగారాం.

'లేదనుకో.... కాని చాలాకాలంగా అలవాటు అయిపోయింది...' తల వంచుకుంటూ చెప్పాడు ఆ మనిషి.

'ఇటువంటి అలవాట్లు గాలికి పుట్టి ధూళికి అభివృద్ధి జరగవు. కారణం ఇంకోటి ఏదో ఉన్నది. అదేమిటో నాకు చెప్పాలి' చటుక్కున జేబులోంచి అతని అంగీని పట్టుకుని ముందుకు లాగుతూ అడిగాడు గంగారాం.

'మా తాత తండ్రుల కాలం నుంచీ అతని కుటుంబానికి మా కుటుంబానికి మధ్య బోలెడంత అనుబంధం..... అందుకే' అన్నాడు ఆ మనిషి..

తేరిపార చూశాడు గంగారాం అతన్ని. శుభ్రమైన దుస్తులే అతనివి. అయితే ఏమంత ఖరీదయినవి కావు. చూడదగిన ముఖమే... ఏమంత అందగాడు కూడా కాదు. సామాన్య కుటుంబంలో నుంచి వచ్చినవాడి మాదిరిగానే ఉన్నది అతని వాలకం. గుర్రపు బగ్గీని అరువు ఇచ్చి నాలుగంటే నాలుగు టిక్కీల ధాన్యంతో సరిపెట్టుకోవటం మాత్రం ఇంపాజిబుల్.

"చెప్పు స్నేహితుడా... అసలు విషయం ఏమిటో త్వరగా చెప్పు. ఆలస్యం చేశావంటే ఆహారాన్ని నమిలి మింగటానికి నీ నోట్లో దంతాలు ఉండవు. అన్నీ రాలిపోతాయి...' కింద కనిపించిన ఒక పలుకురాయిని చటుక్కున అందుకుని అతని నోటికి ఆనిస్తూ హెచ్చరించాడు.

ఆవేశకావేశాలకు లోనుకాకుండా కూర్చుని మాట్లాడుకుందామని చెప్పిన మనిషి, ఉన్నట్లుండి అంత కంగారుగా మాటలు మొదలు పెట్టేసరికి తెల్లబోయాడు ఆ వ్యక్తి.

'చెప్పు... త్వరగా త్వరగా' మరోసారి హెచ్చరించాడు గంగారాం.

గింజుకున్నాడు అతను. అతని చేతుల్ని వదిలించుకుని పారిపోవాలని ప్రయత్నం కూడా చేశాడు.

'ఏమిటి గోల గంగూ? సుఖంగా కాసేపు కూడా నిద్రపోనీయవా?' అంటూ పాకలోంచి బయటికి వచ్చిన షాడోని చూడగానే బెదిరిపోయాడు.

తనకు అర్థం కాని భాషలో తనను చంపేయటానికే నిశ్చయమైందని అనుకుంటూ ఒక్కసారిగా చేతులు జోడించాడు.

'దుకాణం యజమాని భార్య నాకు చాలా బాగా పరిచయం. గుర్రపు బగ్గీ తనే నాకు కొని ఇచ్చింది. దాన్ని తీసుకుని అతను కాంటన్ నగరానికి వెళ్ళిన తర్వాత మేము ఇద్దరమూ సన్నిహితంగా గడుపుతాము. అద్దె డబ్బులు ఎంత ఇస్తే అంతే తీసుకోమని తనే నాకు చెప్పింది' తడుముకుంటూ తడుముకుంటూ అసలు విషయాన్ని బయట పెట్టేశాడు.

'మనదేశంలోనే ఇటువంటివి జరుగుతూ ఉంటాయని అనుకున్నాను. అన్ని దేశాల్లోనూ ఇవి బ్రహ్మాండంగా జరిగిపోతూ ఉంటాయని ఇప్పుడే అర్థం అయింది' షాడోకి చెప్పాడు గంగారాం.

'ఇంతకీ ఈ గొడవ దేనికోసమో నాకు చెప్పలేదు' పాక ద్వారం దగ్గర కూర్చుంటూ అన్నాడు షాడో.

ఇంటిముందు తను చూసిన విషయాలన్నిటినీ వివరంగా చెప్పాడు గంగారాం. దీపస్తంభం మాదిరి నిలుచుని ఉన్న దుకాణం యజమాని వైఖరిని వివరించాడు.

'వెరీగుడ్.. సరయిన సమయంలో సరిగ్గా సరిపోయే మనిషి నీకు దొరకటం నిజంగా చాలా గొప్ప విషయం. వాడి వేలితో వాడి కన్నుల్నే పొడిచేద్దాము... ప్రొసీడయిపో' అన్నాడు షాడో.

అయోమయం నిండిన చూపులతో తమని అబ్జర్వ్ చేస్తున్న మనిషి అంగీ పైభాగాన్ని బిగించి పట్టుకుని బలవంతంగా పైకి లేపాడు గంగారాం.





'పద బ్రదరూ... ఎంతో కాలం నుంచి నువ్వు అనుబంధం పెంచుకున్న అమ్మడి దగ్గరికి పోయి వద్దామా...' అంటూ పాక వెనుకభాగంలో నుంచి గ్రామాన్ని ఆనుకుని ఉన్న ఒక కాలిబాట మీదికి తీసుకుపోయాడు.'

***

తన అంగీకారంతో నిమిత్తం లేకుండా మగపెళ్ళివారి జనాన్ని తీసుకువచ్చి తమ ఇంటిలో కూర్చోబెట్టినందుకు విపరీతమైన కోపంతో తాచు పాము మాదిరి బుసలు కొడుతున్నది కియాచో.

'ఇది హుహుశాన్ సారుకి సంబంధించిన వ్యవహారం. కాదూ కూడదని అడ్డం తగిలితే బురద నేలల దగ్గరికి తీసుకుపోయి పాతాళంలోకి తొక్కించేస్తాడు. ఓపికపట్టు' అని చెప్పి పెళ్ళివారింటి దగ్గరికి పోయాడు ఆమె భర్త.

'అన్నీ సజావుగా జరిగిపోయి ఉంటే ఈ మందకి తిండీతిప్పలు అన్నీ ఆ పెళ్ళింట్లోనే జరిగిపోయి ఉండేవి. ఇప్పుడు మనమీద పడింది ఆ బాధ్యత... అదేమిటో చూసుకోండి' అంటూ తనకు సేవలు చేసే ఇద్దరు ఆడవారిని ఆ పెళ్ళి బృందం దగ్గరికి పంపించి, తమ తోట వెనుకభాగంలో ఉన్న చిన్న పూతోటలో కూర్చున్నది ఆమె.

ఉన్నట్లుండి ఆమెకు సమీపంలోకి వచ్చి పడింది ఒక మట్టిబెడ్డ. ఉలికిపడి చూసిన ఆమెకు తోటకు అవతల ఉన్న చెట్టుకింద కనిపించింది గుర్రపు బగ్గీ.

మనసును ఆవరించుకుని ఉన్న చికాకంతా చిటికెలో మటుమాయం అయిపోతూ ఉండగా, పరుగు లాంటి నడకతో అటుకేసి పోయింది.

'నీకసలు బుద్ధిలేదు. పెళ్ళివారింటి దగ్గరికిపోయిన వాడు ఏ క్షణంలోనైనా తిరిగి వస్తాడు. చూశాడంటే నీకు తన్నులు, నాకు తిట్లు... వెళ్ళిపో...' బండి చక్రం దగ్గర నిలబడి అయిష్టంగానే హెచ్చరించింది.

'రమ్మని చెప్పు బే. బండిలోకి రమ్మని చెప్పు...' ఆమె ప్రియుడి మెడ మీద పట్టును

**తనకు పాపాయి పుట్టిందనీ, క్షేమంగానే ఉన్నదనీ తెలిసిన తర్వాత కుదురుగా ఉండలేకపోతున్నాడు షాన్‌సూ. పాపాయిని చూడాలన్న ఆరాటం, తపన ఎక్కువయ్యాయి. ఇప్పటివరకు నిగ్రహంగా ఉన్నాడు తను. ఇక తనవల్ల కాదనుకున్నాడు. ఎలాగైనా లాకప్‌నుంచి బయట పడాలని ఆలోచిస్తున్నాడు. అలా ఆలోచిస్తుండగానే అనుకోని అవకాశం వచ్చిందతనికి. ఇంతకీ ఏమిటా అవకాశం? షాన్‌సూ తప్పించుకున్నాడా?**

బిగిస్తూ తను తీసుకు వచ్చిన మనిషిని హెచ్చరించాడు గంగారాం.

'లోపలికి రా... బయట నిలబడితే అందరికీ కనిపిస్తాము... వచ్చేయ్' తడబడుతున్న కంఠంతో ఆమెను పిలిచాడు ఆ మనిషి

తన పెనిమిటి చూస్తే కొంపలు అంటుకుంటాయని అతన్ని హెచ్చరించిన సంగతిని మర్చిపోయినట్లు, గబుక్కున బగ్గీలోకి ఎంటర్ అయింది కియాచో. ఎంటర్ అయిన వెంటనే కనిపించిన దృశ్యాన్ని చూసి అదిరిపడింది. అదిరిపడిన వెంటనే ఎంత వేగంగా బగ్గీ ఎక్కిందో అంతే వేగంగా క్రిందికి దూకేయబోయింది.

తన రెండవ చేతిని జాచి, పొడవాటి ఆమె కేశాల్ని బిగించి పట్టుకున్నాడు గంగారాం.

'నాకు ఆడవాళ్ళంటే అమితమైన గౌరవం. ఎవరిని చూసినా నాకు జన్మనిచ్చిన తల్లే కనుల ముందు మెదులుతుంది. చూస్తూ చూస్తూ నీకు హాని చేయడం నాకు చేతకాదు' చిన్న కంఠంతో చెప్పాడు.

'ఎందుకు? ఏమిటి ఇది?' పొడి ఆరిపోయిన కంఠంతో అడిగింది ఆమె.

'వివరంగా చెప్పేందుకు సమయం లేదు. నువ్వు వచ్చిన పని పూర్తిచేసుకో... పదే పది నిమిషాల్లో నేను వచ్చిన పని పూర్తి అయిపోతుంది. అంగీకారమేనా?' అడిగాడు గంగారాం.

మాట్లాడలేకపోయింది ఆమె. మూగగా చూసింది.

'నీ సంగతి ఏమిటి బే? నీ అభిప్రాయం చెప్పు. నువ్వు మంచి పని చేస్తున్నావో లేదో నాకు తెలియదు. గోల చేస్తే మాత్రం నీ బతుకు మట్టిలో పొర్లడం తప్పదు' కరుకుగా అన్నాడు గంగారాం.

'అరవను... నోరు తెరవను' హీనస్వరంతో చెప్పాడు ఆ మనిషి.

దుకాణం యజమాని భార్య జుట్టును వదిలేసి, చెంపలు వేసుకుని, చేతులు జోడించాడు గంగారాం.

'క్షమించు తల్లీ... చేయకూడని పని చేసినందుకు మన్నించేయ్' అంటూ బగ్గీలో నుంచి దూకి పూతోట లోనుంచి ఇంట్లోకి ఎంటర్ అయ్యాడు.

***

'అనవసరమైన రిస్కు తీసుకున్నావు. మాట

మార్చి కేకలు పెట్టి ఉంటే ఏంచేసేవాడివి?' ఇరవై నిమిషాల తర్వాత ఆయాసంతో వగరుస్తూ వచ్చిన గంగారాంని అడిగాడు షాడో.

'కష్టం గురూ... వాళ్ళు వెనుకాముందూ ఆలోచించుకోలేనంత పిచ్చి తమకంలో ఉన్నారు. కలుసుకుని చాలారోజులు అయి ఉంటుందని నాకు అనిపించింది, ఆ అమ్మడి స్పీడును చూడగానే' నవ్వుతూ చెప్పి తను తీసుకువచ్చిన మూటను అతని ముందు పెట్టాడు.

ఫెళఫెళలాడుతున్న కరెన్సీ నోట్లు, మిలమిలమెరిసిపోతున్న బంగారు నగలు, తళతళమంటున్న వెండి నాణేలు చాలా ఉన్నాయి మూటలో.

మూడు వేల యువాన్ల విలువచేసే నోట్లకట్టల్ని మాత్రం బయటికి తీసి తల ఊపాడు షాడో.

'రెండు నిమిషాలు... రెండంటే రెండే నిమిషాలు... ఇలా పోయి అలా వచ్చేస్తాను' అంటూ మిగిలిన సొత్తును తిరిగి మూటకట్టి పాక బయటికి పరిగెత్తాడు గంగారాం.




ఆడపెళ్ళివారి ఇంటి దగ్గర మొదలయిన గొడవ ఇంకా ఒక కొలిక్కి రాలేదు కాబోలు గ్రామంలోని జనంలో మూడొంతుల మంది ఆ ఇంటి ముందే గుమికూడి ఉన్నారు.

బోసిపోయి ఉన్నది గ్రామంలోని మెయిన్‌రోడ్డు. ఆ రోడ్డుమీదికి పోలేదు గంగారాం. రోడ్డును ఆనుకుని ఉన్న ఇళ్ళ వెనుక భాగాల్ని చేరుకున్నాడు. తను తీసుకువచ్చిన మూటలో చేయిపెట్టి, చేతికి తగిలిన కరెన్సీ నోట్లను ఇంటి వెనుక ఉండే నీటి తొట్టి దగ్గర గాలికి ఎగిరిపోకుండా జాగ్రత్తగా భద్రపరిచాడు.

కొన్ని ఇళ్ళ వెనుక నోట్లు దాచాడు. మిగిలిన వాటి వెనుక నగలు, నాణేలు పంచాడు.

రెండంటే రెండు నిమిషాలని చెప్పి రావడం అయితే వచ్చాడు గాని, మూట మొత్తం ఖాళీ అవటానికి అరగంటకు పైగా సమయం పట్టింది. ఆఖరికి మిగిలిన వస్త్రాన్ని జెండా మాదిరిగా ఒక చెట్టుకు చుట్టబెట్టి చేతులు ఊపుకుంటూ పాక దగ్గరికి తిరిగి వచ్చాడు.

కూర్చున్న చోటునుంచి ఒక్క అంగుళం కూడా కదలలేదు షాడో. సిగరెట్ పొగను రింగులు రింగులుగా వదులుతూ ఏదో ఆలోచిస్తున్నాడు.

అతను పక్కకు తీసిపెట్టిన సొత్తును తన లాల్చీలో భద్రపరుచుకుంటూ ఇంకోసారి పెళ్ళి ఇంటి దగ్గరికి పోయాడు గంగారాం.

ఏడ్చిఏడ్చి, ఆ పైన ఓపిక నశించిపోయింది కాబోలు – తడికళ్ళను తుడుచుకుంటోంది పెళ్ళికూతురిని అతనికి పరిచయం చేసిన వృద్ధురాలు.

తన చర్యలను ఎవరూ గమనించకుండా, సైగ చేశాడు గంగారాం. ఇంటి వెనక్కి రమ్మని తల ఊపాడు.

విపరీతమైన ఆశ్చర్యం తాండవించింది ఆమె వదనంలో. చిన్నగా లేచింది... ఒంటరిగా బయలుదేరేందుకు ఓపిక లేనట్టు, తలవంచుకు కూర్చుని ఉన్న పెళ్ళికూతురును కూడా వెంటబెట్టుకుని ఇంటి వెనుక భాగంలోకి వచ్చింది.

'ఏమని నిర్ణయించబడింది మామ్మా?' మృదువుగా అడిగాడు గంగారాం.

'ఏమవుతుంది నాయనా? అడిగిన మొత్తం ఇచ్చుకోలేక పెళ్ళిని వద్దనుకుంటున్నందుకు నష్టపరిహారం ఇవ్వమని తీర్మానించబడింది. సపరివారంగా వచ్చిన పెళ్ళివారు తిరిగి వెళ్ళిపోయేందుకు, జరిగిన అవమానాన్ని మర్చిపోయేందుకు వెయ్యి యువాన్లు ఇచ్చుకోవాలట' ముక్కును ఎగబీలుస్తూ చెప్పింది ఆమె.

'నా మూలంగానే ఇన్నిబాధలు... నేను బతికి ఉండటం అనవసరం..' మరోసారి ఏడ్వటానికి సిద్ధపడుతూ గద్గద కంఠంతో అన్నది పెళ్ళికూతురు.

చేయిజాచి ఆమె తలను నిమిరాడు గంగారాం. 'ముక్కూమొహం తెలియని పరాయి మనుష్యుల ఆకలి తీర్చిన దేవతవి నువ్వు. అలాంటి మాటలు పొరపాటున కూడా మాట్లాడకూడదు' అన్నాడు.

'మాట్లాడకపోతే ఒరిగేది ఏమిటి? పెళ్ళికోసం కడుపులు కట్టుకుని దాచుకున్న డబ్బు మొత్తం పెళ్ళి జరగకుండా మాయం అయిపోతుంటే ఏం చేయాలి?' అడిగింది వృద్ధురాలు.

లాల్చీలో దాచిన కరెన్సీ కట్టల్ని బయటికి తీశాడు గంగారాం.

'ఈ తల్లి పెళ్ళి అంగరంగవైభవంగా జరగాలి. పెళ్ళివిందులో మీరు ఇచ్చే బియ్యపు సారాయిని తాగి నేను గంతులు వెయ్యాలి. వెళ్ళండి... తీసుకుపోయి వాళ్ళ ముఖాల మీద కొట్టండి' వృద్ధురాలి చేతిలో పెడుతూ చెప్పాడు.

తెరచిన నోరు తెరచినట్టే ఉండగా, వెనక్కితూలి వెల్లకిలా పడిపోయింది వృద్ధురాలు.

గబుక్కున ఆమెను పట్టుకుని, సజల నయనాలతో గంగారాం వైపు చూసింది పెళ్ళికూతురు.

'నవ్వాలి తల్లీ... పెళ్ళికూతుళ్ళు ఎప్పుడూ నవ్వుతూనే ఉండాలి' తను నవ్వి, ఆమెను నవ్విస్తూ అన్నాడు గంగారాం.

కింద పడకపోయినా, పడిపోయి బలమైన దెబ్బను తట్టుకున్నట్టు బేలగా చూస్తున్న వృద్ధురాలి చేతిని పట్టుకుని, వెనుక ద్వారంలో నుంచి ఇంట్లోకి తీసుకుపోయింది పెళ్ళికూతురు.

ఊపిరిబిగపట్టి వెయిట్ చేశాడు గంగారాం.

ఒకటి, రెండు, నాలుగు, పది నిమిషాల తర్వాత ఉన్నట్టుండి స్టార్ట్ అయింది కోలాహలం. చెవులు చిల్లులు పడిపోయేటట్లు మ్రోగటం ప్రారంభించాయి రెండు మద్దెల వంటి వాయిద్యాలు, గుండెలు జలదరించేటట్లు వినిపించసాగాయి షెహనాయ్ వంటి పరికరాలు.

కదలకుండా నిలబడి ఉన్న ఇంటి ముంగిట గుంపులో చలనం వచ్చింది. హడావుడి అధికం అయిపోయింది.

కడుపు నిండిపోయిన అనుభూతి కలిగింది గంగారాంకి. 'మాటవరసకి పెళ్ళితంతు ముగిసి బియ్యపు సారాయి పంచబడే వరకూ ఉంటామని చెప్పాను గాని, ఇక మనం ఇక్కడ ఉండవలసిన అవసరం లేదు. వెళ్ళిపోదాం గురూ' అన్నాడు షాడోని పైకి లేపుతూ.

సంతోషం వచ్చినా దుఃఖం వచ్చినా వాళ్ళని పట్టుకోవడం చాలా కష్టం. వెళ్ళిపోవటం అంత తేలిక కాదు' అన్నాడు షాడో.

పాక వెనుక ఉన్న కాలిబాటవైపు తిరిగి మూడు అడుగులు కూడా వేయకముందే వృద్ధురాలి వెనుకగా వచ్చేశాడు అక్కడికి ఒక మధ్యవయస్కుడు. వచ్చీరావటంతోనే ముఖం నేలకు ఆనుకునేటట్లు ముందుకు వంగి అభివాదం చేశాడు.

'ఆరిపోబోతున్న దీపంలో నూనె పోసినట్లు కష్టాల్లో మునిగి ఉక్కిరిబిక్కిరి అయిపోతున్న నన్ను ఉద్ధరించారు. మీరు మనుష్యులు కారు. మంగ్బూ దేవతలు..' అంటూ తను తీసుకువచ్చి కిందపెట్టిన రెండు పింగాణీ కూజాల్ని ముందుకు జాచాడు.

'బియ్యపు సారాయి పాత్రలు ఇవి. మంగ్బూ దేవతలకు బియ్యపు సారాయి అంటే మహా ఇష్టం' నవ్వుతూ చెప్పింది వృద్ధురాలు.

అంతకుముందు ఆమెకు నోట్ల కట్టలు ఇస్తూ తనకు ఆ పానీయాన్ని తాగి గంతులు వేయాలన్న కోరిక ఉన్నదని చెప్పింది గుర్తుకు వచ్చి, లోలోపలే తనను తాను నిందించుకున్నాడు గంగారాం.

చైనీయుల జానపద గాథల్లో హిందూ దేశపు కథల్లో ఉన్నట్టే రకరకాల సందర్భాలకు అనేక రకాల దేవతలు కనిపిస్తూ ఉంటారు.

ఎండనక వాననక రేయింబవళ్ళు కష్టపడి వ్యవసాయం చేసుకునే రైతుల్ని ఒక కంట కనిపెట్టుకుని ఉండే దేవతలు మంగ్బూ దేవతలు.

బియ్యపు కడుగుతో తయారుచేయబడిన సారాయి అంటే మహా ఇష్టం వారిద్దరికీ. దాన్ని నైవేద్యంగా సమర్పిస్తే చాలు, ఎటువంటి కోరికనయినా చిటికెలో తీర్చిపారేస్తారని ఒక నమ్మకం.

'మా తల బరువును దించి ఎంతో మేలుచే

శారు. కాస్తంత ఆ దుర్మార్గుడిని కూడా కనిపెట్టుకుని ఉండండి. తన రాయబారం వికటించినందుకు కొత్త కొత్త కష్టాల్ని తెచ్చిపెట్టకుండా కాపాడండి' ఇంకో కోరికను కోరుకుని, వృద్ధురాలితో సహా ఇంట్లోకి వెళ్ళి పోయాడు మధ్య వయస్కుడు.

'దుర్మార్గుడు అంటే ఆ దుకాణం యజమానే కదా' సారాయి కూజాని ఎత్తి గొంతులోకి వంపుకో బోతూ అడిగాడు గంగారాం.

వంపుకోబోయాడు. వంపుకోలేదు. ఉన్నట్టుండి మొదలయింది గ్రామంలో పెద్ద గందరగోళం.

'వాడి ఇనపపెట్టెని ఖాళీ చేసిన సంగతి బయటికి వచ్చేసి ఉంటుందా?" షాడోని చూస్తూ అడిగాడు.

సారాయి వాసన తగిలిన తర్వాత ఆగటం షాడోకి అలవాటు లేదు. నిర్మొహమాటంగా కూజాని ఎత్తి గొంతులోకి వంపుకున్నాడు.

తన కూజాని కిందపెట్టి, గబగబా పాకకి పది గజాల దూరం ముందుకు పోయాడు గంగారాం.

'డబ్బులు... డబ్బులు... నాణేలు... నాణేలు... బురద నేలల్లో కనిపించాల్సిన నిధులు మన గ్రామం లోనే కనిపించాయి. వెతకండి... ఇంకా ఎక్కువగా కనిపిస్తాయేమో వెతికి చూడండి' పెద్ద గొంతుకతో కేకలు పెడుతూ వీధిలో పరుగులు తీస్తున్న గ్రామస్థులు కనిపించారు.

ఉబికి రాబోయిన నవ్వును బలవంతంగా అదుముకుంటూ గిరుక్కున వెనక్కి తిరిగి, పాక దగ్గరికి వచ్చేశాడు అతను.

'బయటపడిందా నీ గుట్టు?' అడిగాడు షాడో.

'సగం మాత్రమే... అసలు గుట్టు అలాగే ఉంది. ఇప్పుడున్న పరిస్థితిలో దొరికినదంతా తనదే అని ఆ పెద్దమనిషి గగ్గోలు పెట్టినా ఎవరూ వినిపించుకోరు. బురద నేలల్లో ఉండే నిధులు ఇక్కడ కూడా ఉన్నట్టే అనుకుంటున్నారు' నవ్వుతూ అన్నాడు గంగారాం.

ఆ సమాధానం షాడోకి అమితంగా నచ్చుతుందని అనుకున్నాడు అతను. కాని, అతను తలను విదిలించేసరికి ఆశ్చర్యంగా చూశాడు.

'బురద నేలల్లో ఉందని అందరూ అనుకునే నిధి కోసం మనం తప్పకుండా వస్తామని ఎదురు చూస్తున్న ఫ్యుజీశాన్‌కి ఈ కబురు తెలిస్తే ఏమవుతుంది' అడిగాడు షాడో.

గాలి పోయిన బెలూన్ మాదిరి తయారైంది గంగారాం వదనం. 'నిజమే గురూ... అంతదూరం ఆలోచించలేదు. తప్పకుండా వచ్చేస్తాడు. సందేహం అనవసరం' అన్నాడు చిన్నకంఠంతో.

'నిధులు అంటే పాతకాలం నాటి సంపద. నువ్వు వదిలిపెట్టిన వాటిలో ఈనాటి కరెన్సీ నోట్లు ఉన్నాయి. దుకాణం యజమానికి వెంటనే తెలియక పోయినా ఇంకా కొద్దిసేపటిలో తెలిసి తీరుతుంది' అంటూ కూర్చున్న చోటునుంచి లేచాడు షాడో.

తనకు ఇవ్వబడిన సారాయి కూజాతో పాటు, అతను సగం ఖాళీ చేసిన దాన్ని కూడా పట్టుకున్నాడు గంగారాం.

సారాయి తాగేటప్పుడు నంజుకోవటానికి ఎర్రెర్రటి మాంసపు ముక్కల్ని పెద్దపాత్రలో పెట్టుకుని వచ్చింది వృద్ధురాలు, మరో అరగంట తరువాత.

## అందుకే ఛాన్సులు రావడం లేదట!



ఇటీవలి కాలంలో అవికాగోర్ గురించి చిన్న వార్త కూడా బయటకు రావడం లేదు. ఆమె గురించి దాదాపు అందరూ మరిచిపోయిన పరిస్థితి ఇక మీద ఆమె సినిమాలు చేయదు బుల్లితెరకే పరిమిత మవుతుందన్న వార్తలు కూడా వచ్చాయి. అవన్నీ అబద్ధాలే అంటున్నారు కొందరు. అవికా తెలుగులో చేసిన రెండు సినిమాలు మంచి విజయాన్ని అందుకున్నాయి. దాంతో ఏకంగా ఆరేడు సినిమాల్లో అవకాశాలు క్యూ కట్టాయట! సరిగ్గా ఇదే సమయంలో కొందరు సీనియర్ హీరోయిన్లు అవికా ఎదుగుదలను జీర్ణించుకోలేకపోయారు. తమకు తెలిసిన డైరెక్టర్లకు నేరుగా, ఇన్‌డైరెక్టుగా అవికాకు ఛాన్సులు ఇవ్వొద్దని చెప్పారట! ఒక వైపు సీనియర్ హీరోయిన్లు కత్తి కడితే మరొక వైపు టాలీవుడ్ యంగ్ హీరోతో అవికాకు గొడవ అయిందట! ఇక అతగాడు కూడా అవికా ఛాన్సులకు శకుని లాగా మారిపోయాడట! ఇవన్నీ చూసిన అవికా టాలీవుడ్ కన్నా బాలీవుడ్ బెటరనుకొని అక్కడ అవకాశాల కోసం ప్రయత్నిస్తోందట! టాలీవుడ్‌లో హీరోయిన్లందరం ఫ్రెండ్లీగా ఉంటాం అంటూ కొందరు హీరోయిన్లు తెగ గొప్పలు చెబుతుంటారు. మరి అవికాను వారు స్నేహితురాలిగా చూడలేదా? అన్న అనుమానాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.

గ్రామాన్ని వదిలి ఒక మైలు దూరం వెళ్ళిపోయారు వారిద్దరూ. ఆమెకు కనిపించలేదు.

***

'తనకు పాపాయి పుట్టిందని, క్షేమంగానే ఉన్నదని తెలిసిన క్షణం నుంచీ కుదురుగా కూర్చోవటం అసాధ్యం అయిపోయింది పోలీసుల దగ్గర బందీగా ఉన్న షాన్‌సూకి.

తనను క్వశ్చన్ చేయటానికి మిచిషీ మేడమ్ గనుక వస్తే ఒక్కటంటే ఒక్కసారి తనను బయటికి పంపించమని వేడుకునేందుకు సిద్ధంగా కూర్చుని వెయిట్ చేయటం మొదలుపెట్టాడు.

'మిచిషీ మేడమ్ ఇక ఇప్పుడు ఇక్కడికి రావటం జరగదు. బురద నేలల్లో తిరగటం వల్ల ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నదట. తన తల్లిగారితో కలిసి ఎక్కడికో వెళ్ళిపోయిందట' ఆ రోజు సాయంత్రం అతనికి తెలిసింది ఆ విషయం.

ఫుల్‌గా గాలికొట్టిన బెలూన్ ఒక్కసారిగా తుస్సుమన్నట్టు చిటికెలో అణిగిపోయింది షాన్‌సూ ఉత్సాహం.

'నాకు మాత్రమే తెలిసిన రహస్యాన్ని నా గుండెల్లో పెట్టుకుని దాచుకుంటూ వస్తున్నాను ఇప్పటి వరకూ. హుహుశాన్ నన్ను తన బిల్డింగ్‌లోనే బంధించి రకరకాల హింసలు పెట్టాడు. చెప్పలేదు. తన వల్ల కాని పనిని మీ పోలీసుల వల్ల అవుతుందని భావించి నన్ను మీకు అప్పగించాడు. అయినా నేను పెదవులు విప్పలేదు. కాని ఇక మీదట ఆ నిగ్రహం పాటించటం సాధ్యపడదని అనిపిస్తోంది...' తనలో తను అనుకుంటూ లాకప్ గది తలుపుల దగ్గర నిలుచున్నాడు అతను.

ఆ రాత్రికి అతను తీసుకోవాల్సిన ఆహారాన్ని ఒక ప్లాస్టిక్ ప్లేటులో పెట్టి గది ముందుకు వచ్చాడు ఒక కానిస్టేబుల్.

'తప్పుకో... తలుపులకు దూరంగా నిలబడు' అంటూ తను లోపలికి వచ్చాడు.

నాలుగు అంగల దూరంలో ఉంది షాన్‌సూ కూర్చోవటానికి పడుకోవటానికి ఏర్పాటుచేయబడిన చెక్క బల్ల. తను తీసుకువచ్చిన ప్లేటును ఆ బల్లమీద పెట్టాడు కానిస్టేబుల్.

అతనివంకా, బార్లా తెరచి ఉన్న తలుపుల వంకా చూశాడు షాన్‌సూ... ఒక్కసారిగా వచ్చేసింది అతనికి ఎక్కడ లేని తెగింపు.

ప్లాస్టిక్ ప్లేటును అతని బంక్ మీద పెట్టి వెనుతిరగబోతున్నాడు కానిస్టేబుల్. ఎగిరి అతని దగ్గర నేలను తాకాడు షాన్‌సూ. పిడికిలితో అతని మెడ మీద మోదాడు.

శరీరంలోని శక్తినంతా పిడికిట్లోకి తెచ్చుకుని కొట్టిన దెబ్బ అది. కళ్ళు బైర్లు కమ్మినట్లు అయింది కానిస్టేబుల్‌కి. తూలి ముందుకు పడిపోయాడు.

ఆ తరువాత ఒక్కసెకను కూడా ఆలస్యం చేయలేదు షాన్‌సూ. వేగంగా కదిలి లాకప్‌లో నుంచి బయటికి వచ్చాడు. పక్కలకు కూడా చూడకుండా సూటిగా ఆ బిల్డింగ్ ముందుభాగంలో ఉన్న రిసెప్షన్ ఏరియాలోకి పోయాడు.

'హేయ్... షాన్‌సూ... ఏంచేస్తున్నావ్.? బయటికి ఎలా వచ్చావ్?' ఆశ్చర్యంగా అడిగారు అక్కడ ఉన్న ఇద్దరు కానిస్టేబుల్స్.

గుండెల్లో రాయి పడినంత పని అయింది షాన్‌సూకి.

**(ఇంకా వుంది)**



ఎవరైనా ఎక్కువ ఊహించుకున్నా లేక జరగదని తెలిసి కూడా జరుగుతుందని వాదించినా వాళ్లని మనం పగటికలలు కనకు అంటాం. అంటే అతిగా ఊహిస్తూ గాల్లో మేడలు కడితే వచ్చేదేం లేదుకానీ, ఉన్నదికూడా పోతుందని పెద్దలు నీతి చెబుతారు. అయితే అదేపనిగా పగటి కలలు కంటే ఉన్నది కూడా పోవచ్చేమో గానీ, అప్పుడప్పుడు పగటికలలు కనడం మాత్రం మంచిదేనని మానసిక వైద్యులు చెబుతున్నారు.



# డే డ్రీమ్స్‌తో సక్సెస్

కలలు రావడం మామూలే. రోజూవారి చూసిన చిత్రాలే కొందరికి కలలుగా వస్తుంటాయి. కొంత మంది పగలుకూడా కలలు కంటారు. పగటిపూట నిద్ర ఆరోగ్యానికి మంచిది కాదని, లావైపోతారని, పగటికలలు కనకూడదని అవన్నీ ఊహలేనని, సాకారం కావని అంటుంటారు. నిజానికి పగటినిద్ర, పగటి కలలు ఆరోగ్యానికి ఎంతో మేలు చేస్తాయి.

## అవి భవిష్యత్తు ఆలోచనలే!

రామాయణంలో 'త్రిజట స్వప్నం' మనందరికీ తెలిసిందే. భవిష్యత్తు దృష్టిలో ఉంచుకుని వచ్చిన కల 'త్రిజటస్వప్నం'. కొన్నిసార్లు నిత్యజీవితంలో కలలు భవిష్యత్తును సూచిస్తాయి. ఉన్నపళంగా కోటీశ్వరులైపోయినట్లో, ఏదైనా సాధించినట్లో....ఇలా తమ స్థాయికి మించి ఏదో సాధించినట్లు పగటి కలలు కంటారు చాలామంది. అలాంటి కలల్ని ఎవరితోనైనా చెబితే, 'ఏరా పగటికలలు కంటున్నావా?' అని వెక్కిరిస్తారు. పైగా, 'పగటికలలు కంటూ విలువైన సమయం వృథా చేస్తూ సోమరిపోతులా ఉండిపోకు' అని ఓ ఉచితసలహా పారేస్తారు. కానీ 'పగటికలలు మంచివే' అంటున్నారు నేషనల్ అకాడమీ ఆఫ్ సైన్స్ వారు. వ్యక్తులు తాము సాధించాలనుకుంటున్న కోరికలు, ఆశలు, ఆశయాలను ఆలోచనల్లో నింపుకున్నప్పుడు మనసంతా వాటితోనే నిండిపోవడంవల్ల పగటికలలు కనడం ప్రారంభిస్తారంటున్నారు. మేలుకొని ఉండగానే తమకిష్టమైన వాటిని అద్భుతంగా ఊహించుకోవడమే పగటి కల అని విశ్లేషిస్తున్నారు కూడా. ఇలాంటి పగటి కలల్లో సాధారణంగా బాధతో కూడినవాటి కంటే సంతోషకరమైన సందర్భాలు, ఆశలు, ఆశయాలే ఎక్కువ.

## ఆరోగ్యం, ఆనందం

పగటికల, పగటినిద్ర ఆరోగ్యకరం అంటున్నారు క్లినికల్ సైకాలజిస్ట్‌లు. ఎక్కువ సృజనాత్మకశక్తి ఉన్న వారికే కలలు వస్తాయి. ముఖ్యంగా సంగీతం, నవలా రచన, దర్శకత్వం వంటి సృజనాత్మక వృత్తుల్లో రాణించడానికి పగటి కలలు ఎంతో ఉపయోగపడతాయి. సృజనాత్మకతకు ఊహాశక్తి అవసరం కదా! ఆ ఊహల్లోంచి అద్భుతసృష్టి జరుగుతుంది. కాబట్టే చాలామంది గొప్పగొప్ప కవులు, రచయితలు వాస్తవ ప్రపంచంతో సంబంధం లేనట్టు ఎప్పుడూ ఊహాలోకాల్లో ఉండడానికే ఇష్టపడతారు. పగటికలల వల్ల ఆరోగ్యంతోపాటు మానసిక ఆనందం కూడా కలుగుతుంది. ఎలా అంటే, మన చేతుల్లో ఇప్పటికిప్పుడు జరగనివాటిని ఊహించుకోవడం ద్వారా మానసిక ఆనందం పొందవచ్చు. తద్వారా భవిష్యత్తుపై ఆశలు చిగురిస్తాయి. అందుకే పగటికలలు కనని వాళ్ళకి వాటిలో మునిగి తేలమని సలహా కూడా ఇస్తున్నారు.

## పగటికలలకీ హద్దుంది

నిరాశ ఆవరించినప్పుడు, ఏదైనా బాధల్లో ఉన్నప్పుడు, ధైర్యం కోల్పోయినప్పుడు, మానసిక సంఘర్షణలు అతలాకుతలం చేస్తున్నప్పుడు, కోపంతో రగిలిపోతున్నప్పుడు వెంటనే ఇష్టమైన విషయం కోసం లేదా రేపటి భవిష్యత్తు కోసం, ఎవరికి ఎలా ఉండాలనిపిస్తే అలా, ఎవరికి నచ్చిన ఊహల్లోకి వాళ్ళు వెళ్ళిపోవాలి. కాసేపు అంటే ఓ పది, పదిహేను నిమిషాలు ఆ పగటికలల్లో విహరిస్తే చాలు అప్పటివరకు ఉన్న బాధ, నిరాశ పోయి ఆ స్థానంలో సంతోషం వచ్చి చేరుతుంది. అదెలా సాధ్యం? అనే సందేహం వద్దు. ఎన్నో అధ్యయనాలు చేసి మరీ ఈ విషయం చెబుతున్నారు నిపుణులు. నమ్మకం కలగాలంటే మీరూ పగటికలల్లోకి వెళ్ళాల్సిందే. అయితే ఇక్కడ ఓ విషయం చెప్పాలి. పగటి కలలు వాస్తవపరిస్థితులకు పూర్తిభిన్నంగా ఉండాలిగానీ, ఆ కలల్లోకూడా కష్టాలు, కన్నీళ్ళు నింపితే ఆనందం బదులు కష్టం రెండింతలవుతుంది. అలాకాకుండా ఏదో సాధించినట్లు లేదా ఆనందకరమైన విషయాల గురించి కలగంటే ఆ లక్ష్యం సాధించడానికి అవసరమైన మానసిక స్థైర్యం వస్తుంది.

## కలల కబుర్లు

- కలల గురించి అధ్యయనం చేసే శాస్త్రాన్ని 'ఒనేయిరాలజీ' అంటారు
- సృజనాత్మకత ఎక్కువగా ఉన్న వ్యక్తులకు కలలు బాగా వస్తాయి.
- కలల వ్యవధి ఎప్పుడూ ఒకేలా ఉండదు. కొన్ని కలలు సెకన్ల వ్యవధిలో ఉంటే మరికొన్ని 20, 30 నిమిషాలు ఉంటాయి.
- కలలను గుర్తుపెట్టుకోవడం సాధ్యమే. అయితే ఎక్కువసేపు వచ్చిన కలలు గుర్తుండవు.
- సగటున ఒక వ్యక్తి ఒక రోజులో మూడు నుంచి నాలుగు కలలు కంటాడు.
- అంధులు కూడా కలగంటారు. కానీ ఆ కలల్లో దృశ్యాలుండవు. సహజ శబ్దాలు మాత్రమే ఉంటాయి.
- మనిషి స్వప్న స్థితిలో ఉన్నప్పుడు కనుగుడ్లు వేగంగా కదులుతాయి.
- కలలను గుర్తుపెట్టుకునే శక్తి మగవారిలో కంటే మహిళల్లోనే ఎక్కువ.

## రకరకాల కలలు

**యానిమల్ డ్రీమ్స్:** కలలో జంతువులు కనిపిస్తాయి. ఇలాంటి కలలు అందరికీ రావు. జంతు ప్రేమికులకు, జంతువులు, పక్షులు, ఇతర జీవరాశులంటే భయం ఉన్నవారికే వస్తాయి.

**విజిటేషన్ డ్రీమ్స్:** ఏదైనా ఒకచోటికి వెళ్లడం. మనం నివసించే చోటుకు దూరంగా ఉన్నవారిని కలవడానికి వెళ్లినట్లుగా వచ్చే కలలను విజిటేషన్ డ్రీమ్స్ అంటారు. చాలారోజుల నుంచి వెళ్లాలనుకుంటున్న చోటుకు కలల ద్వారా వెళ్లడం ఒక మార్గం అని ఆధ్యాత్మికవేత్తల అభిప్రాయం.

**నైట్‌మేర్స్:** వీటినే పీడకలలంటారు. ఒక్కసారిగా ఉలికిపడి నిద్రలేచి, విపరీతంగా భయపెట్టేలా ఉంటాయి ఈ కలలు.

**ప్రొఫెటిక్ డ్రీమ్స్:** చాలామంది ఈరోజు కలలో దేవుడు కనిపించాడు అనడం వింటుంటాం. వీటినే ప్రొఫెటిక్ డ్రీమ్స్/ప్రవచిత కలలు అంటారు.

**ఇంటుయిటీవ్ డ్రీమ్స్:** సహజంగా వచ్చే కలలు ఇవి. రాత్రి వచ్చి తెల్లవారేలోపు మరిచిపోతాం. ఈ కలల్ని పెద్దగా పట్టించుకోం.

**లూసిడ్ డ్రీమ్స్:** ఏదైనా గొప్ప కార్యం సాధించడం, గొప్ప వ్యక్తులను కలిసినట్టు కల కంటే ఆ కలలు లూసిడ్ డ్రీమ్స్‌కి ఉదాహరణ.

**రిక్యూరింగ్ డ్రీమ్స్ :** ఒకే కల చాలాసార్లు పునరావృతమవుతూ ఉంటుంది. ఇవే రిక్యూరింగ్ డ్రీమ్స్. ఎవరో తరుముతున్నట్టు, బైక్ మీద నుంచి కింద పడ్డట్టు వచ్చే కలలివి. ఇందులోనే చేజింగ్ డ్రీమ్స్ ఉంటాయి. మిగతా కలలకు ఈ కలలకు తేడా ఏంటంటే మనకు మనం క్లియర్‌గా కనిపిస్తాం. కానీ మనల్ని తరుముతున్న వ్యక్తులు కనిపించరు.

అందులోనూ ఊహలకి హద్దేముంది? అలా హిమాలయాలదాకా వెళ్ళిరండి. లేదా రోడ్డుపై కారు నడపటానికి కూడా భయపడేవాళ్లు ఏకంగా విమానం నడిపేస్తున్నట్టు గాల్లో తేలిపోండి. సాధ్యాసాధ్యాల ప్రసక్తే లేదు. కానీ ఆ కలలకి కూడా హద్దు ఉంది. మరీ ఎక్కువసేపు కాకుండా చాలా తక్కువ సమయం నిద్రించి ఆ కలల్లో విహరించాలి.



### కలల్లో విహరించండి

పనులు మానుకునిమరీ పగటికలలు కనాలనేం లేదు. హాయిగా రాత్రి పడుకోబోయే ముందు కూడా అలా ఐదు నిమిషాలు ఊహాలోకంలోకి వెళ్తే చాలు. చక్కటి భావన కమ్మని నిద్రను ప్రసాదిస్తుంది. అయితే ఇక్కడ మరో విషయం కూడా ఉంది. కలలు కనమన్నాంకదా అని గంటలగ్గంటలు పగటి కలల్లో తేలిపోతే మరో ప్రమాదం కూడా ఉందంటున్నారు మానసిక నిపుణులు. ఇలా గంటలగ్గంటలు కలల్లో ఓలలాడటం ఒక మానసిక సమస్యగా పరిణమించే అవకాశం ఉందని హెచ్చరిస్తున్నారు. అంతేకాకుండా నచ్చిన విషయాలను, కావాలనుకుంటున్న వాటిని కలలోనైనా దక్కించుకోవడం మంచిదే అంటున్నారు. మరింకేం, వీలు చిక్కితే కమ్మటి కలల్లో విహరించండి.

### పీడకలలు వస్తున్నాయా?

హాయిగా పడుకోవాలనీ, నిద్రలో ఎలాంటి పీడకలలు రాకుండా తీపికలలు రావాలనీ ఎవరికుండదు చెప్పండి. కానీ కొన్నిసార్లు పీడకలలు కూడా వస్తుంటాయి. మన ఆలోచనా విధానాలు, చుట్టూ ఉన్న పరిస్థితులే పీడకలలకు కారణం అనుకునేరు, అవి మాత్రమేకాదట, మనం తీసుకునే ఆహారం కూడా బ్యాడ్ డ్రీమ్స్ రావడానికి కారణమవుతుందంటున్నారు నిపుణులు. అందుకే రాత్రి పడుకునే ముందు అలాంటి ఆహార పదార్థాలు తీసుకోకుండా ఉంటే మేలని చెబుతున్నారు. పడుకోవడానికి రెండుగంటలుముందే ఆహారం తీసుకోమని సూచిస్తున్నారు. మరి ఆ ఆహార పదార్థాలేంటో తెలుసుకోండి!



### కెఫిన్‌తో పీడకలలు!

చాక్లెట్ అంటే ఇష్టంలేనిదెవరికి. మూడీగా ఉన్న మనల్ని ఉత్తేజంగా మార్చే చాక్లెట్‌ను అందరూ ఇష్టపడుతుంటారు. అలాగే పడుకునే ముందు కూడా హాయిగా ఓ చాక్లెట్‌ని ఆస్వాదించి తీపికలలకు స్వాగతం పలుకుదామని చాలామంది అనుకుంటారు. కానీ చాక్లెట్‌లో కెఫిన్ పదార్థం చాలా అధికంగా ఉంటుంది. ఆ కెఫిన్ నిద్రను పాడు చేస్తుందన్న విషయం మర్చిపోతాం. ఆ మాటకొస్తే చాక్లెట్ మాత్రమే కాదు, కెఫిన్ అధికంగా ఉండే టీ, కాఫీ, కూల్‌డ్రింక్స్ లాంటి పదార్థాలన్నీ పీడకలలకు దారితీస్తాయి. అందుకే అలాంటివాటికి రాత్రిపూట ఎంత దూరంగా ఉంటే అంతమేలని నిపుణులు చెబుతున్నారు.



### మద్యం

రాత్రి ఓ ఫుల్‌బాటిల్ లాగించేసి హాయిగా పడుకుంటే ఎంచక్కా కుంభకర్ణుడిలా నిద్రపోవచ్చని అనుకుంటారు చాలామంది. కానీ మద్యం తాగడం వల్ల నిద్రపట్టదు సరికదా పీడకలలు రావడం ఖాయం. ఎందుకంటే మనం నిద్రపోయేటప్పుడు రెమ్ (REM Rapid Eye Movement) అనే దశ ఉంటుంది. ఈ దశలోనే ఎక్కువగా కలలు వస్తాయి. మోతాదు మించిన మద్యం ఈ దశని చెడగొడుతుందట. ఫలితంగా పీడకలలు తప్పవు.



### ఐస్‌క్రీం

చల్లచల్లగా వివిధ ఫ్లేవర్‌లలో దొరికే ఐస్‌క్రీం లంటే చాలామందికి ఇష్టం. కానీ చల్లటి ఐస్‌క్రీం మన బుర్రని వేడెక్కించేయగలదు. అందుకు కారణాలు లేకపోలేవు. ఐస్‌క్రీంని పాలతో చేస్తారు. వయసు పెరిగేకొద్దీ మనలో ఈ పాలపదార్థాలను జీర్ణం చేసుకునే సామర్థ్యం తగ్గిపోతుంటుంది. పైగా ఐస్‌క్రీంలో తీపి చాలా ఎక్కువ. అది మనలోని మెటబాలిజం (జీవక్రియలు) మీద ప్రభావం చూపిస్తుంది.



ఇక చల్లటి ఐస్‌క్రీంని ఒంటికి తగినట్లు వేడిగా మార్చుకునేందుకు కూడా శరీరం ఇబ్బంది పడుతుంది. వీటన్నింటి ఫలితం పీడకలలే!

–నివేదిత




"కుదిరితే పరుగెత్తు, లేకపోతే నడు, అదీ చేతకాకపోతే పాకుతూ పో. అంతేగానీ కదల కుండా ఉండిపోకు. సృష్టిలో చలనం ఉన్నదేదీ ఆగిపోకూడదు." —శ్రీశ్రీ

# ట్రెండ్ ఫాలో అయినవారే ట్రెండ్ సెట్టర్స్

మార్పు అనివార్యం. ప్రకృతిలో, ప్రాణకోటిలో నిరంతరమార్పు సహజం. లేకపోతే పరిణామక్రమం సాగదు.

ప్రతి మనిషీ ఇంటాబయటా 'ఉనికి'ని కోరుకుంటాడు. అంటే గుర్తింపు. ప్రతి వ్యక్తిలో ఉండే ప్రత్యేకత, టాలెంట్ వెలుగుచూడాలంటే కష్టపడాల్సిందే. అప్పుడే విజయం లభిస్తుంది. నిరాఘాటంగా కొనసాగే ఆ విజయమే ఉనికిని నిర్దేశిస్తుంది. అదే అసలైన విజయం.

### విజయం ఒక్కచోట ఆగిపోకూడదు

సైకిల్‌మీద ప్రపంచయాత్ర, స్పైడర్‌మ్యాన్‌లా ఆకాశహర్మ్యాలపై పాకెయ్యడం వంటి అసాధ్యాలు చేయడమే విజయం అనుకోవడం పొరబాటు. అలాంటివారు ఫ్లాష్‌న్యూస్‌లా మెరుస్తారంతే! గిన్నిస్ బుక్‌లో విజయం నమోదు చేసుకున్నాక, కొంతకాలం వార్తల్లో ఉండి తెరమరుగవుతారు. దాంతో వారి ఉనికి మసకబారుతుంది.

తర్వాత వాళ్ళ పేరు చెబితే, 'అవును అప్పుడెప్పుడో చేశారు కదా!' అని తెలిసినవాళ్ళు చెబితేనే తర్వాతి తరాలకు తెలుస్తుంది.

నీ విజయం రికార్డుల్లో నమోదైనాగానీ కొనసాగింపు లేకపోతే తెరమరుగవుతుంది.

విజయం ఒక్కసారితో ఆగిపోకూడదు.

విజయపు ఉనికి నిరంతరం కొనసాగాలంటే నిన్ను నువ్వు అప్‌డేట్ చేసుకోవాల్సిందే.

"ఎప్పుడైతే నేర్చుకోవడం ఆపేస్తాడో, అప్పుడే మనిషి వృద్ధుడైనట్టు." —వారెన్ బఫెట్

చాలామంది తమ ప్రతిభనంతా పెట్టుబడిపెట్టి కష్టపడి తొలి విజయం సాధిస్తారు. తర్వాత రిలాక్స్ మోడ్‌లోకెళ్ళిపోతారు. ఏదో చేద్దామనే ఆలోచనలతో కాలక్షేపం చేస్తూ వెనకబడతారు. కొన్నాళ్ళకి వారి మనుగడే కష్టమవుతుంది. ఇంకొన్నాళ్ళకి వాళ్ళెవరో, ఏం సాధించారో కూడా జనం మర్చిపోతారు.

విజయానికి కొనసాగింపు ఉన్నప్పుడే మన 'ఉనికి' నిరంతరమవుతుంది.

### విజయాన్ని కొనసాగించాలంటే...

ప్రముఖ తమిళ సినీదర్శకుడు శంకర్ తొలినాళ్ళలో నాటి ప్రసిద్ధ దర్శకుడు ఎస్.ఎ.చంద్రశేఖర్ వద్ద అసిస్టెంట్‌గా చేశాడు. తర్వాత సమకాలికుడైన యువదర్శకుడు పవిత్రన్ వద్ద చేరాడు. పవిత్రన్ సినిమాలు సక్సెస్. అతడు దర్శకత్వం వహించిన రెండోసినిమా శంకర్ ప్రతిభను ప్రతిబింబించింది. ఆ విజయంతో పవిత్రన్‌లో అహంకారం అంకురాలేసింది. పవిత్రన్‌తో సినిమా చేసేందుకు ఒక ప్రముఖ నిర్మాత ఆయన ఆఫీసుకు వెళ్ళాడు. ఆ సమయంలో ఓ పదేళ్ళ పిల్లాడితో షూలేసు కట్టించుకుంటూ కనిపించాడు పవిత్రన్. అంతే! ఆ నిర్మాత తిరిగెళ్ళిపోయి, పవిత్రన్‌కు అసోసియేట్‌గా ఉన్న శంకర్‌ని పిలిచి ఛాన్స్ ఇచ్చాడు. అలా 'జెంటిల్‌మేన్' సంచలన విజయం సాధించింది. తర్వాత నుంచి శంకర్ వరుస విజయాలు సొంతం చేసుకుంటూనే ఉన్నాడు.

ప్రతి సినిమాని తొలి సినిమాలా భావించి కష్టపడటం, తనని తాను అప్‌డేట్ చేసుకుంటూ మారుతున్న టెక్నాలజీ గురించి తెలుసుకోవడం వల్లనే మనదేశంలో ఏ దర్శకుడూ ముట్టుకోని సబ్జెక్ట్‌తో 'రోబో' సినిమా తెరకెక్కించి మెప్పించాడు శంకర్. ఈనాడు ఎవరైనా 'పవిత్రన్' పేరు చెబితే 'ఓ అతడా!' అని కష్టపడి గుర్తుచేసుకుంటారు.

అందువల్ల "తలపెట్టిన ఒక పనిని పట్టు వదలకుండా కొనసాగించడం, ఆసక్తి ఉన్న రంగంలో కృషి చెయ్యడం మంచిదే. కానీ విజయం సాధించడానికి ఇదొక్కటే చాలదు. సృజనాత్మకతకు ఎప్పటికప్పుడు మెరుగులు దిద్దుకోవాలి. నూతనత్వంతో స్నేహం చెయ్యగలిగిన వ్యక్తులే విజయానికి విలాసాలవుతారు.

### నైపుణ్యం ఉంటేనే!

ప్రభుత్వోద్యోగంలో ఒత్తిడి ఉండదు. సాఫ్ట్‌వేర్ రంగమంటే నిరంతర ఒత్తిడి, శ్రమతో కూడుకున్నవి. నిరంతరం నైపుణ్యం పెంచుకోవాలి. లేకపోతే ఈనాటి పోటీ ప్రపంచంలో నిలబడటం కష్టం.

నేడు ఉద్యోగుల్నీ కేటగిరీలవారీగా విభజించి, వారి పనితీరులను అంచనా వేస్తున్నాయి ప్రైవేటు సంస్థలు. ఉద్యోగులకు తెలియకుండానే ఎప్పటికప్పుడు వారి ట్రాక్‌షీట్ పరిశీలిస్తుంటారు. ప్రతీ



## హేట్సాఫ్ – ఎం.ఎస్.ధోనీ

అందరిలాగే ఎన్నో కష్టాలు పడి భారత క్రికెట్ జట్టులో చోటు దక్కించుకున్నాడు. మొదట్లో స్టైలిష్ హెయిర్‌తో, దూకుడైన ఆటతో క్రికెట్ అభిమానుల నుంచి నాటి పాకిస్థాన్ ప్రధాని ముషారఫ్ వరకు అందర్నీ ఆకర్షించాడు. ప్రతి బంతినీ బౌండరి దాటించే ప్రయత్నం చేస్తూ "ధనాధన్ ధోని" అయ్యాడు.

- కుంబ్లే విరమణతో అన్ని ఫార్మాట్లకు కెప్టెనై, అన్నీ తానై జట్టును ముందుకు నడిపించాడు. కెప్టెనయ్యాక బ్యాటింగ్ కన్నా జట్టు కూర్పు, వ్యూహరచనపైనే దృష్టిపెట్టి "గెలుపును ఒక అలవాటు"గా మార్చాడు.
- వికెట్ల వెనక కీపర్‌గా నిలబడి, బంతికి, బ్యాటుకి మధ్య జరిగే సున్నిత పోరాటానికి అనుగుణంగా జట్టును నడపటం ధోని విలక్షణ శైలి.
- అంతేకాదు, ప్రపంచంలో ఉన్న ప్రతి బ్యాట్స్‌మెన్, బౌలర్ బలాలు, బలహీనతలు అంచనా వెయ్యటం ధోని ప్లస్ పాయింట్. ఆటమీద పూర్తి అవగాహనతో 'వ్యూహరచన' చెయ్యడంలో సిద్ధహస్తుడు.
- గెలుపు, ఓటములకు అతీతంగా, ఆనందానికి, అసహనానికి లోనవ్వకుండా స్థితప్రజ్ఞుడిగా "మిస్టర్ కూల్‌గా" పేరు తెచ్చుకున్నాడు.
- భారత్ క్రికెట్ చరిత్రలో వికెట్ కీపింగ్, బ్యాటింగ్, బౌలింగ్, కెప్టెన్ విభాగాల్లో ఎంతోమంది దిగ్గజాలున్నారు. కానీ ఈ రంగాలన్నిటిలో విశిష్ఠ ప్రతిభగల వినూత్నవ్యక్తి "ధోని" మాత్రమే.
- 28 ఏళ్ళ సుదీర్ఘ వరల్డ్‌కప్ కలను సాకారం చేసిన రథసారథి ధోని. టి–20 వరల్డ్‌కప్, ఛాంపియన్స్ ట్రోఫీ, ఎన్నో ఐపియల్ ట్రోఫీలు ధోనీని వెతుక్కుంటూ వచ్చాయి. సుదీర్ఘకాలం సక్సెస్‌ఫుల్ కెప్టెన్‌గా కొనసాగింది కూడా ధోనీయే.
- ఏ రంగంలో, ఎంత ఉన్నతస్థానంలో ఉన్న వారైనా, ఎప్పుడు వైదొలగాలో వారికి తెలియాలి. అప్పుడే చరిత్రలోగానీ, సమాజంలోగానీ సమున్నతస్థానం, గౌరవం వారికి లభిస్తుంది. కెరీర్ ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడే అన్నిఫార్మాట్ల నుంచి తనకుతానే రిటైర్మెంట్ ప్రకటించిన పద్మశ్రీ మహేంద్రసింగ్ ధోనీ రైల్వే టికెట్ కలెక్టర్ స్థాయి నుంచి ఎదిగివచ్చిన ఉన్నత వ్యక్తి.

చిన్న విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, లోపాల్ని ఎత్తి చూపుతారు. మొదట గ్రీన్‌జోన్ నోటీస్ ఇస్తారు. తర్వాత పనితీరు సరిగా లేదని తెలియజేస్తారు. విడిగా పిలిచి అడ్వైజ్‌లిస్తారు, చర్చిస్తారు.

ఆ తర్వాత 'ఎల్లో నోటీసు' ఇచ్చి, మీరు డేంజర్ జోన్‌లో ఉన్నారని సందేశం ఇస్తారు. ఆ తర్వాత 'రెడ్ నోటీసు' ఇస్తారు. ఇది తీసుకుంటే ఉద్యోగానికి ఉద్వాసన పలకాల్సిందే.

అనుభవం ఉండి, అదే రంగంలో చాలా ఏళ్ళుగా పనిచేస్తూ కొత్తకొత్త విషయాలు నేర్చుకోవడం, టూల్స్ తెల్సుకోవడం, వాటిపై అవగాహన పెంచుకోవడంలో వెనుకబడిన ఎంతోమంది సీనియర్లు ఇలాగే ఉనికిని కోల్పోతున్నారు.

'మంచి అవుట్‌పుట్ ఇచ్చేవారు ఎంత జీతం తీసుకుంటున్నారన్నది సంస్థ చూడదు. చేసే పనిని ప్రేమిస్తూ, అప్‌డేట్ అయ్యేవారిని సంస్థ ఎప్పుడూ వదులుకోదు.'

ట్రెండ్ అనేది ప్రస్తుతం క్షణక్షణానికీ మారిపోతోంది. గతంలో సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో కంప్యూటర్‌కి సంబంధించిన పనులే ఉండేవి. ఇవ్వాళ మొబైల్ కూడా వాటిలో భాగమైపోయింది.

స్మార్ట్‌ఫోన్ ఉంటే చాలు, ప్రపంచం మన చేతుల్లో ఒదిగిపోతుంది. స్మార్ట్‌ఫోన్లు, సోషల్ మీడియా గురించి అవగాహన ఉన్న 'యువత' ఆలోచనలు చాలా ట్రెండీగా ఉంటున్నాయి. దానితో అవుట్‌పుట్ స్వరూపం మారిపోతోంది.

అందుకే కొత్త ఆలోచనలతో ముందుకొచ్చే యువతకోసం సాఫ్ట్‌వేర్ కంపెనీలు "క్యాంపస్ సెలక్షన్స్" పెడతాయి. అదే సమయంలో అప్‌డేట్ కాకుండా భారంగా మారినవారిని వదిలించుకుంటున్నాయి.

### వీళ్ళంతా..

మన ప్రతిభమీద మనకున్న నమ్మకాన్ని బట్టి మన 'సత్తా' మనకే తెలుస్తుంది. దానినిబట్టే ఎంచుకున్న పనిలో మనం మమేకమవుతాం. అలా మమేకమైనప్పుడే మనమేమిటో మనకు అవగతమవుతుంది. అలా తమనుతాము గుర్తించిన వాళ్ళే ప్రతిభకి సానబెడుతూ నిరంతర విజయాల్ని నమోదు చేసుకోగల్గుతారు.

తమ విజయాలకి శాశ్వత చిరునామాగా నిల్చిన వాళ్ళంతా తొలుత అపజయం చవిచూసిన వాళ్ళే.

* అబ్దుల్‌కలాం తొలినాళ్ళలో పైలట్ ఇంటర్వ్యూకు వెళ్ళి, తిరస్కారానికి గురయ్యారు.
* అమితాబ్ బచ్చన్ తొలినాళ్ళలో 'ఆకాశవాణి'లో ఉద్యోగం కోసం వెళ్ళి ఎంపిక కాలేకపోయారు.
* 'నీ నటన విదూషకుడిలా ఉంది' అని చార్లీ చాప్లిన్‌ని హాలీవుడ్ స్టూడియో తొలుత తిరస్కరించింది.



* ప్రముఖ బాస్కెట్‌బాల్ ఆటగాడు మైఖేల్ జోర్డాన్‌ను స్కూల్ రోజుల్లో బాస్కెట్ టీం నుంచి తొలగించారు.
* హ్యారీపోటర్ సిరీస్ సృష్టించిన సంచలన రచయిత్రి జె.కె. రౌలింగ్ నవలల్ని పబ్లిషర్లు 12 సార్లు తిరస్కరించారు.
* ప్రపంచ ప్రఖ్యాత కె.ఎఫ్.సి. అధినేత కల్నల్ శాండర్స్ దాదాపు వెయ్యిసార్లు పైగా తన చికెన్ రెసిపీ అమ్మకాలకోసం శ్రమించారు.
* 'రాకీ' చిత్రాలతో ఖ్యాతినొందిన ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు సిల్వెస్టర్ స్టాలోన్... తను రాసుకున్న 'రాకీ' చిత్రాల స్క్రిప్టు పట్టుకుని వందల సార్లు స్టూడియోల చుట్టూ తిరిగాడు.
* వెయ్యిమార్గాలు అన్వేషించి విఫలమైన తర్వాతే, థామస్ ఎడిసన్ విద్యుత్‌బల్బ్ కనిపెట్టి శాశ్వత విజేతగా నిలిచారు.
* ఆయన్ను ఆర్మీ నుంచి వెళ్ళగొట్టారు. వ్యాపారంలోనూ విఫలమయ్యాడు. ఎన్నికల్లో ఎనిమిదిసార్లు ఓడిపోయాడు. చివరికి అమెరికా అధ్యక్షుడుఅయ్యాడు. ఆయనే అబ్రహాం లింకన్.

అపజయాలు ఎదురైనాగానీ వీళ్ళంతా చరిత్ర సృష్టించేవరకూ ఓటమి నుంచి పాఠాలు నేర్చుకుంటూనే ఉన్నారు. తమ ప్రతిభని మెరుగుపరుచుకుంటూనే ఉన్నారు. అలా తమ ఉనికిని చిరస్మరణీయం చేసుకున్నారు.

ఆరంభంలో "నువ్వేంటి" అనేది విజయం కాదు. అనుకున్నది సాధించావా? లేదా? అన్నదే విజయం.

రజనీకాంత్ తొలుత బస్ కండక్టర్. ధోని రైల్వే టికెట్ కలెక్టర్. సచిన్ టెండూల్కర్ ఎనిమిదో తరగతి ఫెయిలయ్యాడు. అక్షయ్‌కుమార్ హోటల్లో వెయిటర్‌గా పని చేశాడు.

కాబట్టి, ఒక్కసారి అందిన విజయం నిరంతరం కొనసాగాలంటే, ఉనికి నిలబడాలంటే ప్రతిభకి పదును పెట్టాల్సిందే, ట్రెండు ఫాలో అవ్వాల్సిందే.

నవ్య

# కడుపుతీపి

## -రావాడ శ్యామల

**ఉదయం తొమ్మిదవుతోంది. పార్వతమ్మ ఇంట్లో పనులుచేస్తున్న ఆదెమ్మ, బయట నూతి గట్టుదగ్గర గిన్నెలు కడిగి, వాటిని వంటగదిలోకి తెచ్చింది. వాటిని స్టాండ్‌లో సర్దిపెట్టింది. డైనింగ్ టేబుల్‌మీద ఎంగిలి టీ కప్పులు తీసి సింక్‌లో కడిగి వాటిని షెల్ఫ్‌లో పెట్టింది. తర్వాత బయట నూతిగట్టు చుట్టూ శుభ్రంగా కడిగింది. అంతటితో ఆ పూట పనైపోయింది ఆదెమ్మకు.**

**"అమ్మగోరూ పనైపోనాదండీ, నానింటికెలతాను" ముఖానికి పట్టిన చెమటను కొంగుతో తుడుచుకుంటూ అంది ఆదెమ్మ.**

"ఒక్క నిమిషం ఉండవే, మీ అయ్యగారి పుట్టిన రోజు ఇవాళ. సేమ్యా చేశాను, తెస్తానుండు" లోపల నుండే అరిచింది పార్వతమ్మ.

ఆదెమ్మ ముఖం సంతోషంతో వెలిగిపోయింది. 'అందుకేనా, వంటగదిలో మంచి వాసన వస్తోంది' అనుకుంది మనసులో.

పార్వతమ్మ గిన్నెతో సేమ్యా తీసుకొని బయటకు వచ్చింది. ఎరుపురంగు పట్టుచీరలో ప్రసన్న వదనంతో ఉన్న పార్వతమ్మ అచ్చం లక్ష్మీదేవిలా కనిపించింది ఆదెమ్మ కళ్ళకు.

తనవంక చూసుకుందోసారి. ఎండలో వానలో పనిచేసే తనలో నాజూకుతనం ఎప్పుడో పోయింది. చిరుగుల నేతచీరలో ఒళ్ళంతా చెమటపట్టి తనకే చిరాగ్గా ఉంది. 'తప్పదు మరి, తన బతుకే అంత,' అనుకుంది.

"బయటికి ఎల్తున్నారామ్మా!" అడిగింది ఆదెమ్మ.

"అవునే... ఇదిగో నీ పని అయిపోతే కోవెలకి వెళదామని అనుకున్నాం" చేతికి సేమ్యా గిన్నె అందిస్తూ అంది.

"సరే, నానెలతాను అమ్మగోరూ" అంటూ వెను తిరిగింది.

"అదేంటే, అంత తొందరేం లేదుగానీ, ముందు తినేసివెళ్ళు" అంది.

"ఇంటికట్టుకు పోతానమ్మా! ఆడికి సేమ్యా అంటే ఇష్టం."

"ఎవడికే, నీ కొడుక్కా..." పార్వతమ్మ ముఖం అప్రసన్నంగా మారిపోయింది.

"ఈ వయసులో నిన్ను సుఖపెట్టాల్సినవాడు, నీ సంపాదనంతా లాక్కుంటున్నాడు. ఆ తాగుబోతు కొడుక్కి పెడతావా" అసహనంగా అంది.

ఆదెమ్మ ముఖం చిన్నబోయింది.

"ఎంతసెడ్డా, ఆడు నా కొడుకే గదమ్మా!" దీనంగా అంది.

"నీ ఇష్టమే. అసలు వాణ్ణికాదు, నిన్ననాలి. నీకు బుద్ధిలేదు. వాణ్ణి వెనకేసుకొస్తున్నావు" అంటూ పార్వతమ్మ విసవిసా లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళినవైపు చూస్తూ, ఆదెమ్మ తనలో తానే సణుక్కుంది. కొడుకుని ఎవరైనా తిడితే మనసు సివుక్కుమంటుంది. 'ఆయమ్మది పెట్టే సెయ్యి కనక తిట్టే హక్కుందని వల్లకుండిపోనాను' మనసులో అనుకుంటూ సేమ్యా గిన్నెమీద చీరకొంగు కప్పి ఇంటివైపు సాగిపోయింది. ఆమెతోపాటే ఆమె ఆలోచనలూ సాగిపోతున్నాయి.

'కొడుకు పొగరుబోతైనా, తాగుబోతైనా తల్లికి ఆడు కొడుకే. ఆయమ్మ అదృష్టం బాగుండబట్టీ, ఆళ్ళ ఇద్దరు కొడుకులు టౌన్‌లో పెద్ద ఉద్యోగాలు సేసి, ఆయమ్మని సక్కగా సూసుకుంతన్నారు. నా ఖర్మ ఇలా తగలడింది కనకనే, ఉన్న ఒక్కడూ పోరంబోకులాగా తిరిగి నా పేనాలు తోడేస్తున్నాడు. సన్నాసి ఎదవ.. ఆడికి గారాబం ఎక్కువ సేశా వంటారు అమ్మగోరు. నిజవేc గారాబం సేసినాను. పుట్టిన పిల్లలు పురిట్లోనే సచ్చిపోతా ఉంటే, నానెంత గుండెలవిసేలా ఏడిసినానో ఎవురికి తెల్సు. మావ ఎంత ధైర్నం సెప్పాడు. నలుగురు పిల్లలు పుట్టి సచ్చిపోనాక, అయిదో కాన్పులో ఆడు బతకాలని కదా... పురుడు పోసిన రవణమ్మకి బుట్టెడు తవుడిచ్చి తీసుకుంది. అందుకే కదా ఆడికి తవుడని పేరు పెట్టుకుంది. ఆడు బతికినాడు. అదే సాలు నాకు. అప్పుడు అలాగే నేను అనుకున్నానుగానీ, ఆడిలా కొరకరాని కొయ్యినాగవుతాడని అనుకోనేదురో దేవుడా..' మూగగా రోదించింది.

'ఆడికి పదిహేనో ఏడు సొరబడిందో లేదో మావ సచ్చిపోనాడు. మావ పోయినాకే ఈ కట్టాలు సుట్టుకున్నాయి. పిల్లాడికి నానంటే బయ్యెం పోయింది. సదువొగ్గేసీ జులాయి తిరుగుడు తిరిగే వోడు. నాలుగిళ్ళల్లో పనిసేసి ఆణ్ణి నాను పోషించబట్టి సరిపోనాదిగానీ, నేకపోతే ఏటి దిక్కు!. ఉన్న మాట సెప్పుకోవాల. అసలాయమ్మ బయ్యెం సెప్ప బట్టే కిందటేడు జూట్‌మిల్లీల పనికి సేరినాడు. ఆడికి నింపాదిగా అన్ని యసనాలు అబ్బేసినాయి. తాగి తందనాలాడి, ఏ రాతిరికో ఇంటికిరాడం, అప్పులు సేసీడం, నా కాణీపరకా లాగీసుకోడం రోజూ ఆడితో ఇయే తిప్పలు. ఒకోతూరి ఆణ్ణి సూస్తుంటే భయమేస్తాది.

నానేటి సేసేది దేవుడా! కొడుకు కావాలనుకున్నానుగానీ, ఇలాటి దొంగసచ్చినోడు పుట్టేసినాడు' మనసులోనే బాధపడింది. ఇల్లు రావడంతో ఆదెమ్మ ఆలోచన్లు ఆగిపోయాయి.

పార్వతమ్మ ఇంటికి నాలుగువాసాల అవతలే ఆదెమ్మ ఇల్లు. ఇల్లంటే పూరిల్లు. అక్కడంతా అలాంటివే పాతిక, ముప్పై దాకా గుడిసెలున్నాయి. అక్కడందరూ కూలీ నాలీ చేసుకునేవాళ్ళే. తలుపు దగ్గరకు వేసి ఉంది. కొడుకు ఇంట్లో లేడు. ఉదయం పన్లోకెల్లినప్పుడు పడుకునున్నాడు. రాత్రి మత్తు వదిలిపోతే, ఏ పదకొండుకో లేచి తయారై అన్నం తిని డ్యూటీకి ఎల్తాడు. అలాంటిది ఈ రోజు తొందరగా లేచాడు. ఏం బుద్ధి పుట్టిందో మానుభావుడికి, ఎక్కడికెళ్ళాడో? అనుకుంటూ సేమ్యా గిన్నె భద్రంగా కుదురుమీద పెట్టింది.

జీడిపప్పు, నెయ్యి, ఏలకులు వేసి చేసిన సేమ్యా మంచి వాసన వస్తోంది. ఆదెమ్మ నోట్లో నీళ్ళూరాయి. రుచి చూడాలనిపించింది. అయినా తమాయించుకుంది. 'ఆడికిది చాలా ఇష్టం' అనుకుని గిన్నెమీద మూతపెట్టి ఇంటిపనిలో పడింది.

నులకమంచంమీద దుప్పటి, బొంత తీసి మడతపెట్టి మంచాన్ని ఓ మూల నిలబెట్టి ఉంచింది. అందరిళ్ళూ శుభ్రం చేసొచ్చి, చివరగా తన ఇల్లు శుభ్రం చేసుకుంటుంది. చీపురు తీసి ఇల్లు ఊడ్చింది. బయిట గోలెం దగ్గర ముఖం కడుక్కుని వచ్చి, చల్ది అన్నంలో ఉల్లిపాయి నంజుకుని తింది.

తర్వాత పొయ్యి రాజేసి ఎసరు పెట్టింది. అన్నం ఉడుకుతుంటే కొడుకొచ్చాడు. అప్పటికే బాగా తాగి ఉన్నాడు. చింపిరి జుట్టుతో బనీను, లుంగీమీద ఉన్నాడు.

వాణ్ణలా చూడగానే పట్టరాని కోపం వచ్చింది

### బ్రాడీపేట పుట్టుక ఇదీ

1789లో ఈస్ట్ ఇండియా కంపెనీలో చేరి మన దేశానికి వచ్చాడు 'జేమ్స్‌బ్రాడీ'. రైటర్‌గా మద్రాసులో ఒక ఏడాది పనిచేశాడు. 1790 నుండి పబ్లిక్ అండ్ రెవెన్యూ విభాగాలలో అండర్ సెక్రటరీగా చేశాడు. మిలటరీబోర్డు కార్యనిర్వాహక అధికారిగా పదవీబాధ్యతలు స్వీకరించాడు. తర్వాత 1796లో గుంటూరు చేరుకుని, గ్యారిసన్ స్టోర్‌కీపర్ బాధ్యతలు చేపట్టాడు.




అప్పటికే, అంటే 1792 నుండి కనీవినీ ఎరుగని రీతిలో మనదేశంలో ఆరేళ్ళపాటు కరువురక్కసి విలయతాండవం చేసింది. బాధితులు కోకొల్లలుగా ఉండేవారు. స్టోర్‌కీపర్ హోదాలో సహాయంచేసి ఎందరినో ఆదుకున్నాడట జేమ్స్‌బ్రాడీ. అప్పట్లో గుంటూరు తాలూకా ఆఫీసు (లక్ష్మీపురానికి దక్షిణంగా)కు ఆనుకుని గ్యారిసన్ స్టోర్స్ ఉండేది. జేమ్స్‌బ్రాడీ పేరిట ఆ ప్రదేశాన్ని ఇప్పటికీ 'బ్రాడీపేట'గా పిలుస్తున్నారు.

సేకరణ: ఎన్. తారకరామారావు

**మీ అయ్యగారి పుట్టినరోజని సేమ్యా చేశాను, తిని వెళ్ళు అంటూ గిన్నెతో ఇచ్చింది ఆ ఇంటావిడ. కానీ ఈ పనిమనిషి మాత్రం సేమ్యా తినకుండా గిన్నెమీద కొంగుకప్పి ఇంటికి తీసుకెళ్ళబోయింది. ఆ ఇంటావిడ ముఖం అప్రసన్నంగా మారింది. తీసుకెళ్ళి ఆ తాగుబోతుకి పెడతావా, వీల్లేదు, ఇక్కడే తినెళ్ళు అంది. ఎంతసెడ్డా ఆడు నా కొడుకే కదమ్మా అందామె. ఆ తల్లి ఎంతో ప్రేమగా తీసుకెళ్ళిన సేమ్యాని కొడుకు తిన్నాడా?**

ఆదెమ్మకు.

"భాడకోవ్... తెల్లారిందిరా నీకు తాగడానికి..." అని తిట్టింది.

అదేం పట్టనట్టుగా, "ఏటే వండుతున్నావు" అడిగాడు కొడుకు.

కోపంతో జవాబివ్వలేదు.

"ఏటొండుతున్నావు... సెప్పవే..." గట్టిగా అరిచాడు.

"ఆc... అంటికాయ కూర..."

"ఛస్.... ఆ ఇటుక బెడ్డల కూరేటే, ఏ సేపలో, సికెనో వండు" ఆర్డరిచ్చాడు.

రోజూ నీసుకూర ఎలా వండుతాన్రా, అయినొ రేయ్, ఈయాల శనారం కదా, దున్నపోతునాగా ఎదిగావు, ఇయ్యాల నీసు తినొచ్చా"

"ఇదిగో, అమ్మగోరు సేమియా ఇచ్చారు, ఇది తిను నీ కిష్టం కదా" గిన్నెతో అందించింది.

"ఛూc నీయమ్మ, సేపలొండమంటే ముష్టి సేమియా ఇస్తావేంటే? సేమ్యా గిన్నెను గోడకేసి కొట్టాడు. అది చెల్లాచెదురై నేలమీద పడింది. కింద పడ్డ సేమ్యాని చూసి ఆదెమ్మ కోపంతో ఊగిపోయింది.

"గొల్లుగా, నీకేం పోయే కాలంరా! నాను తినకుండా నీకోసం దాసి తెత్తే నేలపాలు సేత్తావా?" అంటూ చెయ్యి ఎత్తింది. ఆ చేతిని గాల్లోనే గట్టిగా పట్టి విసురుగా తోసేశాడు.

ఆదెమ్మ శరీరం నిస్సారంగా అయిపోయింది.

"ఇదిగో, నువ్వొండకపోతే డబ్బులియ్యి, బయట తింటా" పొగరుగా అన్నాడు.

"నా కాడ డబ్బులెక్కడియిరా, అంతా నిన్నే అట్టుకుపోయావ్"

"సూడు, బాగా సూడు ఎక్కడెక్కడ దాచావో..."

"నేదురా, నీతోడు! నా కాడ పైసా నేదు" దీనంగా అంది.

అటు ఇటు చూస్తున్న వాడి కళ్ళు ఆదెమ్మ ముక్కుపుడక మీద పడ్డాయి. ఎర్రరాయి పొదిగిన బంగారు ముక్కుపుడకది.

"ఆ ముక్కులోది తీసియ్యి" విసురుగా అన్నాడు.

"ఒరేయ్, అన్ని వస్తువులు మాపీసావు. ఇక ఇదొక్కటే మిగిలిపోనాది. దీన్నీ మింగేత్తావా, నానిది ఇవ్వను" కరాఖండిగా చెప్పింది.

"ముసలి ముండవి, నీకెందుకే సోకులు. బేగి తీసియ్యి. నాకు తిక్క రేగించకు" విసుగ్గా అన్నాడు.

ఆదెమ్మ కళ్ళలో నీరు ఉప్పొంగింది.

"ఎన్నిసార్లు సెప్పానురా, ఇది కోడలొస్తే ఇయ్యడానికుంచానని. నా బాబు కదూ, ఈరోజుకి ఇలాగ తినీరా, రేపు సేపలు తెచ్చి వండుతా" కొడుకు






అనూ ఇమ్మాన్యుయేల్.... తొలి సినిమా 'మజ్ను'తో మంచి పేరు తెచ్చుకున్నా స్టార్ హీరోయిన్ అనిపించుకోలేకపోయింది. కానీ ఇప్పుడు మాత్రం స్టార్ హీరోలు ఆమెతో జత కట్టడానికి రెడీ అయిపోతున్నారు. పవన్ సినిమాలో సెకండ్ హీరోయిన్గా ఛాన్స్ రావడంతో అనూ జాతకమే మారిపోయింది అంటున్నారు సినీ జనాలు. వక్కంతం వంశీ దర్శకత్వంలో అల్లు అర్జున్ చేస్తున్న సినిమాలో అనూ హీరోయిన్. మాటల మాంత్రికుడు త్రివిక్రమ్ కూడా తన తరువాతి సినిమాలో అనూనే తీసుకోవాలని డిసైడ్ అయ్యాడని అంటున్నారు. ఇక పోతే జూనియర్ ఎన్టీఆర్ సినిమాలో కూడా అనూ పేరే వినిపిస్తోంది. ఇలా అందరూ ఒక్కసారిగా అనూకి ఫిదా అయిపోయి ఆమెకు అవకాశాల మీద అవకాశాలు ఇచ్చేస్తున్నారు. ఇదంతా అనూ నటన మీద నమ్మకమే అంటున్నారు ఆమె సన్నిహితులు.

మొండితనం చూసి బుజ్జగింపుగా అంది.

"ఏటే అమ్మా! కతలు సెపుతున్నావు. ముందా ముక్కులోదియ్యి. ముక్కుమీద చెయ్యేసి లాక్కోబోయాడు. ఆదెమ్మకు పట్టరాని కోపం వచ్చింది. తన మీద చెయ్యి వేయబోతున్న కొడుకుని ఒక్క తోపు తోసింది అంతే. వాడెళ్ళి అంత దూరంలో పడ్డాడు.

పడినవాడు తోక తొక్కిన తాచులా బుస్సున లేచొచ్చాడు.

"నీ యమ్మా! నన్నే తోసేత్తావా! నీ పని సెప్తానుండు" అని అటు ఇటు చూసి పొయ్యి దగ్గరున్న సీసాలో కిర్సనాయిలు తీసి, ఆదెమ్మ మీద జల్లేశాడు.

"ఒరే నీకేం పోయే కాలంరా, నన్ను సంపేత్తావా" అంది ఏడుస్తూ.

"అవునే, సావే ముండా, సావూ..." పొయ్యిలో కాలుతున్న కర్ర తీసి ఆమె మీదికి విసిరేశాడు. క్షణంలో ఆమె చీర అంటుకుంది. ఆదెమ్మ ఆర్తనాదాలు చేస్తూ బయటకు రాబోయింది. వాడు ఆమెని లోపలికి తోసేసి, బయట తలుపేసి పారిపోబోయాడు.

ఆదెమ్మ పెడబొబ్బలు విని చుట్టుపక్కల వాళ్ళు పరిగెత్తుకొస్తున్నారు. వాళ్ళని చూసిన తవుడు కంగారుపడ్డాడు. ఆళ్ళకి దొరికితే తన్ని, పోలీసులకి ఒప్పజెప్పడం ఖాయం' అని మనసులో అనుకుని, వెంటనే నాటకీయంగా "అమ్మా, ఎంతపని జేసినావే, తలుపుతియ్యే.." అని గడియ పెట్టిన తలుపుమీద దబదబా బాదుతూ దొంగ ఏడుపులతో అరుస్తున్నాడు.

అందరూ ఇంటిదగ్గరకొచ్చేసరికి ఎవరికీ కనిపించకుండా బయట గడియ తీసేశాడు.

అప్పటికే ఆదెమ్మ సగం కాలిపోయింది. ఆమె మీద నీళ్ళుజల్లి బయటకు తీసుకొచ్చారు. నల్లగా భయంకరంగా ఉంది ఆమె శరీరం. బయట తాడు మీద ఆరబెట్టిన పాతచీర తెచ్చి ఆమె మీద కప్పారెవరో. అంబులెన్స్కి ఫోన్ చేశాడొకాయన.

ఇదంతా చూస్తున్న తవుడి గుండె లబలబలాడుతోంది. 'కొంపదీసి ఇది బతికిపోతుందా ఏటి? పోలీసులకి కాని సెప్పీదు కదా...' మనసులో భయం పీకుతున్నా బయటకు మాత్రం "అమ్మా! ఎంతపని సేసినావే, నా కెవురే దిక్కు..." అని రాగాలు తీస్తున్నాడు.

ఆదెమ్మ నెమ్మదిగా కళ్ళు తెరచి కొడుకువైపు చూసింది.

అది చూసి వాడు ఉలికిపడ్డాడు. శరీరమంతా చెమటలు పట్టేశాయి.

'దీని జిమ్మడ... ఇదింకా బతికే ఉంది...' కసిగా అనుకున్నాడు.

కోవెల నుంచి వస్తున్న పార్వతమ్మ దంపతులు, ఆదెమ్మ ఇంటి ముందున్న జనాన్నిచూసి అక్కడకు వచ్చారు.

అందరూ అడుగుతున్నారు.

"ఆదెమ్మా, ఏటయిందో సెప్పు...సెప్పు..." అని.

"ఆదెమ్మా! నీ కొడుకే ఇలా సేసాడా సెప్పు..." ఎవరో ఒకాయన అడిగాడు తవుడు వంక అనుమానంగా చూస్తూ.

"నేదు బాబూ, నేదు, నానే సచ్చిపోదావని.... నాకు బతకాలని నేదు.." అతి కష్టంమీద నెమ్మదిగా ఆగి ఆగి ఒక్కొక్కమాటా చెప్పింది.

పార్వతమ్మ, ఆదెమ్మవైపు నమ్మశక్యం కానట్టు చూసింది.

గంట క్రితమే గలగలా మాట్లాడింది. "అమ్మగోరూ, రేపు పెద్దబాబు, కోడలు వస్తున్నారట కదమ్మా! గారెలకి పప్పు నానబోయిండి. రేపు నానొచ్చి రుబ్బేస్తాను. బాబుకి సున్నుండలు ఇష్టం కదమ్మా! మినువులు ఏయించి ఉంచండి. నాను సాయింత్రం వచ్చి ఇసిరి పిండి ఆడించేత్తాను" అనిచెప్పి కొడుక్కి సేమ్యా తీసుకెళ్ళి గంటకూడా కాలేదు. అంతలోనే ఆత్మహత్యా! ఆదెమ్మ అంత పిరికిది కాదు. కష్టాల్ని ధైర్యంతో ఎదుర్కొన్న ఆడది. అందరి తలలో నాలుకలా మెలుగుతూ, అందరి కష్టం పంచుకునే ఆదెమ్మ ఆత్మహత్య చేసుకుంటుందా? పార్వతమ్మకి నమ్మబుద్ధి కావడం లేదు.

'నిజం చెప్పవే' అన్నట్లు ఆదెమ్మ వంక తీక్షణంగా చూసింది. ఆమె చూపులోని భావం ఆదెమ్మకు అర్థమైంది.

"నానే...నానే..." కనుపాపలు, కనురెప్పలు కాలిపోయి భయంకరంగా కనిపిస్తున్న ఆదెమ్మ కళ్ళలో కన్నీరు జాలువారింది. పార్వతమ్మకు కష్టంమీద చేతులు జోడించింది.

ఆమె చెప్పాలనుకున్నది పార్వతమ్మకు అర్థమైపోయింది.

"కొవ్వొత్తిలా కరిగిపోతూ, వెలుగునిచ్చావనుకుంటున్నావే! కానీ నీ త్యాగం ఈ దుర్మార్గుణ్ణి మారుస్తుందా ఆదెమ్మా! నీ కడుపుతీపి ఈ కసాయి వాడికి అర్థమవుతుందా?" పార్వతమ్మ కళ్ళల్లోని ఆవేదన కన్నీటి రూపంలో బైటికొచ్చింది.

ఆమె ప్రశ్నకు జవాబు చెప్పలేని ఆదెమ్మ మౌనంగా తల వాల్చేసింది.

"అమ్మా! అని ఆదెమ్మ ముఖంమీద పడి ఏడుస్తూ ముక్కుకున్న ముక్కుపుడకను పుటుక్కున లాగేశాడు తవుడు.

సగం కాలిన శరీరం నుంచి చాలా సునాయాసంగా వాడి చేతికొచ్చింది ఆ ముక్కుపుడక.

*సెల్: 9494329652*



# హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో
## 'అటోపిక్ డెర్మటైటిస్' సమస్యకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్నేషనల్



ప్రస్తుతం అభివృద్ధి చెందిన దేశాలలో మరియు పట్టణ ప్రాంతాలలో నివసించే వారిలో ఎక్కువ శాతం కనిపించే చర్మ సమస్య ఎగ్జిమా. ఈ ఎగ్జిమాలో ఎన్నో రకాలు ఉన్నప్పటికీ, వాటిలో సర్వసాధారణంగా ఎక్కువ మందిని వేధించే వ్యాధి అటోపిక్ డెర్మటైటిస్. ఇది ఏ వయస్సు వారిలోనైనా ఏర్పడుతుంది. ఇది ముఖ్యంగా శిశువులలో 65% వరకు మరియు 5 సం॥ల వయస్సులోపు చిన్నపిల్లలలో 85% వరకు కనిపిస్తుంది. కొంతమందిలో కేవలం చిన్న వయస్సు వరకే పరిమితమయ్యే ఈ సమస్య మరికొందరిలో జీవితకాలం కొనసాగుతుంది. పొడి చర్మం గలవారిలో మరియు చల్లని వాతావరణం ఉన్న సమయాలలో ఇది మరింత ఎక్కువగా కనిపించే అవకాశం ఉంటుంది.



'అటోపిక్ డెర్మటైటిస్' అనేది దీర్ఘకాలికంగా కొనసాగే చర్మ సమస్య. ఇది తలెత్తిన వారిలో చర్మంపై వెలుపలి పొరలు శోథమునకు గురి అయి ఎర్రబడటం, దురద పెట్టటం, వాపుతో కూడిన పొక్కులు ఏర్పడి - నీటి బుడగల వలె మారి రసికారడం, తదుపరి మచ్చలా ఏర్పడటం జరుగుతుంది. శరీరంలో ఎక్కడైనా ఏర్పడే ఈ వ్యాధి లక్షణాలు - ఎక్కువగా మోకాలు వెనుక భాగం, మోచేయి, మణికట్టు మడతలలో, మెడపైన, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తాయి.

**కారణాలు:** 'అటోపిక్ డెర్మటైటిస్'కు గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ శరీర రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడంతో డెర్మటైటిస్ లక్షణాలు ఏర్పడతాయి. ఇంతే కాకుండా-ఉబ్బసం, తీవ్రజ్వరం మొదలగు సమస్యలను ఎదుర్కొనే వ్యక్తిగత చరిత్ర కలిగి ఉండటం మరియు శ్వాస సంబంధిత అలర్జీ తలెత్తడం, కొన్ని రకాల అలర్జీలను కలిగించే ఆహార పదార్థాలను తినడం, రోగనిరోధక శక్తి తక్కువగా ఉండటం మరియు కుటుంబ చరిత్ర కలిగి ఉండటం వంటి కారణాల వలన ఈ 'అటోపిక్ డెర్మటైటిస్' సమస్య ఎక్కువగా ఏర్పడుతుంది.

**ప్రేరేపితాలు:** ముఖ్యంగా పొడి చర్మం ఉన్నవారిలో ఈ వ్యాధి ఎక్కువగా కలుగుతుంది. దుమ్ము-ధూళి, పుప్పొడి రేణువులు, జంతు కేశాలు, సబ్బులు, డిటర్జెంట్‌లు, షాంపూలు, కొన్ని ఆహార పదార్థాలు (ఉదా:- పాలు, గుడ్లు, సోయా), కొన్ని రసాయనాలు, సౌందర్య సాధన సామాగ్రి, వాతావరణ మార్పులు, ఉన్ని వస్త్రాలు, కొన్ని రకాల బ్యాక్టీరియా ఇన్‌ఫెక్షన్‌ల వలన మరియు మానసిక ఒత్తిడి వలన కూడా ఈ వ్యాధి ప్రేరేపించబడుతుంది.

**లక్షణాలు:** ఈ వ్యాధి వలన కలిగే లక్షణాలు ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి వేరుగా ఉంటాయి. ఈ వ్యాధిలో కనిపించే ముఖ్య లక్షణం దురద. ఆ తరువాత చర్మం ఎర్రగా మారి - వాపుతో కూడిన పొక్కులు ఏర్పడతాయి. క్రమేణా ఇవి నీటి బుడగలుగా మారి, వాటి నుండి రసి కారడం, కొంత కాలానికి చర్మం దళసరిగా మరియు నల్లగా మారిపోవడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. • చర్మంపై ఎక్కడైనా ఏర్పడే ఈ వ్యాధి ఎక్కువగా ముఖంపై కనబడటంతో పాటు, తలలో, మోకాలు వెనుక భాగంలో, మెడపైన, మోచేయి భాగంలో, మణికట్టు చర్మపు మడతలలో, చెవి వెనుక భాగంలో, కాలి మడమలు మరియు పాదాలపై కనిపిస్తుంది. ఇది శిశువులలో మొదట బుగ్గలపై దద్దుర్లుగా కనిపిస్తుంది. కొన్ని నెలలకు ఈ దద్దుర్లు, చేతులు-కాళ్ళతో పాటు ఇతర శరీర భాగాలకు కూడా వ్యాపిస్తాయి. 80% వరకు ఈ వ్యాధితో బాధపడే చిన్నపిల్లలు - హే ఫీవర్ లేదా ఆస్థమాకు గురయ్యే అవకాశం ఉంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలతో బాటుగా కుటుంబ ఆరోగ్య చరిత్ర మరియు వ్యక్తిగత ఆరోగ్య చరిత్ర - ఈ రెండింటినీ క్షుణ్ణంగా తెలుసుకుని ఈ వ్యాధిని నిర్ధారిస్తారు. బాహ్యపరీక్ష, అవసరమైతే రక్తపరీక్ష (ఈ వ్యాధి ఉన్నవారిలో తెల్లరక్తకణాలు (Eosinophils) మరియు సీరమ్ IgE స్థాయిలు ఎక్కువగా ఉంటాయి) మరియు కొన్ని సందర్భాలలో చర్మపు మచ్చల నిర్ధారణకై బయాప్సీ చేయించవలసి ఉంటుంది.

**హోమియోకేర్ ఇంటర్నేషనల్ వైద్యం:** కాన్స్టిట్యూషనల్ హోమియోపతిలో భాగంగా సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, రోగి శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా 'అటోపిక్ డెర్మటైటిస్'ను పూర్తిగా నయం చేస్తారు. ఈ పద్ధతిలో ఉబ్బసం - డెర్మటైటిస్ బాధితులకు, మొదటగా ఉబ్బసం, అనంతరం డెర్మటైటిస్ తగ్గుతుంది. ఈ విధంగా శరీర అంతర్గత అవయవాలు మొదలుకొని, బాహ్య అవయవాల వైపుకు వ్యాధి నివారణ ప్రక్రియ కొనసాగుతుంది. కేవలం హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్యరీతిలో వ్యాధిరీత్యా - రోగి శరీర నిర్మాణం మరియు రోగి వ్యక్తిగత, మానసిక లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించబడే చికిత్సతో ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.



15

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**నేనింకా కళ్ళు తెరవనే లేదు కానీ తేలికపాటి పొగడపూల వాసన నా ముక్కు పుటాలను తాకింది. నేను దిగ్గున లేచి కూర్చున్నాను. నేను నా హోటల్ రూములోనే, మంచంపై ఉన్నాను. నా మంచం చుట్టూ మూగి ఉన్న మనుషులను చూశాను. నా బాస్ రాజీవ్, వనజ ఒకవైపు ఉంటే, సాక్షి మరొక పక్కన నిలబడి ఆందోళనగా చూస్తున్నారు.**

నా కోటు తీసేసి ఉంది. షర్టు గుండీలు విప్పి ఉన్నాయి.

తలంతా దిమ్ముగా ఉంది.

మనసంతా మలినంలో దొర్లిన పశువులా అయింది.

నా బాస్ నా దగ్గరకొచ్చి, నా భుజం మీద చెయ్యేసి,

"వాట్ హ్యాపెండ్ మేన్?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

నేను అతని వైపు చూశాను. కానీ, నా చూపులు అతనిమీద నిలవడంలేదు.

'అవును ఏమైంది? ఏమైందని ప్రశ్నిస్తే ఏమని చెప్పగలను?'

'అందమైన పూదోట లాంటి నా జీవితాన్ని, అడవి పందిలా కుమ్మేసి, నాశనం చేసిన ఓ దుష్టుణ్ణి చూశానని చెప్పనా?'

నా జీవితంలో జరిగిన అత్యంత దీనమైన జ్ఞాపకాలను ఒక్కొక్క మరుపు పొరను పేర్చుకుంటూ సమాధి చేసి కొత్త జీవితంలోకి అడుగుపెట్టాలని చేస్తున్న ప్రయత్నం మొగ్గలోనే తుంచేశాడని చెప్పనా?

సాక్షి వంటి ఒక అత్యంత ప్రీతిపాత్రమైన స్త్రీ సాంగత్యంలో జీవితాన్ని గడపాలని కోరుకుంటున్న క్షణంలోనే పిడుగుపాటు లాంటి జ్ఞాపకం నా మనో ఫలకం మీద పడి, దాన్ని ఛిన్నాభిన్నం చేసిందని చెప్పనా?

ఇన్నాళ్ళుగా నేను కఠోర శ్రమతో, యోగాతో నా మనసును నేను వశపరచుకున్నాననీ, ఎటువంటి ఘోర విపత్తునైనా తట్టుకునే శక్తిని సంపాదించాననీ విర్రవీగే నాకు, రామస్వామిని చూడగానే స్పృహ తప్పడంతో, శృంగభంగం జరిగిందని చెప్పనా?

అవేవీ చెప్పలేను. నేనొక ఇంట్రావర్ట్‌ను. నాలోని దుఃఖాన్ని అంతంత మాత్రం స్నేహం ఉన్న పరిచయస్తులతో పంచుకోలేను.

అందుకే, షర్టు గుండీలు పెట్టుకుంటూ,

"ఏం లేదు, బాగా అలసిపోయాను కదా! ఎగ్జాస్ట్ కావడం వల్ల కొంచెం తల తిరిగింది. ఐయాం ఆల్‌రైట్ నౌ. నేను బాగున్నాను ఇప్పుడు." అన్నాను కళ్ళు దించుకునే.

కళ్ళు ఎత్తి చూస్తే ఆ నీచుడు, నా రాగిణిని హత్య చేయించిన నరరూప రాక్షసుడు కనిపిస్తాడేమోనని భయమేసింది.

వాడిని ఎలా డీల్ చేయాలో ఒక స్ట్రాటజీ, ఒక వ్యూహం మెదడులో ఇప్పుడిప్పుడే రూపు దిద్దుకుంటోంది.

రాగిణిని చంపించిన వారిలో ఒకడు ఎంత క్రూరంగా చచ్చాడో నాకు తెలుసు. వాణ్ణి నాశనం చేయడం కోసం నేను నా ఐపీయస్ కెరీర్‌నే పణంగా పెట్టాను. అప్పుడు ఈ రామస్వామిగాడు జర్మనీలో కూతురు దగ్గర దాక్కున్నాడు కాబట్టి బతికిపోయాడు.

మరి అంతా తెలిసిన వీడు, నేనొస్తున్నానని తెలిసి కూడా, ఈరోజు పార్టీకి రావడంలోని ఆంతర్యం నాకు తట్టడం లేదు? నేను నేనేనా అని తెలుసుకోవడానికి వచ్చాడా? లేక నన్ను శరణు వేడుకోవడానికి వచ్చాడా?

అందుకే, అనూహ్యంగా ప్రత్యక్షమైన వాడిని చూడాలంటే మాత్రం ఒంట్లో నుంచి వణుకు పుట్టుకొస్తోంది.

ఒకవైపు వణుకు పుడుతున్నా మరొకవైపు రాగిణి అనుభవించిన నరకయాతనను తలచుకుని వాణ్ణి ముక్కలు ముక్కలుగా నరికేయాలన్నంత కసి కలుగుతోంది.

అందుకే ఎంతో నియమ నిష్ఠలతో, యోగాభ్యాసంతో, మెడిటేషన్‌తో శిలాసదృశంగా మార్చుకున్న నా మనసు రామస్వామి గాణ్ణి చూడగానే ఒక్కసారిగా, కఠినమైన కొబ్బరి చిప్ప సైతం బలమైన రాతి దెబ్బకు పగిలిపోయినట్టుగా వేయి వ్రక్కలైంది.

ఇంతలో డాక్టరు వచ్చి, నన్ను పరీక్షించి, నాకేం కాలేదని, తీవ్రమైన ఆందోళన, అలసటకు గురైనందు



## జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పనిచేసే ఆ అధికారి, మాకనూరు బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. పార్టీలో, రామస్వామిని చూసి, గత స్మృతులలోకి జారుకుంటాడు. కష్టపడి బ్యాంకులో ఉద్యోగం సంపాదిస్తాడతను. రాగిణితో సాన్నిహిత్యం పెరిగి, ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. ఓ ప్రాజెక్ట్ లోన్ విషయంలో ఎంపీ బాలగోపాల్‌తో గొడవ పడతాడతను. దాంతో యంపీ, రామస్వామితో కలిసి రాగిణిని హత్య చేయిస్తాడు. రాగిణి చనిపోయిందన్న విషయం మనసులో అల్లకల్లోలం రేపుతుండగా, గత స్మృతులలోంచి బయటపడి స్పృహలోకి వస్తాడతను. **ఆ తర్వాత...**

వల్ల స్పృహ తప్పిందని చెప్పాడు. మళ్లీ విటమిన్ టాబ్లెట్లు రెండు నాతో మింగించి అవసరమైతే, పొద్దున్నే మరో రెండు వేసుకోమని ఇచ్చి వెళ్ళిపోయాడు.

అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

నేను వనజని దగ్గరగా పిలిచి, ఆమె చెవిలో రహస్యంగా,

"వనజా! ప్లీజ్ గెట్ మీ ఔటాఫ్ హైదరాబాద్ ASAP (As soon as possible). నేను హైదరాబాదులో ఒక్క క్షణం కూడా ఉండలేను. మామూలు ఫ్లైటులో టికెట్ దొరక్కపోతే చార్టెడ్ విమానమైనా సరే బుక్ చెయ్! కానీ, హైదరాబాదులో మాత్రం నేనీ రాత్రి గడపలేను, ప్లీజ్!" అన్నాను.

వనజ "ఓకే బాస్" అని హడావుడిగా బయటకు పరిగెత్తింది. రాజీవ్ నా వంక ఆశ్చర్యంగా చూస్తూ వనజ వెంట బయటకు నడిచాడు.

ఈ జరిగే తతంగాన్నంతా సాక్షి దూరం నుంచే మౌనంగా, నా వంకే దీనంగా చూస్తూ నిలబడింది.

సాక్షిని దగ్గరకు రమ్మని పిలిచాను.

కానీ, రూము నిండా బ్యాంకు ఉద్యోగులు, హోటల్ సిబ్బంది నిలబడి ఉన్నారు. దాంతో సాక్షి నా దగ్గరికి రావడానికి ఇబ్బంది పడింది.

"థాంక్స్ ఫ్రెండ్స్! నాక్కొంచెం అలసటగా ఉంది. నేను ఇప్పుడు బాగానే ఉన్నాను. కానీ, కొంచెం సేపు రెస్ట్ తీసుకుంటాను. సో....." అని నమస్కరిస్తూ వాళ్ళను ఇక వెళ్ళమన్నట్టుగా సూచించాను.

ఒక్కొక్కరుగా అందరూ వెళ్ళిపోయారు.

హెడ్డాఫీసు నుండి వచ్చిన జనరల్ మేనేజర్ ముందు అంతగా నన్ను పొగిడిన జోనల్ మేనేజర్ కానీ, 'మాకనూరు' బ్రాంచి మేనేజరుగానీ నన్ను పరామర్శించడానికి నా రూముకు రాలేదు.

నాకు తెలుసు, మృగ్యమవుతున్న మానవ విలువలకు ఈ బ్యాంకు యాజమాన్యం పక్కా నిదర్శనం. వాళ్ళు పార్టీ ఎంజాయ్ చేయడంలో మునిగిపోయారు. నా వాళ్ళనుకున్న వాళ్ళు మాత్రమే, నా వెంట రూముకొచ్చారు.

అందరూ వెళ్ళగానే, సాక్షి నా దగ్గరకు వచ్చింది.

నేను ఆమె వైపు చూశాను. ఆమె కళ్ళు వర్షించడానికి సిద్ధంగా ఉన్న క్యుములోనింబస్ మేఘాల్లా దుఃఖంతో ఘనీభవించి ఉన్నాయి. నేను ఆమె భుజాలమీద చెయ్యి వేసి నా మంచం మీద కూర్చోబెట్టాను. అంత చనువు గానీ, ధైర్యం గానీ నాకెలా వచ్చిందో నాకే అర్థం కాలేదు.

పార్టీ కోసం కట్టుకున్న పచ్చ చీర నలిగిపోయింది. ముఖం వడలిపోయింది. రెండు మూడు వెంట్రుకలు కట్టు తప్పి ఆమె ముఖం మీద జీరాడుతున్నాయి. నేను వాటిని సవరిస్తూ,

"సాక్షీ! ఈ సాయంత్రం నువ్వు నా జీవితంలోకి ఒక అందమైన అద్భుతంలా ప్రవేశించావు. నా దురదృష్టమేమిటో గానీ మాయమైందనుకున్న నా భయంకరమైన గతం అదే క్షణంలో ఒక దుర్మార్గుడి రూపంలో నీ వెనుకే ప్రత్యక్షమైంది. నిన్ను చూసినప్పుడు కలిగిన అవధులు లేని ఆనందాన్నీ, వాణ్ణి చూసినప్పుడు కలిగిన అంతులేని దుఃఖాన్నీ, నేను ఒకేసారి తట్టుకోలేకపోయాను. అందుకే స్పృహ తప్పాను." అంటూ ఆమె వైపు ఆర్తిగా చూశాను.

అటువంటి పరిస్థితిలో ఏం మాట్లాడాలో తెలియని అయోమయస్థితిలో ఉన్నట్టుగా తలూపింది.

"సాక్షీ! ఇది సమయం కాదు. సందర్భం అసలే కాదు. ఇంత తక్కువ సమయంలో నేను ఈ మాట చెప్పడం కూడా తప్పే. కానీ ఇప్పుడు చెప్పకపోతే మళ్ళీ ఆ అవకాశం ఎప్పుడొస్తుందో తెలియదు. నేను బెంగుళూరు వెళ్తున్నాను. వనజ, నా సెక్రటరీ ఫ్లైట్ అరేంజ్‌మెంట్స్ చూడడానికి వెళ్ళింది. ఛార్టర్డ్ ఫ్లైట్‌లోనైనా సరే నేను ఈ హైదరాబాద్ నగరాన్ని ఇప్పుడే వదిలి వెళ్ళాలి. అందుకే చెప్తున్నాను. సాక్షీ! ఐ లవ్ యూ!" అన్నాను.

ఆ మాట వినగానే నన్ను ఆనుకుని మంచం మీద కూర్చున్న సాక్షి లేచి దూరంగా నిలబడింది.

నేను ఆమెను చూస్తూ,

"అవును సాక్షీ! నేను నిన్ను చూడగానే, నా చేతుల్లోని బొకేను నువ్వు అందుకోవడానికి వచ్చిన మరుక్షణం నుండే, రాగిణి తర్వాత, నన్ను ఇంతగా సూదంటు రాయిలా ఆకర్షించింది నువ్వే."

నేను ఒక్క క్షణం మౌనం వహించాను.

నేనింత వరకూ రాగిణి గురించి ఎవ్వరికీ చెప్పలేదు. నా రాగిణి చనిపోయిందని ఎవరికైనా చెప్పాలంటే నాకు నోటమాట రాదు. ఆ విషాద బడబాగ్నిలో నేనే హాయిగా దహించుకుపోతాను తప్ప వేరే వాళ్ళ సానుభూతి వచనాలు నాకు అక్కర్లేదు. కానీ, ఇప్పుడు నా గుండెలోని బాధనంతా ఈ సాక్షి ముందు పరచాల్సిన సందర్భం వచ్చింది. ఇక నుంచి మేమిద్దరం కలిసి ఆ బాధ భరించాలి కాబట్టి చెప్పాల్సిన సమయం ఆసన్నమైందనుకున్నాను.



"సాక్షీ! నా జీవితంలో ఒక భయంకరమైన గతం ఉంది. దానికీ ఈ బ్యాంకుకూ, ఈ బ్యాంకులో పని చేసిన వ్యక్తులకూ సంబంధం ఉంది. వాళ్ళే అందులో ముఖ్య పాత్రధారులు.

సతీదేవి అవమానభారంతో తండ్రి ఇంటనే



## దొరికిపోయిన రాధికా ఆప్టే

ఇటీవలి కాలంలో రాధికా ఆప్టే ఏదో ఒక విధంగా వార్తల్లో నిలుస్తోంది. ఈసారి హ్యాకర్లకు దొరికిపోయింది. ఇలా హ్యాకర్లకు దొరకడం రాధికకు కొత్తేమీ కాదు. ఇది రెండవసారి. తన ఫేస్‌బుక్ అకౌంట్‌ను హ్యాకర్లు హ్యాక్ చేశారనీ, ఫేస్‌బుక్ ద్వారా తనకు ఎలాంటి సమాచారం పోస్ట్ చేయవద్దంటూ రాధిక తన అభిమానులకు విజ్ఞప్తి చేసింది. అయితే ఈసారి ఆమె మాటలను ఎవరూ నమ్మడం లేదు. మొదటిసారి అంటే నమ్మవచ్చు కానీ వరుసగా రెండవసారి హ్యాక్ కావడం ఏంటి? అంటూ కొందరు అనుమానాన్ని వ్యక్తం చేస్తున్నారు. కావాలనే రాధిక అబద్ధాలు ఆడుతోందని మరికొందరి అనుమానం అట!

**ఆమె చేతిని తనచేతిలోకి తీసుకున్నాడతను. మెల్లగా తన గతాన్నంతా ఆమెముందు పరిచాడు. మనసులో సుళ్ళు తిరుగుతున్న వేదనంతా వెళ్ళబోసుకున్నాడు. నవ్వాడు. ఏడ్చాడు. సిగ్గుపడ్డాడు. చివరికి తన హృదయంలో ఆమె స్థానమేమిటో తెలియాలంటే ఇదే సమయం అనుకున్నాడు. వెంటనే 'ఐ లవ్ యూ' చెప్పాడు. అసలతను తన గతాన్ని ఎవరితో పంచుకున్నాడు? దానికామె ఎలా రియాక్టయ్యింది?**

అగ్నిలో దగ్ధమవుతుంది. అది విని ఆగ్రహోదగ్రుడైన శివుడు ప్రజాపతిని సంహరించినట్టుగా నేను కూడా శత్రుశేషం లేకుండా ఈ చోటు నుంచి ఒక మహత్తర ప్రక్షాళనా కార్యక్రమం ప్రారంభించాల్సిన అవసరం ఇప్పుడే, ఇందాకనే కలిగింది. దానికి నీ సహకారం కావాలి సాక్షి!

సముద్ర అలల మీద ఆటలాడే సర్ఫర్స్ అంటే సర్ఫ్ బోర్డుల మీద అంటే చిన్న చెక్క ముక్కలాంటి బోర్డుల మీద సర్ఫింగ్ చేసే క్రీడాకారులు, పెద్ద ఎత్తున, ఉవ్వెత్తున లేచే అల (Big Wave) కోసం, దాని మీద పాడిల్ (paddle) చేయడం కోసం నిరీక్షిస్తూ ఉంటారు.

ప్రస్తుతం అలాంటి మహా కెరటం నా ప్రమేయం లేకుండానే నా జీవిత సముద్రంలోకి చొచ్చుకుని వచ్చి పడింది. నేను దానిమీద స్వారీ చేయాల్సిందే. తప్పించుకుని పారిపోతే భీరువునవుతాను. ఏ ధైర్యసాహసాల కోసం గొప్ప త్యాగాలు చేశానో, వాళ్ళు నన్ను చూసి కుచించుకుపోతారు, ఈ లోకంలో పై లోకంలో.

అలాగే, ఎంత గొప్ప కెరటమైనా కొంతసేపటికి పతనం కాక తప్పదు. దాని మీద స్వారీ చేయాలనుకుంటున్న నేను కూడా అప్పుడు కింద పడక తప్పదు. పడిపోయిన కెరటం అనేక శక్తులు సమాయత్తం కావడంతో మళ్ళీ పురుడు పోసుకుని మళ్ళీ ఉరకలేస్తూ లేస్తుంది.

అప్పుడు, నేను కింద పడినప్పుడు, మళ్ళీ లేచి నిలబడి, ఆశయాల జెండా మోసుకుంటూ తిరిగేలా చేయూతనిస్తావా? మనిషిగా నిలబెడతావా? ప్లీజ్!" అన్నాను.

నా మాటలు తనకు అర్థం కాలేదు. అయోమయంగా చూసింది. డాక్టర్ నాకు బాగానే ఉందని చెప్పాడు కానీ నాకు నిజంగా పిచ్చి ఎక్కిందని అనుకుందేమోనని, ఆమె చూపులను బట్టి నాకు అనిపించింది.

నేను తనకు అర్థం అయ్యే విధంగా చెప్పాలని ప్రయత్నిస్తుండగానే వనజ వచ్చింది.

ఆ రాత్రికి బెంగుళూరు ప్రయాణం సాధ్యం కాదన్నట్టుగా 'ప్చ్' అన్నట్టుగా పెదవి విరిచింది. నాకు సన్నిహితంగా కూర్చుని ఉన్న సాక్షిని చూసి బయటకు వెళుతూ మొబైల్ ఫోన్ చూపించింది.

మరుక్షణంలోనే మెసేజ్ వచ్చింది.

'ఇప్పుడు టైం పది దాటింది. ఏ ఫ్లైటూ లేదు. ఎర్లీ మార్నింగ్ నాలుగున్నరకు ఎమిరేట్స్ ఇంటర్నేషనల్ ఫ్లైట్‌లో అతి కష్టం మీద సీట్ బుక్ చేశాను. డొమెస్టిక్ ప్యాసెంజర్స్‌ను వాళ్ళు సాధారణంగా ఒప్పుకోరు. అయినా ఇన్‌ఫ్లుయెన్స్ చేసి బుక్ చేశాను.'

నేను 'థాంక్స్' అని సమాధానం టైప్ చేశాను.

'సరే, ఇదీ ఒకందుకు మంచిదే' అనుకున్నాను.

"సాక్షీ! ఈ హైదరాబాద్‌లో ఒక్క క్షణం కూడా ఉండలేననుకుని వెళ్ళిపోదామనుకున్నాను. కానీ, నువ్వున్నావు కాబట్టి ఉండగలుగుతున్నాను. ప్లీజ్... మాట్లాడు సాక్షీ! నువ్వు ఒక్కమాట కూడా మాట్లాడ్డం లేదు" అన్నాను తన చేతులు పట్టుకుంటూ.

సాక్షి నావైపు నిరాసక్తంగా చూసి,

"నాకేం మాట్లాడాలో అర్థం కావడం లేదు. నన్ను చూసినప్పటి నుండి మీరు అవసరానికి మించి ఇంట్రెస్ట్ చూపిస్తున్నారు. నాకు అర్థమవుతూనే ఉంది. కానీ, మీరు మా అతిథి కాబట్టి నేను కూడా భరించాను. మన పరిచయం జరిగి కొన్ని గంటలు కూడా కాలేదు. ఇంతలోనే మీరు స్పృహ తప్పారు. మెలకువ రాగానే మీరు నన్ను ప్రేమిస్తున్నానంటున్నారు. నాతో జీవితం పంచుకుంటానంటున్నారు. దానికి తోడు మీకో భయంకరమైన గతం ఉందంటున్నారు. మనిద్దరం కలిసి పోరాటం ప్రారంభిద్దాం అంటున్నారు. అవునా?" అంది.

నేను ఔనన్నట్టుగా తలూపాను.

"మీరే చెప్పండి! పెళ్ళి కాని ఏ పిల్లయినా ఇటువంటి సమయంలో ఏమైనా మాట్లాడగలుగుతుందా?" అంది కొంచెం కోపంగా.

నేను తల పంకించాను. 'అవును, నేను నా పాయింట్ ఆఫ్ వ్యూలోనే ఆలోచించాను గానీ, ఇంత ఇంటెన్స్ సిట్యుయేషన్‌లో, గందరగోళ పరిస్థితుల్లో ఎవరికైనా ఎలా ప్రేమ భావాలు పుడతాయి?' అని అనుకుని,

"ఔను. నిజమే సాక్షీ! నువ్వన్న ప్రతీ మాట అక్షర సత్యమే. ఆలస్యం చేస్తే నిన్నెక్కడ పోగొట్టుకుంటానోనన్న భయంతో చాలా స్వార్థంగా ఆలోచించాను. నువ్వన్నది నిజమే. మనం కలిసిన ఈ కొద్దిపాటి సమయంలో అనూహ్యమైన అనేక సంఘటనలు జరగడంతో అంతా కలగాపులగమైంది. విజయ కెరటం మీద స్వారీ చేసి విజేతగా నీ ముందు నిలిచిన నేను అకస్మాత్తుగా పిరికివాడిలా నీ చేతుల్లోనే స్పృహ కోల్పోయాను. నిజంగా ఇదంతా ఎవరికైనా ఎంబరాసింగ్‌గానే ఉంటుంది."

"సాక్షీ! ఒక పని చేద్దామా? ప్లీజ్!" అన్నాను బ్రతిమిలాడుతున్నట్టుగా.

తను సందేహంగా చూసి,

"చెప్పండి" అంది.

"నిజానికి నేను కడుపునిండా అన్నం తిని, కంటినిండా నిద్రపోయి ఐదు రోజులైంది. సో... మనమెక్కడికైనా, ప్రశాంతంగా ఉండే చోటుకి వెళ్ళిపోదామా? మీ ఇంట్లో వాళ్ళకి చెప్పి నాతో రాగలవా?" అని అన్నాను.

"ఊహూం, అలా వీలు కాదు." అంది ఖచ్చితంగా.

నేను నిరుత్తరుణ్ణయ్యాను.

"సాక్షీ! నా గురించి నీకు తెలియక నువ్వు నన్ను అనుమానిస్తున్నావు. నేను సివిల్స్ పరీక్షల్లో దేశం మొత్తానికి టాపర్‌ను. అయినా సరే, ఒక లక్ష్యం కోసం, ఐఏఎస్‌ను కాదనుకుని, ఐపీయస్‌లో చేరాను. నా గతం భయంకరమైనదంటే వేరే ఏమో కాదు. నేను ప్రేమించిన వ్యక్తి కోసం ప్రాణాలివ్వడానికైనా ప్రాణాలు తీయడానికైనా సిద్ధపడిన వాణ్ణి మాత్రమే. అందుకోసమే ఐపీయస్‌లో చేరాను. నా లక్ష్యం నెరవేరగానే ఆ పదవిని తృణప్రాయంగా వదిలేశాను.

నిన్ను నా జీవితంలోకి ఆహ్వానించాలని మాత్రమే అనుకున్నా. నీతో మిస్ బిహేవ్ చేస్తానా? నిన్ను తప్పుగా ట్రీట్ చేస్తానా? చెప్పు. ప్లీజ్, ప్లీజ్! నేనేమిటో వివరంగా చెప్పడానికి నాకో అవకాశం ఇవ్వు!" అని బ్రతిమిలాడాను.

ఈ మధ్యకాలంలో నేను అన్ని మాటలు ఒక

స్త్రీతో ఎప్పుడూ మాట్లాడలేదు. కానీ, ఒక్కసారి సాక్షి నా కళ్ళ ముందు నుండి కనుమరుగైతే మళ్ళీ, శాశ్వతంగా కనిపించదేమోనన్న అకారణ భయం నాతో అలా మాట్లాడించసాగింది.

మరుగున పడిన రాగిణి జ్ఞాపకాలు మళ్ళీ చెలరేగి, ఇప్పుడు మనసులో తాజాగా ఉండడంతో నా మనసంతా పచ్చి పుండులా ఉంది. దానికి మలాము పూసి మాన్పే శక్తి కేవలం సాక్షికే ఉందని నేను గట్టిగా భావించడంతోనే, అలా నా ప్రవృత్తికి విరుద్ధంగా బ్రతిమిలాడాను.

తను కొంచెం మెత్తబడింది.

"ఈ చీరలోనే హోటల్‌కి వెళ్దామా?" అంది. ఆమె ముఖంలో ప్రసన్నత ప్రస్ఫుటంగా గోచరించింది.

"ఈ చీర చాలా బాగుంది. శిల్పానికి బంగారు పోత పోసినట్టుంది." అన్నాను.

"అబ్బో!" అని "ఎక్కడికెళ్దాం?" అని అడిగింది.

"ఎక్కడికైనా సరే! ఫుడ్ ముఖ్యం కాదు. ప్రశాంతమైన వాతావరణం మాత్రం ఉండాలి టు టాక్ అండ్ టు చిల్ ఔట్!" అన్నాను.

"డ్రింక్స్?" ప్రశ్నించింది.

"నాకైతే వద్దు. నువ్వు తీసుకుంటే నాకు అభ్యంతరం లేదు" అన్నాను.

"నో నో, ఐ డోంట్ డ్రింక్!" అంది సాక్షి.

నేను మెల్లిగా లేచి షర్టు సర్దుకున్నాను. కోట్ వేసుకోబోతుంటే,

"అవసరమా?" అంది సాక్షి.

"లేదు, అవసరమేమీ లేదు" అన్నాను. హైదరాబాద్‌లోని ప్రజలకు కోటు వేసుకోవడం ఇంకా అలవాటు కాలేదు. నేనైతే బెంగుళూరులో కోటు లేకుండా కాలు కూడా బయట పెట్టను.

ఆమె వెనుకే సెల్లార్‌లోని ఆమె కారు దగ్గరకు నడిచాను. సాక్షి ఇన్నోవా "క్రిస్టా" మోడల్ కారును లాఘవంగా నడుపుతుంటే ముచ్చటగా చూశాను. సాధారణంగా అమ్మాయిలు నాజూకుగా ఉండే హోండా సిటీ, మారుతీ డిజైర్ వంటి కార్లనే ఇష్టపడతారు. ఎందుకంటే ఇన్నోవా నడపాలంటే గట్స్ కావాలి.

## లాకర్ నెం.369
### కూపన్ నెం.11 విజేత
**పి.ప్రణీత**
సికింద్రాబాద్

వరంగల్ హైవేపై సిటీకి దూరంగా ఉన్న ఓ చిన్న హోటలుకు బయలుదేరాం.

టైం రాత్రి పదకొండు దాటింది. చాలా వరకు ట్రాఫిక్ తగ్గింది. అప్పటికే కొన్ని రోడ్లు నిర్మానుష్యమైపోయాయి. సన్నటి జల్లు పడుతోంది. రోడ్ బీస్ట్ లాంటి ఇన్నోవా, కుదుపులు లేకుండా, చేరాల్సిన మా గమ్యం కళ్ళముందే ఉన్నంత నింపాదిగా, కదులుతోంది. బంగారు రంగు వీధి దీపాల వెలుతురు రోడ్ల మీద ప్రతిఫలిస్తూ ఓ వింతైన నేపథ్యాన్ని సృష్టిస్తోంది.

ఆ దృశ్యం చూస్తుంటే నాకు 'తేజాబ్' హిందీ సినిమాలోని ఒక పాట గుర్తొచ్చింది.

విలన్ స్థావరం నుండి హీరోయిన్ మాధురీ దీక్షిత్‌ను రక్షించి జీపులో తీసుకుని వస్తుండగా అనిల్ కపూర్, అతని స్నేహితులు సంజయ్ దత్, చుంకీ పాండే మొదలైన వాళ్ళంతా ఈ పాట పాడతారు. హీరో అతని స్నేహితులంతా చిల్లర గ్యాంగ్ అని హీరోయిన్ మొదట అతన్ని ఈసడించుకుంటుంది. కానీ, చివరకు వాళ్ళే ఆమెను రక్షిస్తారు.

హుషారుగా సాగే పాటే అనిపిస్తుంది కానీ పరికించి చూస్తే, మనసు పెట్టి వింటే అంతులేని విషాదం గోచరిస్తుంది. ఆ పాట ఎప్పుడు విన్నా నా కంటి గవాక్షం ముందు ఒక కన్నీటి చుక్క, అభిసారికలా, నిలబడుతుంది.

ఇప్పుడు నేనున్న పరిస్థితికి, నా మానసిక సంఘర్షణకు చక్కగా అద్దం పడుతుంది.

"సో గయా యేc జహాc
సో గయా ఆస్మా
సో గయీ హై సారీ మంజిలే
ఓ... సారీ మంజిలే
సో గయా హై రస్తా
రాత్ ఆయితో జిన్ కే ఘర్ థే ఓ ఘర్ కో గయే సో గయే
రాత్ ఆయితో హం జైసే ఆవారా ఫిర్ నికలే రాహోc మే ఔర్ కో గయే ......."

'ఈ నేల పడుకుంది.
ఆ ఆకాశం పడుకుంది.
గమ్యాలన్నీ నిదురిస్తున్నాయి.
దారులన్నీ ఆదమరిచి పడుకున్నాయి.
రాత్రి కాగానే ఇల్లున్న వాళ్ళు, ఇంటికి చేరి

ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీ‌డిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## లాకర్ నెం. 369-13 (20-9-2017)

మా ప్రశ్న: కారులో వెళ్తూంటే అతనికి ఏ హిందీ సినిమాలోని పాట గుర్తొచ్చింది?

మీ జవాబు----------------------------------------------------------------------------------------

చిరునామా----------------------------------------------------------------------------------------

-----------------------------------------------------------------------------------------------------

-----------------------------------------------పిన్-----------------------------ఫోన్‌నెం-------------------------------------

ఈ కూపన్‌ను 19 సెప్టెంబర్ 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33



*నిబంధనలు వర్తిస్తాయి

పడుకుంటే ఇల్లు లేని మా లాంటి ఆవారాగాళ్ళం దారి తప్పి తిరుగుతున్నాం.

నా జీవితమంతా, రాగిణి తర్వాత, ఇలాగే గడిచింది. ఇన్నాళ్ళూ, నేను కూడా గమ్యం లేని దారుల గుండా పాంథుడిలా తిరుగుతున్నాను. ఏ దారెటు వెళ్తుందో ఎవరికెరుక అన్నట్టుగా రోజులీడుస్తున్నాను. ఇన్ని రోజుల తర్వాత, రాగిణి చనిపోయిన ఎనిమిది ఏళ్ళకు ఒక దారి కనిపిస్తోంది, సాక్షి రూపంలో.

ఆమెతోనే ప్రయాణం ప్రారంభించాను. చూడాలి గమ్యానికి చేరుతానో లేదో?

భోజనం బాగుంది. భోజనం చేసిన తర్వాత పాన్ వేసుకుని హోటల్ పక్కనే ఉన్న చెరువు కట్ట మీద స్ట్రోల్, నింపాదిగా నడవడం, చేయసాగాం.

టైం రెండైంది.

'ఇదే సమయం. చెప్పేయ్' అని మనసు తొందర పెడుతోంది. బహుశా సాక్షి కూడా నేనేమైనా చెబ్తానేమోనని ఎదురు చూస్తున్నట్టుంది. విసుగ్గా ఆవలిస్తోంది.

నేను తన చేతిని నా చేతిలోకి తీసుకుని,

"సాక్షీ!" అంటూ చెప్పడం మొదలు పెట్టాను.

నా మనసులో సుళ్ళు తిరుగుతున్న బాధనంతా సాక్షి ముందు వెళ్ళబోసుకున్నాను. నవ్వాను. ఏడ్చాను.




కళ్ళనీళ్ళు పెట్టుకున్నాను. పగలబడి నవ్వాను. సిగ్గుపడ్డాను. గర్వంతో పొంగిపోయిన క్షణాలను, తల నేలకు కుంగిపోయిన అవమానాల ఘడియలను ఆమె ముందు పరిచాను.

రాగిణి చనిపోయిందని చెప్పేటప్పుడు గొంతు గద్గదమైంది. గుండె గొంతుకలో కొట్టుకులాడింది. భూమి పొరల్లో ఎంతో కాలంగా రగులుతున్న జ్వాలాముఖి ఏదో ఒక ముహూర్తాన నింగికెగురుతుంది. పరిసరాలను భస్మీపటలం చేస్తుంది.

అలా నేను నా మనసులోని బాధనంతా చెప్తుండగానే నా ఫోన్ మోగింది.

గతకాలపు జ్ఞాపకాల పరంపరలో కొట్టుకుపోతున్న నేను ఉలికిపడ్డాను. ఫోను వనజ దగ్గర నుంచి.

"బాస్! ఎక్కడున్నారు? మీ ఫ్లైటుకు టైం అవుతోంది!" అని కంగారుగా చెప్పింది.

నేను ఉలికిపడి,

"ఓ మై గాడ్! మరిచేపోయాను. ఎన్ని గంటలకు?" అని అడిగాను.

తను చెప్పింది. టైం చూశాను. గంట లోపల ఏర్‌పోర్టులో ఉండాలి. అందుకే సాక్షితో,

"సాక్షీ! గంట లోపల ఏర్‌పోర్టుకు వెళ్ళగలమా? లేదంటే నెక్స్ట్ ఫ్లైట్‌కు వెళతాను." అన్నాను.

సాక్షి నవ్వుతూ,

"వై నాట్? ఔటర్ రింగ్ రోడ్డు ఎక్కితే ఎంతసేపు. కళ్ళు మూసి తెరిచేలోగా ఏర్‌పోర్టులో ఉంటాం." అంది.

కారు స్టార్ట్ చేసింది. రేసుగుర్రంలా కారును పరిగెత్తించింది.

"వనజా! టూ థింగ్స్. హోటల్లో నా రూం ఖాళీ చేయించి బెంగుళూరుకు కొరియర్ చేయించు. అలాగే, ఐయాం ఆన్ ద వే. బుకింగ్‌లో వెబ్ చెకిన్ చేయించు. నువ్వు ఎప్పుడు వస్తున్నావ్?" ప్రశ్నించాను.

"బాస్! రాజీవ్, నేనూ ఉండి అకౌంట్ సెటిల్ చేసుకుని సాయంత్రానికి బయలుదేరుతాం. నేను కొన్ని పెర్ఫ్స్ కూడా కొనుక్కోవాలి" అంది.

కారు ఔటర్ రింగ్ రోడ్డుమీద పరుగులు తీస్తోంది. నేను సాక్షి వైపు చూశాను.

'ముగ్ధమోహనమైన రూపం కొంచెం వదలిపోయి ఉంది. కానీ, ఆమెలో కనిపించినంత సున్నితత్వం, ప్రవర్తనలో లేదు. కొంచెం లౌక్యం. కొంచెం కఠినత్వం. మనిషిని చూపులతో దూరంగా, మాటలతో శాసించే గుణం ఆమెలో ఎక్కువ. బహుశా ఆధునిక మహిళకు ఉండాల్సిన లక్షణమే అది కాబోలు.

రాగిణి కూడా ముందు కొంత అంటీ ముట్టనట్టు ప్రవర్తించినా ఆమెలో ఒక సున్నితత్వం ఉండేది. స్త్రీ సహజమైన బిడియం, ఆప్యాయత, ఎదుటి వారికి ఏదైనా ఇచ్చి సంతృప్తి పరచే గుణం ఉండేవి. ఆమెను సులువుగా ప్రేమించవచ్చు.

కానీ, సాక్షి దగ్గర చాలా జాగ్రత్తగా బిహేవ్ చేయాలి. ఏదో సినిమాలో అన్నట్టు ఆమె కోసం యుద్ధాలు చేయాలి. ప్రేమను గెలుచుకోవాలి. విజేతనైతేనే తను వరిస్తుంది.

తన మనసులో ఏముందో తెలియదు కానీ ఇప్పటివరకు నాపై తనకు ఏ విధమైన అభిప్రాయం లేనట్టే ఉంది. అయినా, మా పరిచయం జరిగి ఏడెనిమిది గంటలు కూడా కాలేదు. కానీ, ఈ కొద్ది సమయంలోనే జరిగిన సంఘటనల గాఢత మూలంగా ఎంతో కాలంగా పరిచయమున్నట్టుగా అనిపిస్తోంది.

నేను అనుభవించిన సంఘటనలను తను అనుభవించలేదు. అందుకే, నేను ప్రతిస్పందించినంత తీవ్రంగా, వేగంగా ఆమె కూడా రియాక్ట్ కావాలని, నా ప్రేమను అంగీకరించమని అడగడం కూడా తొందరపాటే!

కానీ, ఈ అవకాశం తప్పితే మరో అవకాశం రాదు. ముఖాముఖి తనతో మాట్లాడాలన్నా, నా గుండెలోని ఆవేదనంతా ఆమెకు తెలియజేయాలన్నా ఇదే చివరి మోఖా, లాస్ట్ ఛాన్స్.

కారు కంటే వేగంగా కాలం పరిగెడుతోంది. టైం లేదు. చెప్పేయాలి.

"సాక్షీ! నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. కానీ, నేను మాత్రం హైదరాబాద్‌లో ఉండలేను. నువ్వు బెంగుళూరుకు వస్తావా నా కోసం!" అడిగాను.

అడిగిన మరుక్షణం నన్ను నేనే తిట్టుకున్నాను. ఇప్పటివరకు మనసులో చేసుకున్న ఎక్సర్‌సైజ్ అంతా బూడిదలో పోసిన పన్నీరైంది. ఆమెను గెలుచుకోవాలంటే ఆమె కోసం యుద్ధాలు చేయాలని అనుకున్నవాణ్ణి, ఆమె నా ప్రేమను అంగీకరించనే లేదు. అప్పుడే బెంగుళూరుకు వస్తావా అని అడగడమంత బుద్ధితక్కువ మాట మరొకటి లేదు.

అందుకే, వెర్రిగా నవ్వుతూ,

"చెప్పు సాక్షీ!" అన్నాను.

"నో వే! నేను హైదరాబాద్ వదిలే సమస్యే లేదు." అంది నిశ్చయంగా.

"నేను హైదరాబాద్‌లో ఉండే ప్రసక్తే లేదు" అనుకుంటున్న నేను మ్రాన్పడిపోయాను.

ఏర్‌పోర్టులో కారు తలుపు తీసుకుని అడుగు బయటపెట్టానో లేదో, సాక్షి కారుని ముందుకు దుమికించింది.

మరో మాటకు తావు లేకుండా, కనీసం వీడ్కోలు గానీ, 'బై' గానీ చెప్పకుండా సాక్షి వెళ్ళిపోవడంతో ఖంగుతిన్నాను.

ఆ ఇన్నోవా కారును నా గుండెల మీదనే పరుగులు తీయించినట్టనిపించింది.

నేను ఉస్సూరుమంటూ లోపలికి నడిచాను. నేరుగా సెక్యూరిటీలో నా ఫోనుకు వచ్చిన బోర్డింగ్ పాస్ చూపించి, విమానంలో కూర్చున్నాను.

ఎనిమిదేళ్ళు నిరాసక్తంగా, ఏ విధమైన ఎమోషనల్ ఒడిదుడుకులు లేకుండా నిస్సారంగా గడిచిన నా జీవితం గత ఎనిమిది గంటల్లో రోలర్ కోస్టర్ రైడర్‌లో పడి నానా విధాలుగా, ఎత్తులూ, పల్లాలూ, లోయలూ, గుహలూ, సమున్నత శిఖరాలూ, గుండె కుహరాలు పగిలిపోయేంత ఉద్విగ్నాలూ, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ఇవే చివరి క్షణాలు అన్నంత ఆందోళనతో గడిపిన క్షణాలకు గురైంది.

రోలర్ కోస్టర్ ఆగిన కొన్ని క్షణాలవరకు మన మనసూ, శరీరమూ మన స్వాధీనంలోకి రావు. మనసు ఇంకా ఆ ఉద్విగ్నతలోనే ఉంటే, ఒళ్ళు మాత్రం రోలర్ కోస్టర్ స్పీడుకు అనుగుణంగానే వింతగా ప్రవర్తిస్తుంది.

నేను కూడా ప్రస్తుతం అదే పరిస్థితిలో ఉన్నాను. ఒక భారరహిత స్థితిలో ఒక వస్తువు ఉన్నప్పుడు, గురుత్వాకర్షణ శక్తి ప్రభావం లేకుండా శూన్యంలో అది ఎలా తేలుతుంటుందో నా మనసూ, శరీరమూ అలాగే తేలుతోంది.

నేనెక్కిన విమానం కూడా ఆకాశంలో తేలుతూ, నా ప్రియమైన బెంగుళూరు నగరానికి పరుగులు పెడుతోంది.

***(ఇంకా వుంది)***






## రియల్ ఐరన్‌మేన్

ఎలక్ట్రానిక్ హెల్మెట్, కాళ్ళకు జెట్ ఇంజిన్లు పెట్టుకుని, గాల్లో ఎగిరే ఐరన్ మేన్ సిరీస్ పరంపర హాలీవుడ్‌లో కొనసాగుతూనే ఉంది. కానీ నిజజీవితంలో కూడా ఓ ఐరన్‌మేన్ ఉన్నాడు. అతడే జార్నో కార్డియా! నెదర్లాండ్స్, డీహాగ్ నివాసి. వయసేమో 39 ఏళ్ళు. ఇప్పటికే ఇతనిపేరిట 5వేల జంపుల రికార్డు ఉంది. ఇప్పుడు సరికొత్తగా ఐరన్‌మేన్ అవతారమెత్తాడు. రెక్కల్లాగా ఉండేలా వింగ్ సూట్ తయారుచేసుకుని, తన బూట్లకు రెండు జెట్ ఇంజిన్లను ఫిక్స్ చేసుకుని, తలకు హెల్మెట్ పెట్టుకుని, దాదాపు 80 కేజీల బరువుతో హాట్‌ఎయిర్ బెలూన్ నుంచి దూకేశాడు. చక్కగా ఐరన్‌మేన్ ఎగిరినట్టు గాల్లో ఎగిరాడు. ఈ బూట్ల డిజైనింగ్‌లో ఇద్దరు ఇంజనీర్లు, కంట్రోల్ సిస్టమ్ కోసం ఒక ప్రోగ్రామర్ కార్డియాకి సహాయపడ్డారు. అయితే ఇది కేవలం 3 నిమిషాల రైడ్ మాత్రమే. భవిష్యత్తులో 8 నిమిషాల పాటు గాల్లో ఎగిరేలా బూట్లను డిజైన్ చేస్తానని చెబుతున్నాడీ రియల్ టైమ్ ఐరన్‌మేన్!

## మంకీ స్కూల్

భవిష్యత్తు బాగుండాలంటే చదువు తప్పనిసరి అంటున్నారు నేటి పెద్దలు. అదే విషయాన్ని కోతులకు కూడా అన్వయించేశారు చైనా దేశస్థులు. ఎలా అంటారా? వాటికి విద్య నేర్పడానికి ప్రత్యేకంగా స్కూల్ తెరిచారు. చైనా, డొంగ్యింగ్ అనే నగరంలో కోతుల కోసం ప్రత్యేకంగా స్కూల్‌ని ప్రారంభించారు. అక్కడ వాటికి నెంబర్లు ఎలా లెక్కించాలో నేర్పిస్తారు. షేక్‌హ్యాండ్ ఇవ్వడం, సెల్యూట్ చేయడం వంటివి నేర్పిస్తారు. అంటే మనుషులతో ఎలా ప్రవర్తించాలో వీటికి శిక్షణ ఇస్తున్నారన్నమాట. ఇవేకాకుండా ఇంకా రకరకాల పనులు చేయడంలో కూడా శిక్షణ ఇస్తారు. వీటికి విద్య నేర్పించేందుకు టీచర్లు కూడా ఉన్నారు మరి. అయితే అసలు విషయమేంటంటే ఈ చైనా వారి కోతుల స్కూల్లో మొట్టమొదటగా అడ్మిషన్ తీసుకున్నది మాత్రం జపాన్ దేశపు కోతులట! విడ్డూరంగా ఉంది కదూ!

## కూలింగ్ పెయింట్

వేసవి వస్తుందంటే చాలు, ఇల్లు కాస్తయినా కూల్‌గా ఉండాలని, ఇంటి పైకప్పుని వైట్ సిమెంట్‌తో కప్పేస్తారు. కానీ అమెరికాలోని ఓ నగరంలో రోడ్లకు కూడా కూలింగ్ పెయింట్ వేస్తున్నారు. అమెరికా, కాలిఫోర్నియా రాష్ట్రం, లాస్‌ఏంజెల్స్‌లో ఎండలు విపరీతంగా మండుతున్నాయట. ఆ వేడిని అక్కడి ప్రజలు తట్టుకోలేకపోతున్నారట. అందుకే వేడిని తగ్గించేందుకు, పరిసర ఉష్ణోగ్రతను నియంత్రించేందుకు రోడ్లకు కూలింగ్ పెయింట్ వేస్తున్నారట. ఈ కూలింగ్ పెయింట్ వాతావరణాన్ని చల్లబరిచి, కాస్తంత ఉపశమనాన్ని కలిగిస్తుందనేది ఆ నగరవాసుల ఆలోచన. నగరంలోని 35 శాతం వీధులకు కూలింగ్ పెయింటు వేస్తే, అది వాతావరణ వేడిని 15 డిగ్రీల వరకు తగ్గించగలదని అంచనా. ఐడియా బావుంది కదూ!

## మార్జాల వివాహం!

పెళ్ళి దుస్తుల్లో చూడముచ్చటగా ఉందా జంట! అందరి చూపులూ ఆ జంటమీదే! ఫోటోగ్రాఫర్ ఆ జంటను ఫోటోలు తీయడానికి నానా అవస్థా పడుతున్నాడు. ఇదంతా స్మిటెన్ కిటెన్స్ క్రిస్టీ, లిల్లీ వెడ్ అనే మార్జాలాల పెళ్ళిసందడి!

ఇంగ్లాండ్‌లోని సెయింట్ హెలెన్స్, మెర్సీసైడ్‌కి చెందిన మేరియలైనా హాష్‌క్రాఫ్ట్ దగ్గర దాదాపు 8 దాకా పెంపుడు మార్జాలాలున్నాయి. వాటిల్లో క్రిస్టీ, లిల్లీలకు పెళ్ళివేడుక జరిపించింది మేరి. ఏదో ఎంజాయ్ చేయడం కోసమో, ఆనందం కోసమో కాదులెండి... పరోపకార తత్వంతోనే ఆమె ఈ పని చేసింది. కేన్సర్ వ్యాధితో బాధపడుతున్న కేసీ టర్నర్ అనే ఐదేళ్ళ చిన్నారి చికిత్స నిమిత్తం తనవంతు సాయంగా ఆమె ఈ పని చేసింది. విండిల్ పబ్‌లో తన దగ్గరున్న పిల్లిపిల్లలకు వివాహం జరిపించింది. అక్కడికొచ్చిన అతిథులకు పిల్లి మీసాలతో మేకప్ కూడా వేయించింది. వేడుక సమయంలో కేసీ ముఖంలోని ఆనందం చూసి, తనకెంతో సంతోషంగా అనిపించిందని అంటోంది మేరి. మొత్తానికి ఆమె ఉద్దేశం ఏదైనా రెండు మార్జాలాలు పెళ్ళి పేరుతో ఒక్కటయ్యాయి.



## నిద్రకూ ఓ పీరియడ్!

కాలేజీకి ఎవరైనా ఎందుకెళ్తారు? అని అడిగితే అదేం ప్రశ్న? అని ఎదురు ప్రశ్నిస్తారు. పైగా చదువుకోడానికి వెళతారు అని సమాధానం ఇస్తారు. కానీ అమెరికాలోని ఓ యూనివర్సిటీలో మాత్రం చదువుతోపాటు ఎంచక్కా ఓ కునుకు కూడా తీయొచ్చు. అమెరికాలోని యూనివర్సిటీ ఆఫ్ మిచిగన్ విశ్వవిద్యాలయంలోదీ విచిత్రం. కేవలం కునుకు తీయడానికే అక్కడ న్యాపింగ్ స్టేషన్‌ని ఏర్పాటు చేశారు. 45 నిమిషాల 'న్యాప్ నుక్' అనే పీరియడ్‌ను కూడా కేటాయించారు. విద్యార్థులు కూడా ఈ అవకాశాన్ని బాగానే వినియోగించుకుంటున్నారట. దాదాపు అరవై శాతం విద్యార్థులు సరిగా నిద్రపోవడం లేదనీ, క్లాసుల్లో కునికిపాట్లు పడుతున్నారనీ యూనివర్సిటీ ఆఫ్ అలబామా పరిశోధకుల అధ్యయనంలో తేలడంతో ఈ ఏర్పాట్లు చేశారు.



—నర్మద వాసిరెడ్డి

# CRIME తానొకటి తలిస్తే...

**రాత్రి పదిగంటల సమయం.**

**ఆ వీధిలోని ఓ ఇంటి గుమ్మంలో...**

**భర్త రాక కోసం ఎదురుచూస్తూ నిలబడి ఉంది సుధ.**

**ఆమె కట్టుకున్న తెల్లచీరలోంచి ఆమె సౌందర్యం అస్పష్టంగా కనిపిస్తోంది.**

**ఆమె తలలో ముడుచుకున్న మల్లెలు నవ్వులు రువ్వుతున్నాయి. పడకగదిలో ఆమె వెలిగించిన అగరొత్తులు మధుర సువాసనలు వెదజల్లుతున్నాయి.**

ఆ గదంతా అదోలాంటి మత్తుతో మునిగి ఉంది.

సరిగ్గా ఆ సమయంలో సుధ భర్త రఘురామ్ గేటుతీసి లోపలికి అడుగుపెట్టాడు.

తనకోసం ఎదురుచూస్తున్న భార్యను చూడగానే అతని పెదవులపై నవ్వు మెరిసింది.

"ఇంత ఆలస్యం అయిందేమిటండీ?" భర్త బ్యాగ్ అందుకుంటూ అడిగింది సుధ.

"ఆఫీసులో పని ఒత్తిడి."

"ఈ మధ్య ఆలస్యంగా వస్తున్నారు. ఇంట్లో నేనొక్కదాన్నే ఉంటానన్న ధ్యాసే లేదు మీకు" చిరు కోపం ప్రదర్శించింది.

"ఏం చేయనూ, మా బాస్ కర్కోటకుడు. పని పూర్తి చేస్తే కానీ వదలడు" అంటూ భార్యను వాటేసుకున్నాడు. "ఏం చేస్తున్నారు?" అంది సుధ మురిపెంగా. రఘురామ్ ఆమె మెడమీద ముద్దుపెట్టుకుని గట్టిగా కౌగిలించుకున్నాడు.

ఆమె మత్తుగా కళ్ళు మూసుకుంది. ఒళ్ళంతా మైకం కమ్మినట్టయ్యింది. అంతలో ఏదో గుర్తుకొచ్చినట్టు ఉలికిపడి "ముందు భోజనం కానివ్వండి" అంది.

"అబ్బా, తరువాత చేయొచ్చులే" అంటూ మరింత పట్టు బిగించబోయాడు.

"ముందు ఫ్రెష్ అయి రండి" అంటూ పట్టు విడిపించుకుని అతన్ని బాత్రూంలోకి తోసింది. రఘురామ్ ఫ్రెష్ అయి లుంగీకట్టుకుని వచ్చాడు. కంచంలో వేడివేడి పదార్థాలు వడ్డించింది సుధ. రఘురామ్ ఆమెనే కోరికగాచూస్తూ భోజనం చేయసాగాడు. ఈరోజు ఆమె అలంకరణ అతన్ని కవ్విస్తోంది. కొంతకాలంగా తాను ఆమెను పట్టించుకోవటంలేదని గుర్తుకొచ్చింది. ఈవేళ మరుపురానిరోజు కావాలనుకున్నాడు. తొందరగా రమ్మని చెప్పి పడకగదివైపు అడుగువేసి హఠాత్తుగా పొట్ట పట్టుకుని కూలబడ్డాడు.

సుధ కంగారుగా అతని దగ్గరికి వచ్చింది.

"పొట్టలో మంట" అన్నాడు బాధతో. సుధ అతడిని మంచం దగ్గరకు తీసుకెళ్ళి పడుకోబెట్టింది. రఘురామ్ బాధతో మెలికలు తిరుగుతూ, పొట్ట పట్టుకుని "మంట... మంట.." అని గిలగిలా తన్నుకున్నాడు. కొద్దిసేపటికి అతని శరీరం కట్టెలా బిగుసుకుపోయింది. అప్పటివరకు మంచం దగ్గరే నిలబడిన సుధ హాయిగా నిట్టూర్చింది. వెంటనే అతడి మెడ వరకు దుప్పటికప్పి హాల్లోకి వచ్చింది. సోఫాలో కూర్చొని నిమిష నిమిషానికి గోడగడియారంవైపు, తలుపులవైపు ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టు మార్చి మార్చి చూస్తోంది. అర్ధరాత్రి గడిచినా ఆ వ్యక్తి రాకపోవటంతో ఆమెలో భయం మొదలైంది.

చూస్తుండగానే తెల్లవారింది. భయంతో వణికిపోయింది సుధ. ఇంటికి తాళంవేసి ఆటోలో ఆ వ్యక్తి ఇంటికి బయలుదేరింది. ఆటో ఆ ఇంటికి పాతిక గజాల దూరంలో ఉండగానే ఆ ఇంటిముందు గుమిగూడిన జనాన్నిచూసి ఆటోను ఆపింది. ఇంటి ముందు పోలీస్‌జీపు కనిపించగానే ఆమె మనస్సు కీడు శంకించింది. పోలీసులు ఆ ఇంట్లోంచి ఓ స్త్రీకి బేడీలువేసి తీసుకొచ్చి జీపు ఎక్కించారు. ఆ దృశ్యం చూడగానే సుధ కాళ్ళకింద నేల కంపించినట్టయ్యింది. అక్కడి జనం మాటలు విన్నాక విషయం అర్థం అవగానే ఆమెకు మతిపోయినట్లైంది. పొంగుకొస్తున్న దుఃఖంతో అదే ఆటోలో ఇంటికి తిరిగొచ్చింది. రఘురామ్ శవందగ్గర కూర్చుని గుండెలు పగిలేలా విలపించింది. చివరికి ఒక నిర్ణయానికి వచ్చినట్టు లేచి నేరుగా పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ సింగ్ ముందు ఏడుస్తూ జరిగినదంతా చెప్పింది.

**ఆమెను మోహించాడతను. ఎలాగైనా చేరువకావాలనుకున్నాడు. ఆమె ఇంటికెళ్ళిన ప్రతిసారీ ఆమెకేసి ఆబగా చూసేవాడు. అతడి భావాల్ని ఎప్పుడో పసిగట్టిందామె. లోలోపలే తెగ మురిసిపోయేది. సరైన సమయంకోసం ఎదురుచూసి, అనుకున్నట్టుగానే ఆమెను సొంతం చేసుకున్నాడు. తానొకటి తలిస్తే దైవం మరొకటి తలిచిందన్నట్టుగా అదే సమయంలో మరొకచోటకూడా అచ్చం ఇలాగే జరిగింది...! దాని పర్యవసానమేంటి?**

ఇన్‌స్పెక్టర్ సింగ్ ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు.

వెంటనే సుధను తీసుకుని పోలీస్ బలగంతో ఆమె ఇంటికివచ్చి, రఘురామ్ శవాన్ని స్వాధీనం చేసుకున్నాడు సింగ్. ఆమెపై కేసు నమోదు చేశాడు. ఇంతకీ సుధ తన భర్త రఘురామ్‌ను ఎందుకు చంపింది? భర్తను హత్యచేసిన సుధ ఎవరి ఇంటికి వెళ్ళింది? పోలీసులు అక్కడ అరెస్టు చేసిన ఆ స్త్రీ ఎవరు? ఆమెను ఎందుకు అరెస్ట్ చేశారు?

***

పోలీసు విచారణలో సుధ జరిగినదంతా మరొకసారి వివరంగా చెప్పింది.

మోహన్, హిమబిందు భార్యాభర్తలు. వారికి మూడేళ్ళ కొడుకున్నాడు. ఒక ప్రైవేట్ ఫర్మ్‌లో మోహన్ క్లర్క్‌గా పనిచేస్తున్నాడు. రఘురామ్ కూడా అదే ఫర్మ్‌లో పని చేస్తున్నాడు. ఇద్దరూ సమవయస్కులే. దాంతో తొందరగా స్నేహితులైపోయారు. ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరిగింది. దాంతో కుటుంబసమేతంగా సెలవు రోజుల్లో సినిమాలు, షికార్లకు వెళుతూ ఎంజాయ్ చేసేవారు.

రఘురామ్, సుధ అన్యోన్య దంపతులు. పెళ్ళై నాలుగేళ్ళైనా పిల్లలులేరు. వాళ్ళకి అదొక్కటే కొరత. పిల్లలు కలగలేదని సుధ మనసులో కుమిలిపోయేది. భర్త కంట పడకుండా దుఃఖించేది. రఘురామ్, మోహన్ తరచూ ఒకరిళ్ళకు మరొకరు ఏదో ఒక పనిమీద వచ్చివెళుతుండేవారు. ఆ సమయంలో రఘురామ్‌కి తెలియకుండానే అతడి మనస్సులో హిమబిందుపట్ల ఆకర్షణ ఏర్పడింది. తప్పు, తప్పు అనుకుంటూనే ఆమెమీద కోరిక పెంచుకున్నాడు.

మూడేళ్ళ వయసుగల కొడుకున్నాగానీ, హిమబిందు చక్కని అవయవ సౌష్ఠవంతో అందంగా ఆకర్షణీయంగా ఉండేది. దాంతో ఆమె రఘురామ్ మనస్సులో గాఢంగా తిష్ఠవేసుక్కూర్చుంది. మోహన్‌కోసం ఇంటికి వెళ్ళిన ప్రతీసారి రఘురామ్ ఆమెను కళ్ళార్పకుండా చూసేవాడు. హిమబిందు అతడి చూపుల్ని ఎప్పుడో అర్థం చేసుకుంది. మొదట్లో కోపగించుకున్నా, బిడ్డకు తల్లినైన తర్వాత కూడా అతడిని ఆకర్షిస్తున్నందుకు గర్వపడింది. తనను కోరుకుంటున్న రఘురామ్ మీద హిమబిందుకు అభిమానం కలిగింది. వారిద్దరిమధ్య రోజురోజుకు ఆకర్షణ పెరగడంతో వాళ్ళిద్దరూ దగ్గర కావాలనుకున్నారు.

అలా ఒకరోజు మోహన్ ఆఫీసులో ఉన్న సమయంలో రఘురామ్ ఏదో పని ఉన్నట్టు సెలవు



పెట్టి నేరుగా మోహన్ ఇంటికి వచ్చాడు. కొడుకు స్కూలుకు వెళ్ళాడు. హిమబిందు ఒక్కతే ఇంట్లో ఉంది. అతడిని చూడగానే హిమబిందు ఉలికిపడింది.

మరుక్షణం ఆమె మనస్సు ఆనందంతో పొంగిపోయింది. భర్తలేని సమయంలో అతను వచ్చిన ఉద్దేశం గ్రహించి ఆమె ఒళ్ళు పులకరించింది. "మీ స్నేహితుడు ఇంట్లో లేరు" అంది మెల్లగా. "నాకు తెలుసు" అన్నాడు నవ్వుతూ.

"మరి ఎందుకు వచ్చారు?" అంది చిలిపిగా.

"నీకు తెలియదా?" అన్నాడు నవ్వుతూ.

"నాకేం తెలుసు? ఏం కావాలి మీకు?" అంది కొంటెగా.

"నువ్వే కావాలి" అంటూ రఘురామ్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"నన్నేం చేసుకుంటారు?" అంది కింది పెదవి మునిపంటితో కొరుకుతూ.

"ఏం చేసుకుంటానో చూద్దువుగానీ" అంటూ రఘురామ్ ఆమెను సమీపించాడు.

చప్పున ఆమెను తన కౌగిలిలో బంధించాడు. ఆమె ముఖాన్ని ముద్దులతో నింపేశాడు.

హిమబిందు ఒళ్ళు పులకరించిపోయింది. అతను ఆమెను మెల్లగా నడిపించుకుంటూ బెడ్రూంలోకి తీసుకెళ్ళాడు. మంచంమీద పడుకోబెట్టి, ఆమెను ఆక్రమించుకున్నాడు. తమకంతో హిమబిందు అతడిని పెనవేసుకుపోయింది.

***

అప్పటినుంచి వారిమధ్య రహస్య సంబంధం కొనసాగింది. ఈ కొత్త సంబంధం కారణంగా రఘురామ్‌కు సుధ మీద ఆసక్తి తగ్గింది. ఆమెపట్ల నిరాసక్తంగా ఉండటంతో సుధ మానసికంగా కృంగిపోయింది. తను తల్లి కాలేకపోవటమే దీనంతటికీ కారణమనుకుంది. అందువల్లే తన భర్తకు తనమీద కోరిక తగ్గిపోయిందని ఊహించుకుంది.

సుధ ఎప్పుడూ విచారంగా ఉండేది. అప్పుడప్పుడు రఘురామ్ ఇంటికివస్తున్న మోహన్ విచారంగా ఉన్న సుధను చూసి జాలిపడేవాడు. బహుశా పిల్లలు లేకపోవడం ఆమె విచారానికి కారణమనుకున్నాడు. రోజురోజుకు ఆమెపట్ల జాలి అభిమానంగా మారింది. తన చేతల్లో, మాటల్లో ఆ అభిమానాన్ని అప్పుడప్పుడు ఆమెకు తెలియజేయటానికి ప్రయత్నించేవాడు. భర్త అనురాగానికి దూరమైన సుధ తొందర్లోనే మోహన్‌కు దగ్గరైంది. ఒకరోజు రఘురామ్ ఆఫీసులో ఉండగా మోహన్ సెలవుపెట్టి రఘురామ్ ఇంటికి వచ్చాడు. భర్త అనాదరణతో కృంగిపోయిన సుధ, అభిమానపూర్వకమైన పలకరింపు, ప్రేమ పూర్వకమైన స్పర్శకోసం ఎదురుచూస్తోంది. అలా మోహన్‌కు తన శరీరాన్ని అప్పగించేసింది. అప్పటి నుంచి వాళ్ళిద్దరి మధ్య సంబంధం కొనసాగింది. సుమారు ఎనిమిదినెలలపాటు ఈ జంటల మధ్య రహస్యంగానే సంబంధాలు కొనసాగాయి.

***

"సుధా, ఇలా ఎన్నాళ్ళు దొంగచాటుగా? నువ్వు ఎలాగూ రఘురామ్‌తో సంసారం చేయలేవు. నేను నిన్ను వదులుకోలేను. ఒకవేళ నీకు ప్రెగ్నెన్సీ వస్తే రఘురామ్‌కు అనుమానం రావచ్చు. అప్పుడు పరిస్థితి ఎలా ఉంటుందో చెప్పలేం. అంతవరకు రాకుండా మనం పెళ్ళి చేసుకుంటే బాగుంటుంది" అన్నాడు మోహన్ ఒకరోజు.

"రఘురామ్ ఒప్పుకుంటాడా? మీ ఆవిడ ఒప్పుకుంటుందా?" అంది సుధ.

"మా ఆవిడ విషయం నాకు వదిలెయ్. ఆమెను ఎలా వదిలించుకోవాలో నాకు తెలుసు. రఘురామ్ సంగతే ఆలోచించాలి" అన్నాడు సాలోచనగా.

ఇద్దరూ కొద్దిసేపు ఆలోచనలో మునిగిపోయారు.

ఆ తరువాత మోహన్ చెప్పిన ప్లాన్ విని సుధ భయంతో వణికిపోయింది. మోహన్ నచ్చచెప్పాక చివరికి తలూపింది. మరుసటిరోజు అతను ఆమెను కలుసుకున్నపుడు "ఈ రాత్రికే" అని చెప్పి ఆమె చేతికి ఒక సీసా ఇచ్చాడు. రఘురామ్ చనిపోయాక అర్ధరాత్రి తను వచ్చి అతడి శవాన్ని మాయం చేస్తానని చెప్పాడు. ఆ సాయంత్రం సుధ తలస్నానం చేసి ఆకర్షణీయంగా తయారైంది. పడకగది కూడా అలంకరించింది. భార్య అలంకరణ చూసి రఘురామ్‌లో కోరిక పుట్టింది. కౌగలించుకున్నాడు. "ముందు భోజనం, ఆ తర్వాతే అది..." అంది సుధ. భోజనం వడ్డించింది. అతను భోంచేసి పడకగది వైపు అడుగు వేస్తూ పొట్ట పట్టుకుని మంట.... మంట అంటూ ఆహారంలో కలిపిన విషానికి బలైపోయాడు.

అదేరోజు సాయంత్రం చిత్రంగా మరో సంఘటన ఏం జరిగిందంటే...

మోహన్‌ను శాశ్వతంగా అడ్డు తొలగించుకునే పథకాన్ని హిమబిందుకు వివరించాడు రఘురామ్. భోజనంలో పెట్టమని విషం ఆమెచేతికిచ్చాడు. అర్ధరాత్రి తను వచ్చి శవాన్ని మాయం చేస్తానన్నాడు. విషాహారం తిన్న మోహన్ మరణించాడు. ఇక్కడ హిమబిందు రఘురామ్ కోసం ఎదురుచూస్తుంటే, అక్కడ సుధ మోహన్‌కోసం ఎదురుచూస్తోంది. కానీ తానొకటి తలిస్తే దేవుడు మరొకటి తలుస్తాడన్నట్టు హిమబిందు, రఘురామ్ ఆ సాయంత్రం మాట్లాడుకున్న మాటలు పొరుగింటి మహిళ విన్నది.

జరగబోయే ఘోరాన్ని ఎలాగైనా ఆపాలి, ఎలా? అనుకుంది. ఎవరికిచెప్పాలో ఆమెకు అర్థం కాలేదు. నైట్‌డ్యూటీకెళ్ళిన భర్త ఉదయం వరకు రాడు. పోలీసులకు చెప్పడానికి ఆమెకు భయం వేసింది. బిక్కుబిక్కుమంటూ ఇంట్లోనే ఉండిపోయింది. ఉదయం భర్త రాగానే విషయం చెప్పింది. అతను వెంటనే పోలీసులకు తెలియజేశాడు. పోలీసులు మోహన్ ఇంటికివచ్చి అతడి శవాన్ని స్వాధీనం చేసుకుని, హిమబిందును అరెస్ట్ చేశారు. అదే సమయంలో ఆటోలో వచ్చిన సుధ తన ప్రియుడు మరణించాడని తెలిసి నిర్ఘాంతపోయింది. ఒకేసారి భర్తను, ప్రియుడిని పోగొట్టుకున్న సుధ డిప్రెషన్‌తో, నేరుగా వెళ్ళి పోలీసులకు లొంగిపోయింది.

***

అలా రఘురామ్, మోహన్ ఇద్దరూ కట్టుకున్న భార్యల చేతుల్లోనే హతులయ్యారు.

సుధ, హిమబిందుల జీవితాలు రెంటికీచెడిన రేవడయ్యాయి.

—సూర్యనేత్ర






**మేధ–017**
సలీం
ధర: 35 రూపాయలు
పేజీలు: 64



**షహీన్**
జి.రవికిరణ్
ధర: 30 రూపాయలు
పేజీలు: 56



**నల్లమలలో....**
శాఖమూరి శ్రీనివాస్
ధర: 30 రూపాయలు
పేజీలు: 54



**రామదండు**
అనురాధ (సుజలగంటి)
ధర: 35 రూపాయలు
పేజీలు: 72



**బబచి తాతయ్య**
పుట్టగుంట సురేష్ కుమార్
ధర: 20 రూపాయలు
పేజీలు: 40



**కిట్టూ సాహసం**
డా.రావెళ్ళ శ్రీనివాసరావు
ధర: 20 రూపాయలు
పేజీలు: 36



**ఉనిమా లోకంలో...**
పి.ఎస్.ఎస్.ఎన్.మూర్తి
ధర: 20 రూపాయలు
పేజీలు: 32



**కోతులదాడి–శీను తెలివి**
వాసంతి
ధర: 20 రూపాయలు
పేజీలు: 34



**e–తరం కుర్రాడు**
నారంశెట్టి ఉమా మహేశ్వరరావు
ధర: 35 రూపాయలు
పేజీలు: 64



**మామయ్యతో కిట్టూ సాహసయాత్ర**
కంచనపల్లి వేంకట కృష్ణారావు
ధర: 22 రూపాయలు
పేజీలు: 40



**గుడ్డేళ్ళగుమ్మి మారెమ్మ**
భూపాల్
ధర: 40 రూపాయలు
పేజీలు: 80

ప్రచురణ: ప్రతులకు తానా ప్రచురణలు, మంచి పుస్తకం, 12–13–439, వీధి నెం 1, తార్నాక, సికింద్రాబాద్–17 ఫోన్: 94907 46614 ఈ మెయిల్: info@manchipustakam.in

పిల్లల సాహిత్యం సృష్టించేందుకు తానా, మంచిపుస్తకం సంయుక్తంగా నిర్వహించిన బాల సాహిత్య పోటీ–2017లో బహుమతి పొందిన పదకొండు పుస్తకాలే ఇవన్నీ.

పది సంవత్సరాలు పైబడిన పిల్లలను ఉద్దేశించి రచయితలు రాసిన ఈ కథలు ఈ కాలానికి తగ్గట్టుగా ఉన్నాయి. ఇందులో ప్రముఖ రచయిత సలీం రాసిన 'మేధ–017', పి.ఎస్.ఎస్.ఎన్.మూర్తి రాసిన 'ఉనిమాలోకంలో...' పుస్తకాలు రెండూ కాల్పనిక విజ్ఞానం కాగా, మిగిలిన పుస్తకాలన్నీ పిల్లల సాహస కథలే. యంత్రాలు మనుషుల్లా ఆలోచించడం ప్రమాదమనీ, మనిషిలా ఆలోచించే రోబోలు ఉండకూడదనీ చెప్పే కథ 'మేధ–017'. మెరుపుతాకిడికి ఒక తండ్రీకొడుకులు ఉనిమాలోకం చేరుకుంటారు. అక్కడ వారేం చేశారు, తిరిగి వారు భూలోకం చేరుకున్నారా? లేదా? అనేదే రెండోపుస్తకం కథ. చరణ్, చింటూ సెలవులకు అమ్మమ్మగారింటికెళ్ళి అక్కడ రామదండు తయారుచేస్తారు. ఆ దండు చేసే సాహసాలే అనురాధ రాసిన రామదండు కథ. భయస్థుడైన కుర్రాడు తేజ 'బబచి' చిట్కా ద్వారా చేసిన సాహసాలే ఈ కథ. ఇంతకీ బబచి అంటే ఏమిటో తెలుసుకోవాలంటే కథ చదవాల్సిందే. మామయ్యతో కలిసి కిట్టూ ఒక ఓడలో కందర్పద్వీపం చేరుకుని స్మగ్లర్ల ఆటకట్టించడమే 'మామయ్యతో కిట్టూ సాహసయాత్ర' పుస్తకం. నల్లమల సఫారీకి వెళ్ళి పాఠశాల విద్యార్థి చైతూ తోటి పిల్లలకంటే దూరంగా వెళ్ళి దారితప్పి, చెంచుబాలుణ్ణి కలుస్తాడు. వారిద్దరూ చేసిన సాహసాలే 'నల్లమలలో...' కథ. సెలవుల్లో రైలు పట్టాల దగ్గర ఆడుకునే ఒక పిల్లాడు చేసిన సాహసమే 'కిట్టూ సాహసం' కథ. ఇంట్లోకి జొరబడిన కోతులను తరిమేందుకు పిల్లలు చూపిన నిబ్బరం, వారి సమయస్ఫూర్తిని చెప్పే కథనమే 'కోతులదాడి–శీను తెలివి' కథ.

మేకలమందను అడవుల్లోకి తోలుకెళ్ళే పదేళ్ళ పిల్ల మారెమ్మ. అడవుల్లో ఆమె ఎదుర్కొన్న సవాళ్ళు, చిరుతపులి ఎదురైనప్పుడు మారెమ్మ ఏం చేసింది అనే విషయాల్ని అచ్చమైన తెలంగాణ భాషలో ఆసాంతం చదివించే 1950 ల నాటి తెలంగాణ పల్లెజీవితం కథ. రైలు దొంగల ఆట కట్టించిన నవతరం పిల్లల ప్రతినిధి రవి కథే 'e–తరం కుర్రాడు'. సైనికుడైన తండ్రి దగ్గర మార్షల్ ఆర్ట్స్ నేర్చుకున్న పన్నెండేళ్ళపిల్ల షహీన్ తిరుగుబాటుదార్లపై ప్రజలతో కలిసి చేసిన పోరాటకథ 'షహీన్'. సిరియా నేపథ్యంలో రాసిన కథ ఇది.

పిల్లలకు విజ్ఞానంతో పాటు సామాజిక బాధ్యత, సామూహిక తత్వాన్ని నేర్పి, వారిలో ధైర్య సాహసాలను ప్రోదిచేసే ఈ పదకొండు పుస్తకాలను విద్యార్థులు తప్పక చదవాలి.

–లలితాత్రిపుర సుందరి




## ప్రశ్న మీది – సమాధానం మాది

ఒకప్పుడు సందేహం వచ్చిందంటే పుస్తకాలు చదివో, గ్రంథాలయాల్లోనో, గురువులనో, పెద్దవాళ్ళనో అడిగి తమ సందేహాలను నివృత్తి చేసుకునేవారు. కాలంతోపాటు సాంకేతికతా పెరిగింది. తదనుగుణంగా ఆన్‌లైన్ సెర్చింగ్ బాట పడుతున్నారు. ఎవర్ని ఏ చిన్న డౌట్ అడిగినా గూగుల్ ఇట్ అంటున్నారు. ఏ చిన్న ఇన్ఫర్మేషన్ కావాలన్నా గూగుల్ సెర్చ్ చేస్తున్నారు. ఒక సందేహం తీర్చుకోవడం కోసమో, సమాచారం కోసమో సెర్చ్ ఇంజిన్‌లోకి వెళ్ళామా... ఇక వేలకొద్దీ పేజీలు ప్రత్యక్షమవుతాయి. సందేహం తీరడం మాట దేవుడెరుగు... అసలందులో ఉన్న సమాచారం ఎంతమేరకు సరైనదో, ఏది చూడాలో ఏది చూడకూడదో తేల్చుకోవడంలోనే సమయమంతా గడిచిపోతుంది. అందుకే మీ సందేహాలను మేం తీరుస్తామంటూ ఓ స్టార్టప్ పుట్టుకొచ్చింది. దానిపేరే యూడూ!




హైదరాబాద్‌కి చెందిన తేజ గుడ్లూరు దీని వ్యవస్థాపకుడు. రోజూ ఎందరో సమాధానం దొరకని ప్రశ్నలతో విసుగెత్తిపోతుంటారు. వాళ్లకోసం పక్కా ఇన్ఫర్మేషన్ ఇచ్చే ప్లాట్‌ఫాం ఏదైనా క్రియేట్ చేస్తే బాగుంటుందన్న ఆలోచనకు రూపమే ఈ యూడూ! తన ఆలోచనను ఆచరణ ద్వారా సాధ్యం చేయాలని ముందుగా యాప్ ద్వారా అడుగు ముందుకు వేశాడు తేజ. దాని ఫలితమే 2017 ఏప్రిల్లో ఐదుగురు ఉద్యోగులు, ఆరుగురు అడ్వైజర్లు, రూ.30 లక్షల పెట్టుబడితో యూడూ ప్రయాణం మొదలైంది.

యూడూ యాప్ పనితీరు చాలా సింపుల్‌గా ఉంటుంది. ముందుగా యాప్ డౌన్‌లోడ్ చేసుకుని సైనప్ అవ్వాలి. అడగాల్సిన ప్రశ్న ఏ రంగానికి సంబంధించిందో వెతికితే సరి. సంబంధిత ఏరియా నుంచి ఒక ఎక్స్‌పర్ట్ ఫోన్ ద్వారా మీకు అందుబాటులోకి వచ్చి, మీ ప్రశ్నకు సరైన సమాధానం ఇస్తాడు. అంతేకాదు మీకు సంపాదించుకునే అవకాశం కూడా ఇస్తోంది ఈ యూడూ యాప్. మీరు ఏదైనా రంగంలో నిష్ణాతులైతే ఎక్స్‌పర్ట్ ప్యానెల్లో చేరచ్చు. కొంత పర్సంటేజ్ కూడా ఇస్తారు. కెరీర్ కౌన్సెలింగ్, రిలేషన్‌షిప్స్, ఫ్యాషన్, పెట్స్ ఇలా 25 రంగాలకు చెందిన ఎంతోమంది నిపుణులు అడ్వైజరీ పానెల్లో ఉన్నారు. యూజర్ల ప్రైవసీని పక్కాగా మెయింటైన్ చేస్తారు. టూరిజం, వ్యవసాయం, స్కిల్ డెవలప్‌మెంట్ రంగాల్లో యాప్‌ని బలంగా ముందుకు తీసుకుపోవాలని తేజ భావిస్తున్నాడు. కొన్ని గ్రూపుల సాయంతో కౌన్సెలింగ్ నిర్వహించి రైతుల ఆత్మహత్యలు ఆపాలని లక్ష్యంగా పెట్టుకున్నాడు. బావుంది కదూ! ఇటు మీ సందేహాలు నివృత్తి అవుతాయి, అటు మీకు సంపాదనా మార్గం కూడా లభిస్తుంది.

–లక్ష్మీశ్రీనర్మద

## లిపిడ్ ప్రొఫైల్

లిపిడ్స్ అనేవి కొన్ని రకాల కొవ్వులు మరియు కొవ్వు లాంటి పదార్థం. అవి కణాలు మరియు శక్తి యొక్క మూలాలకు ముఖ్యభాగాలుగా ఉన్నాయి. మారుతున్న జీవనశైలి, పెరుగుతున్న శారీరక, మానసిక ఒత్తిడి, ఆహారపు అలవాట్లలోని మార్పుల వల్ల జీవప్రక్రియలో మార్పులు జరిగి తద్వారా మానవ శరీరంలోని రోగనిరోధకశక్తితగ్గి రకరకాలవ్యాధులు వస్తున్నాయి. జీవన విధానంలో కృత్రిమ ఆహారాలు, మద్యపానం వంటి అలవాట్లు, శారీరక క్రమ తగ్గటం ద్వారా జీర్ణ వ్యవస్థలో అసమతూల్యత ఏర్పడుతుంది. ఈ పరిణామాల వలన వచ్చే సమస్యలో ఒకటి ఈ కోలెస్ట్రాల్, ఆరోగ్యకరమైన లిపిడ్ లెవెల్స్ ఒక ఆరోగ్యకరమైన గుండె కొనసాగించటానికి సహాయ పడతాయి. హైడెన్సిటీ లెపోప్రోటీన్ కొలెస్ట్రాల్, లోడెన్సిటీ లైపోప్రోటీన్ కోలెస్ట్రాల్, ట్రిగ్లైజరాయిడ్స్ మొత్తం కొలెస్ట్రాల్ లిపిడ్ ప్రొఫైల్ యొక్క రకాలు. గుండె జబ్బులబారిన పడుతున్న వారి సంఖ్య రోజురోజుకీ పెరుగు తుండటంతో ఇటీవలికాలంలో చాలామంది కొలెస్ట్రాల్‌పై దృష్టి కేంద్రీకరిస్తున్నారు. లిపిడ్ ప్రొఫైల్ అనే పరీక్ష కోలెస్ట్రాల్ ట్రిగ్లైజరైడ్స్, H.D.L, L.D.L ఎంత మోతాదు లో ఉన్నది తెలుసు కోవచ్చు. **1.మొత్తం కొలెస్ట్రాల్:** ఈ పరీక్ష ద్వారా లిపోప్రోటీన్ రేణువులోని అన్ని కొలెస్ట్రాల్ గురించి తెలుసు కోవచ్చు. **2.హైడెన్సిటీ లైపోప్రోటీన్ కొలెస్ట్రాల్:** ఈ పరీక్ష ద్వారా హైడెన్సిటీ లైపోటీన్ రేణువులోని కొలెస్ట్రాల్ గురించి తెలుసుకోవచ్చు. దీన్ని మంచి కొలెస్ట్రాల్ అని కూడా అంటారు. దీని సాధారణ విలువ 40-60 మధ్యన ఉండాలి. అరవైకన్నా ఎక్కువ ఉంటే గుండెలోని రక్త నాళాల్లో కొవ్వు చేరకుండా చేస్తుంది. ఇది అధిక కొలెస్ట్రాల్ గుండెలోని రక్తనాళాల్లో కొవ్వు చేరకుండా చేస్తుంది.ఇదిఅధికకొలెస్ట్రాల్ తొలగిస్తుంది. మరియు తొలగింపు మరియు తొలగింపు కోసం వాటిని పెద్దమొత్తంలో కాలేయంలోకి తీసుకువెళు తుంది. **3. లోడెన్సిటీ లైపో ప్రోటీన్ కొలెస్ట్రాల్:** ఇది లోడెన్సిటీ లైపో ప్రోటీన్ రేణువుల కొలెస్ట్రాల్ లెక్కిస్తుంది. దీన్ని చెడు కొలెస్ట్రాల్ అని కూడా అంటారు. దీని సాధారణ విలువ 140–150mg/dl లోపుఉండాలి. L.D.L-C మొత్తం కొలెస్ట్రాల్, H.D.L-C మరియు ట్రిగ్లీజరైడ్స్ ఫలితాలు ఉపయోగించి లెక్కించ బడుతుంది. **4.ట్రిగ్లీజరైడ్స్:** ఇది అన్ని లైపోప్రోటీన్ రేణువులలోని అన్ని ట్రిగ్లీజరైడ్స్‌ను కొలుస్తుంది. అది తక్కువ సాంద్రత లైపోప్రోటీన్‌లో ఉంది.




**లిపిడ్ ప్రొఫైల్ టెస్టులు ఎడురకాలు అవి.** 1.మొత్తం లిపిడ్స్ 2.సీరమ్ మొత్తం కొలెస్ట్రాల్ 3.సీరమ్ H.D.L కొలెస్ట్రాల్ 4.మొత్తం కొలెస్ట్రాల్ /H.D.L నిష్పత్తి 5.సీరమ్ ట్రిగ్లిజరైడ్స్ 6. సీరమ్ ఫాస్ఫోలిపిడ్లు



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

7.విద్యుత్ అంశికరణ ఇది ఈ క్రింది వాటి యొక్క శాతం నిర్ణయించబడుతుంది. A. కైలో మైక్రాన్స్, B. లోడెన్సిటీ లైపోప్రోటీన్, C. చాలా తక్కువ సాంద్రత, D. హైడెన్సిటీ లైపో ప్రోటీన్, **హోమియో చికిత్స:** కొలెస్ట్రాల్ తగ్గించడానికి హోమియోపతిలో మంచి మందులున్నాయి. దీనికి సాధారణంగా వాడే మందులు కల్కేరియా కార్బ్, ఫ్యూకస్, పైటో లిక్కా కొలెస్ట్రినమ్, గ్రాఫైటీస్, కాక్టస్, రాపుల్ఫియా, సర్పెంటైనా మొదలైనవి అవే కాకుండా నిపుణులైన వైద్యుల పర్యవేక్షణలో సరైన హోమియో మందులను క్రమం తప్పకుండా వాడితే దీనికి మంచి పరిష్కారం లభిస్తుంది. హోమియోపతి వైద్యవిధానంలో కాన్స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ ద్వారా మంచి ఫలితం ఉంటుంది. శారీరక, మానసిక, వ్యక్తిగత లక్షణాలను పరిగణలోకి తీసుకొని శాస్త్రీయపద్ధతిలో వైద్యం చేయుటం ద్వారా వ్యాధి మూలంనుండి నివారించబడి శాశ్వత పరిష్కారం దానికి లభిస్తుంది. వంశపారంపర్యంగా ఉన్న జబ్బులకి కూడా దీని ద్వారా చక్కని ఫలితాలుఎటువంటిసైడ్‌ఎఫెక్ట్స్ లేకుండా లభిస్తాయి.

**www.starhomeopathy.com** | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | **90300 64224**

## సంతానలేమికి పరిష్కారాలు

**భార్యాభర్తల్లో ఇద్దరూ సంవత్సరం పాటు ఎలాంటి నిరోధక మందులూ వాడనప్పటికీ సంతానం కలగకపోతే దాన్ని సంతానలేమిగా నిర్ధారించవచ్చు. కొన్నిసందర్భాల్లో కారణం ఏంటన్నది తెలుసుకోవడం సాధ్య కాదు. దాదాపు 10-20% మంది ఇలాంటి సమస్యతో బాధపడుతున్నారు. అయితే ఇక ముందు సంతానలేమితో బాధపడాల్సిన అవసరం లేదనీ, 'ఫర్టి9'లో ప్రముఖ ఫర్టిలిటీ స్పెషలిస్టు డాక్టర్ సి.జ్యోతి.**

కారణాలు తెలియని సంతానలేమిని వైద్యపరిభాషలో 'అన్ ఎక్స్ ప్లెయిన్డ్ ఇన్‌ఫెర్టిలిటీ' అంటారు. దంపతులిద్దరిలోనూ ఎటువంటిలోపం లేనప్పటికీ సంతానం కలగదు. స్త్రీలలో అండాలు క్రమంతప్ప కుండా తయారవుతూ ఉంటాయి. ఎండోమెంట్రియాసిస్ లాంటి సమస్యలేమి ఉండవు. ఫెలోపియన్‌ట్యూబులు ఆరోగ్యంగా తెరుచుకుని ఉంటాయి. పురుషుల్లోవీర్యకణాలఉత్పత్తి సాధార ణంగానే ఉంటుంది. అండోత్పత్తి సమయంలో కూడా శృంగారంలో పాలొంటూ ఉంటారు. పోస్ట్ కాయిటల్ పరీక్ష నార్మల్ అని వస్తుంది కానీ సంతానం మాత్రం కలగదు. **కారణాలు: వీర్యకణాల లోపం:** వీర్యకణాలు ఉండాల్సిన దానికన్నా ఎక్కువగా ఉన్నా, తక్కువగా ఉన్నా సమస్యే. అంతేకాకుండా, వీర్యకణాలు అండంలోకి చొచ్చుకునిపోలేకపోవడం మరో కారణం. **ట్యూబల్ బ్లాక్:** అండోత్పత్తి సమయంలో ఫింబ్రియాలు అండాన్ని తోసుకునే ప్రక్రియలో కొన్నిసమస్యలు ఉండొచ్చు లేదాట్యూబల్‌సీలియా సరిగాపనిచేయకపోవచ్చు.**అండోత్పత్తి లోపం:**నాణ్యతలేని, అబ్‌నార్మల్‌గాఉన్న అండాలు ఎక్కువ సంఖ్యలో ఉత్పత్తి కావడం.అండాలకు సంబంధించిన మరో కారణం ల్యుటినైజ్డ్ అన్‌రప్చర్డ్ ఫాలికల్‌సిండ్రోమ్.క్రోమోజోమ్‌లనిర్మాణం లోపాలుంటాయి. అండం ఆరోగ్యంగాఉన్నప్పటికీ అండంవిడుదలై కార్పస్ ల్యుటియమ్ ఏర్పడే ముందు అండం అందులో ఇరుక్కుపోతుంది. మైకోప్లాస్మా,కాండిడియాలాంటి ఇన్ఫెక్షన్లు కూడా అన్‌ఎక్స్‌ప్లెయిన్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి కారణాలు. **వ్యాధి నిరోధక శక్తి ప్రభావం:**వీర్యకణాలు లేకపోయినా, అవి చనిపోయినా అండం విడుదల కావడానికి వీర్యంపైన వ్యాధినిరోధక వ్యవస్థ వ్యతిరేక ప్రభావం చూపుతుంది. అంటే వీర్యకణాలు స్తంభింపచేయడానికి ఒకదానికొకటి అతుక్కుపోవడానికి దోహదంచేస్తుంది. మహిళల్లోఅయితే అండాలపైనకోటింగ్ ఏర్పడుతుంది.దాంతో వీర్యకణాలు వచ్చినప్పటికీఅతుక్కోవు. అండాశయంనుండి విడుదలైన తరువాత దశను ల్యూటియల్‌దశ అంటారు. ఈ దశలో కొన్ని సమస్యలు కారణం కావచ్చు అందులో కార్పస్‌ల్యుటియల్ ప్రొజెస్టిరాన్ అనే హార్మోన్‌లను విడుదలచేస్తుంది. ఈ హార్మోన్‌ఎండో మెట్రియమ్ ఫలదీకరణంచెందిన అండాన్ని తీసుకోవడానికి సహాయపడు తుంది. కొన్నిసార్లు ఎండో మెట్రియం లోనే సమస్యఉండవచ్చు. **గర్భాశయ కారణాల వల్ల సంతానలేమి:** కొందరు స్త్రీలలో ఎండోమెట్రియంలో లోపం ఉంటుంది. పిండంగర్భాశయ గోడలకు అతుక్కో వడాన్ని కనుక్కోవడం చాలా కష్టం. కొన్ని పరీక్షలద్వారా నిర్ధారించాలి. గర్భాశయానికి సమపాళ్లలో రక్తం అందక పోవడం. ఈస్ట్రోజన్ లిన్‌ఫ్లార్లు సరిగా లేకపోవడం వల్ల ఇలా జరుగుతుంది. **పరిష్కారం:** పోలికల్ నాణ్యత పెంచుతుంది. ప్రొజెస్టిరాన్ కూడా చికిత్సగా ఉపయోగపడుతుంది. దీన్ని ఇంజెక్షన్లుగా ఇవ్వవచ్చు. అసిస్టెడ్ రిప్రొడక్టివ్ టెక్నాలజీద్వారా మంచి ఫలితాలు పొందవచ్చు. ట్యూబులోపాలు, వీర్యకణాలు చొచ్చుకు పోలేక పోవడానికి ఐ.వి.ఎఫ్‌లో మంచి పరిష్కారం దొరుకుతుంది. **ఐ.యు.ఐ:** భర్త నుండి సేకరించిన వీర్యాన్ని పరీక్షించిదానిలోనుంచి ఆరోగ్యంగామరుగ్గా ఉన్నకణాలను వేరుచేసి వాటిని ఒక సన్ననిగొట్టంద్వారా స్త్రీగర్భాశయంలోకిప్రవేశపెడతారు. ఇలా ఒకనెలలో చేస్తే 15% సంతానం కలిగే అవకాశాలు ఉంటాయి. ఇలా ఆరు చక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితంలేకుంటే... ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించ వచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుండి సేకరించిన అండాల్లోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యులేటర్‌సహాయం తో ప్రవేశపెట్టి ఫలదీకరణంచెందిస్తారు. వాటినితిరిగి గర్భా శయంలో పెడతారు. ఈ పద్ధతిద్వారా 40% విజయావకా శాలుంటాయి. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్న వారికి ఎక్కువ ఉపయోగం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ విధానం అంటారు. ముందుగా స్త్రీనుంచి పక్వమైన అండాలను బయటకు తీసి, పురుషుడి శుక్రకణాలలో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో 2-3 తిరిగి స్త్రీగర్భాశయంలో ప్రవేశ పెడతారు. దీనిద్వారా 30- 35% విజయావకాశా లున్నాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన వాటిని అతి శీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత ఉపయోగిస్తారు. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్రకణాలను గానీ దాతల నుంచి స్వీకరించివాడతారు. అందుకే సంతానం కలగటంలేదని ఏళ్ళ తరబడి బాధపడే వాళ్ళకు సరైన మార్గం, పరిష్కారం 'ఫర్టి 9 హాస్పిటల్'.

**– డా॥ సి.జ్యోతి** ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫర్టి 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం

ADVT

**90300 15588** | సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । సంతోష్‌నగర్ । వరంగల్ | **www.ferty9.com**

**మోహిత్ అద్దెకుంటున్న రూంలోకి చేరాక నాకు ప్రణాలి గురించి చాలా విషయాలు తెలిశాయి. ఆ అమ్మాయికి తండ్రి లేడు. బ్యాంక్‌లో పన్జేసేవాడు. ప్రణాలికి పదేళ్ళ వయసున్నప్పుడు గుండె నొప్పితో చనిపోయాడు. వాళ్ళమ్మ డిగ్రీ పాసై ఉంది. కాబట్టి ఆ ఉద్యోగాన్ని ఆమెకిచ్చారు. ప్రణాలికో చెల్లెలుంది. ఆ అమ్మాయికిప్పుడు పదహారేళ్ళు. ఇంటర్మీడియట్ చదువుతోంది.**

ప్రణాలితో ఒకట్రెండు సార్లు మాట్లాడాక నాకు అర్థమైనదేమిటంటే ఆ అమ్మాయికి జీవితం మీద సరైన అవగాహన లేదు. ఆమె ఉద్దేశంలో జీవితమంటే అందుబాటులో ఉన్న సుఖాల్ని అందుకుని అనుభవించడమే అనుకుంటోంది. మోహిత్ మనస్తత్వానికి సరిగ్గా సరిపోయే జోడి.

మా క్లాస్‌లో ఎక్కువమంది అబ్బాయిల ఉద్దేశం కూడా అదే! అమ్మాయిలు కూడా ఈ విషయంలో ఏ మాత్రం తగ్గడం లేదు.

ఓ రోజు మోహిత్ బైటికెళ్ళిన సమయంలో అతనికోసం ప్రణాలి మిద్దెమీదకొచ్చింది.



అతను లేడని తెలిసి వెళ్ళబోతుంటే "ఒక్క నిమిషం ఉండు. నీతో మాట్లాడాలి" అన్నాను.

తను నిలబడిపోయింది.

"కూచో... ప్రశాంతంగా మాట్లాడుకోవాల్సిన విషయాలు" అన్నాను.

తను నవ్వి ఓ కుర్చీ లాక్కుని కూచుంది. "నీకు జీవితం బోర్ కొడుతోంది కదా" అంది.

నేను మాట్లాడదామని కూచోబెడితే నాకంటే ముందు తను మాట్లాడినందుకు ఆశ్చర్యపోతూ "నాకు బోర్ కొడ్తోందని ఎవరు చెప్పారు?" అన్నాను.

"మోహిత్ చెప్పాడులే. నీకు గర్ల్‌ఫ్రెండ్ లేదట కదా. ఎప్పుడూ ఏదో కోల్పోయినట్టు దిగులుగా ఉంటావటకదా. ఎవరైనా అమ్మాయి దొరికితే ఆమెతో కబుర్లు చెప్పుకుంటుంటే బావుంటుందని అనుకుంటున్నావు కదా!"

"నేనేమీ అలా అనుకోవడం లేదే!"

"నిన్ను నువ్వు బాగా మభ్యపెట్టుకుంటావని కూడా మోహిత్ చెప్పాడులే. నీకేం కావాలో నీకే తెలియదనీ, అనేక అస్పష్టతల మధ్య ఊగిసలాడుతూ ఉంటావని కూడా చెప్పాడు. నా ఉద్దేశంలో నన్ను, మోహిత్‌ని చూసినప్పుడల్లా నువ్వేం కోల్పోయావో తెలుసుకుని మథన పడ్తుంటావు. అవునా? నా ఫ్రెండ్ ఒకమ్మాయి ఉంది. మీనా దానిపేరు. బావుంటుంది. మొన్ననే దాని బాయ్‌ఫ్రెండ్‌తో బ్రేకప్ అయింది. దాన్ని పరిచయం చేయనా? అదడగడానికేగా నన్ను కూచోమని చెప్పావు?"

"అలా అడుగుతానని ఎందుకు అనుకుంటున్నావు?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"సహజమే కదా! మన ఎదురుగా ఎవరైనా వేడివేడి మిరపకాయ బజ్జీలు తింటుంటే చూసినప్పుడు, ఆ వాసనలు పీల్చినప్పుడు మనక్కూడా తినాలనిపిస్తుంది. ఎక్కడలేని ఆకలి పుట్టుకొస్తుంది. నేను, మోహిత్ సరదాగా కబుర్లు చెప్పుకుంటున్న సమయంలో చాలా సార్లు నిన్ను గమనించాను. నీ చూపుల్లో ఈర్ష్య స్పష్టంగా కనిపించింది".

నాకు నవ్వొచ్చింది. తమ మధ్య నడుస్తున్న వ్యవహారం చాలా అపురూపమైందనీ, వాంఛనీయమైందనీ తను అనుకుంటోంది. అందుకే అందరూ దానికోసం అర్రులు చాస్తారన్న అపోహలో ఉంది.

"నా ఉద్దేశంలో ఇవన్నీ తుచ్ఛమైన విషయాలు. జీవితం చాలా విలువైంది. ఎండమావుల వెంటపడి దాన్ని వృథా చేసుకోవటం నాకిష్టముండదు" అన్నాను.

నావైపు జాలిగా చూసింది. "నేనూ అదే అంటున్నాను. జీవితం చాలా విలువైంది. దాన్ని అర్థం లేని ఆశయాలూ ఆదర్శాలంటూ ఎందుకు నాశనం చేసుకుంటావు? జీవితం చాలా చిన్నది. అందులో యవ్వనావస్థ మరీ చిన్నది. ఎంజాయ్ చెయ్. చేతుల్లోంచి కాలం జారిపోతే మళ్ళా వెనక్కిరాదు. ఈ విషయమే చాలాసార్లు నీతో చెప్పాలనుకున్నా. ఇన్ని రోజుల తర్వాత ఇప్పుడు నాకా అవకాశం దొరికింది" అంది.

నేను తనకు మంచేదో చెడేదో చెప్పి జీవిత విలువలు తెలుసుకునేలా ప్రయత్నిద్దామనుకుంటే తనే నాకు సుద్దులు చెప్తోంది. మోహిత్ ఆకర్షణలో పడి తీపి కబుర్లనుకుంటూ సమయం వృథా చేసుకుంటోందని జాలిగా చూసిన నా చూపుల్లో ఈ అమ్మాయికి ఈర్ష్య కనిపించింది. వాళ్ళు ఏ స్థితిలో సమయం గడుపుతున్నారో దానికోసం ఎదుటి వ్యక్తి కూడా వెంపర్లాడుతుంటాడని నమ్మే మనుషులు. అలా అనుకోకపోతే ఆత్మ తృప్తి ఉండదు. అపరాధ భావన నుంచి పారిపోయే ప్రయత్నం ఇదంతా! గిల్టీ ఫీలింగ్ గొంతు నులమాలంటే తమల్ని తాము మోసగించుకోక తప్పదు.

తను చెప్పాలనుకున్నది చెప్పింది కాబట్టి నేను చెప్పాలనుకున్నది కూడా చెప్పేయాలనుకున్నాను. "నేను మాట్లాడాలనుకున్నది ఆ విషయం కాదు. నువ్వు చేస్తున్నది తప్పని చెప్పడానికి.."

"తప్పా... నేనేం తప్పు చేస్తున్నాను?"

"మోహిత్ నా స్నేహితుడే. కాదనను. నువ్వు అతనితో నడుపుతున్న వ్యవహారం తప్పు కాదా...? మీ అమ్మకు తెలియకుండా అతనితో సన్నిహితంగా మెలగడం తప్పుకాదా..? నువ్వు తప్పు కాదనుకున్నప్పుడు మీ అమ్మకూ, చెల్లికీ తెలియకుండా చాటుమాటుగా ఎందుకు కలుస్తున్నావు?"

"మనది ఎంజాయ్ చేసే వయసు. ఇప్పుడు యూత్ అంతా చేస్తున్నది అదేగా! నేను లోకరీతికి భిన్నంగా ఏమీ ప్రవర్తించడం లేదే. నువ్వే తేడాగా ఉన్నావు. ఆడ్‌మ్యాన్ అవుట్...! ఇక అమ్మకు చెప్పటం అంటావా? సమయం వచ్చినప్పుడు తప్పకుండా చెప్తాను. ఎలాగూ చదువు పూర్తయ్యాక పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం కదా. అప్పుడు ఎలాగూ చెప్పక తప్పదుగా."

"మోహిత్ నిన్ను పెళ్ళి చేసుకుంటాడన్న నమ్మకం ఏమిటి? వాడికి చాలామంది అమ్మాయిలతో పరిచయం ఉందన్న విషయం నీకు తెలుసా?"

"తెలుసు. ఇప్పుడు నడుస్తున్న ట్రెండ్ అదేగా. ఆడపిల్లలతో తిరక్కపోతే మగాడెలా అవుతాడు?"

ఆ సమాధానం విని నిశ్చేష్టుడినయ్యాను. "మరి నిన్నే చేసుకుంటాడని ఎలా చెప్తున్నావు?"

9

# అన్వేషణ

-సలీం

"వాడికి నేనంటే పిచ్చిప్రేమ. నాకు తెలుసు... నన్ను చేసుకుంటాడు."

"వాడితో పరిచయమున్న మిగతా అమ్మాయిలు కూడా ఇలానే అనుకుంటూ ఉండి ఉంటారు. నా మాట విని ఇలాంటివి మానేయ్. బుద్ధిగా చదువుకో. మీ అమ్మకు చేదోడుగా ఉండటం నీ బాధ్యత. నీకో చెల్లెలుంది. ఆ అమ్మాయి భవిష్యత్తుని తీర్చిదిద్దాల్సిన బాధ్యత నీకూ ఉంది."

"ఓయ్... ఏ కాలంలో ఉన్నావు? బీసీలో ఉండాల్సిన వింతమనిషిలా ఉన్నావే. నేనెవరి బాధ్యతా తీసుకోవాల్సిన అవసరం లేదు. నా సుఖమూ నా సంతోషమూ చూసుకుంటే చాలు. మారాల్సింది నేను కాదు, నువ్వు. నీకు సైకియాట్రిస్ట్ అవసరం ఉంది. నీ బుర్రకి తుప్పు పట్టింది. అది వదిలించుకుంటే గాని నీకు మాలాంటివాళ్ళు అర్థం కారు" అంటూ లేచి విసవిసా వెళ్ళిపోయింది.

నిజంగానే నాలో ఏమైనా లోపం ఉందా? నా ఆలోచనాధోరణి నా ఈడువాళ్ళతో పోల్చితే ఎందుకు భిన్నంగా ఉంది? అందరూ సుఖాల వెంట, సరదాల వెంటపడి పరుగులు పెడ్తుంటే నేనెందుకు నిరాశలో, అశాంతిలో పడి దొర్లుతూ దేనికోసమో వెతుక్కుంటున్నాను? దీనిక్కారణం మా అమ్మ నా చిన్నతనంలో నన్ను నిర్దయగా వదిలి వెళ్ళిపోవటమా? నాన్న మరో స్త్రీతో శారీరక సంబంధం పెట్టుకోవటమా? ఈ రెండు సంఘటనలు స్త్రీ, పురుషుల మధ్య సహజంగా ఉండే శారీరక సంబంధాల్ని అసహ్యించుకునేలా చేశాయా?

నాన్న మరో స్త్రీతో సంబంధం పెట్టుకున్న సమయంలో ఎంతటి ఒంటరితనానికి లోనయ్యానో నాకు తెలుసు. అప్పటివరకూ నాకు అమ్మ లేకున్నా నాన్న ఉన్నాడన్న భరోసా.. నాన్న నాకోసమే బతుకుతున్నాడన్న నమ్మకం... నాన్నకు నేను, నాకు నాన్న అనుకుంటే కలిగే ఆనందం.. ఉండేవి. మొదటిసారి నాన్నకు మరొకామెతో ఉన్న సంబంధం గురించి తెలిసినప్పుడు గాజు పళ్ళెం రాతినేలమీద పడి భళ్ళున ముక్కలైనట్లు నా మనసు ముక్కలైంది. నా నమ్మకం చిన్నచిన్న శకలాలుగా పగిలిపోయింది.

అమ్మ ఎందుకలా వెళ్ళిపోయింది? నన్ను చూసుకుంటూ బతికేయవచ్చుగా. నన్ను పెంచి పెద్ద చేయటంలోనే తన సంతోషాన్ని వెతుక్కోవచ్చుగా. అది ఎక్కడో వేరే వ్యక్తి దగ్గర దొరుకుతుందని ఎందుకనుకుంది అని చాలాసార్లు బాధపడేవాడిని. నాన్న గురించి తెలిశాక కూడా అలానే అన్పించింది. నేనున్నానుగా, తన బాధనో, దుఃఖాన్నో నన్ను చూసుకుని మర్చిపోవచ్చుగా. తన ఒంటరితనాన్ని నాతో ఎక్కువ సమయం గడపటం వల్ల పోగొట్టుకోవచ్చుగా.

'అతడు తన దుఃఖాన్ని మర్చిపోవాలంటే ఓ ఆడతోడు అవసరం. కనీసం ఇప్పటికైనా మనుషుల్లో పడ్డాడు. నువ్వేమీ కల్పించుకోకు' అని పెద్దమ్మ పెదనాన్నతో అనటం గుర్తొచ్చింది.

మగాడు తన దుఃఖాన్ని తట్టుకోవాలంటే ఓ ఆడదాని సాంగత్యం తప్ప మరో దారిలేదా?

ఆడదానికి సుఖం కావాలంటే ఓ మగాడిని వెతుక్కుంటూ పోవల్సిందేనా?

నాకు ఆశ్చర్యం కలిగించిన విషయం ఏమిటంటే అమ్మ ఏ సుఖంకోసం వెంపర్లాడుతూ పోయిందో నాన్న కూడా దానినే వెతుక్కున్నాడు. కానీ సమాజం అమ్మను తప్పు పట్టినంతగా నాన్నను తప్పు

## జరిగిన కథ

రామక్రిష్ణ తల్లి వసుధ ఎవరితోనో వెళ్ళిపోతుంది. తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడు. దాంతో రామక్రిష్ణ బాధ్యతను వాళ్ళ పెదనాన్న తీసుకుంటాడు. డిగ్రీలో చేరిన రామక్రిష్ణ, మోహిత్‌తో స్నేహం చేస్తాడు. అప్పుడే శిరీష కూడా పరిచయమవుతుంది అతనికి. ఆమెతో ఎన్నో విషయాలు చర్చిస్తుంటాడు రామక్రిష్ణ. ఒకరోజు రాత్రి శిరీష ఇంట్లో పడుకున్నందుకు రామక్రిష్ణ మేనత్త, మరదలు నానా గొడవా చేస్తారు. దాంతో అతను మోహిత్ రూంకి షిఫ్ట్ అవుతాడు.

ఆ తర్వాత....




ఆమె పగలు ఆకాశపు చెట్టులో సూర్యుణ్ణి
ఒక పండుగా భావించి రాత్రికి నిద్రపోయింది!
ఉదయం తన కడుపులో పిండం కదిలింది
ఆమె కొన్నాళ్ళకు ఒక వీరుణ్ణి ప్రసవించింది!

## పూలు రాలిన చెట్టు!

ఆమె చందమామను రోజూ తదేకంగాచూస్తోంది
ఓ జోలపాట పాడినట్టు వెన్నెల కావ్యమైనట్టు కలగంది
ఆశ్చర్యం... ఒక కవికి జన్మనిచ్చి మురిసిపోయింది!

సూర్యుణ్ణి చంద్రుణ్ణి ప్రేమించని తల్లుల కడుపుల్లో
రాబందులు, కుక్కలు, నక్కలు, నాగుపాములు
సృష్టిలోని క్రూరజంతువులు, విషపు పురుగుల ఆత్మలు
కొడుకుల కూతుళ్ల రూపాల్లో ప్రవేశించాయి..
అందుకే దేశంలో ఇన్ని ద్వేషాలు... మోసాలు... స్వార్థాలు
మనుషుల రూపాల్లో... అమానుష వేషాలు...!

ఇప్పుడు.... మనుషులు ఎక్కడా కనిపించరు
ఖాళీదేహాలు... కలలు కనిపించని గాజుకళ్లు!



ఆత్మవిశ్వాసం లేని దిగులు గుండెలు!
సంతోషం తొణికిసలాడని ముఖాలే కనిపిస్తాయి
పూలురాలిన చెట్టులాగుంది దేశం!

—బిక్కి కృష్ణ
సెల్: 99127 38815

పట్టలేదు. 'మీ అమ్మ లేచిపోయిందటగా' అంటూ వెకిలిగా నవ్వుతూ మాట్లాడిన వాళ్ళెవ్వరూ 'మీ నాన్న మరొకావిణ్ణి ఉంచుకున్నాడటగా' అని అన్లేదు.

అంటే మగాడు తప్పు చేసినా చూసీ చూడనట్టు వెళ్ళిపోయే సమాజం, అదే తప్పు ఆడది చేస్తే వేట కుక్కలా తరుముతుందని అర్థమైంది.

నాన్న సంబంధం పెట్టుకున్న వెంకటలక్ష్మికి ఇద్దరు పిల్లలున్నారని పెద్దమ్మ పెదనాన్నతో చెప్తుం డగా విన్నాను. ఆ ఇద్దరు పిల్లలు కూడా వాళ్ళమ్మ చేస్తున్న తప్పుకి నాలానే శిక్ష అనుభవించి ఉంటార నుకుంటా. మాటల్ని పదునైన ములుకుల్లా చెక్కి వాళ్ళ లేతగుండెల్లో గుచ్చి గాయం చేసి, రాక్షసానం దాన్ని పొంది ఉంటారీ మనుషులు.

ఓ ఆదివారం, గదికి కాత్యాయని వచ్చింది.

"బావా మరదళ్ళ మధ్య నేనెందుకు? హాయిగా కబుర్లు చెప్పుకోండి" అంటూ మోహిత్ బైటికెళ్ళి పోయాడు. నువ్వు వెళ్ళాల్సిన అవసరం లేదని ఎంత చెప్పినా విన్లేదు.

"బావా... అమ్మ నిన్ను పిల్చుకుని రమ్మంది" అంది కాత్య.

"వీలు చూసుకుని వస్తాలే. ఇప్పుడు కాదు. చదువుకోవాలి" అన్నాను.

"బావా.. నీకు చదువుమీద ఆసక్తి లేదని నాకు తెలుసు. ఇంటినుంచి బైటికొచ్చి ఇన్ని రోజులైనా నువ్వు ఒక్కసారి కూడా ఇంటికి రాలేదని అమ్మ బాధపడుతోంది. రా బావా, వెళ్దాం. అమ్మ నీకోసం గారెలు, పాయసం చేస్తోంది."

"నేను రాను."

"ఎప్పటికీ రావా?"

"ఏమో చెప్పలేను. నాకు రావాలనిపించినప్పుడు వస్తాను".

"ఎందుకు బావా, మనుషులకు దూరంగా పారి పోతావు? ఎవరి నుంచి ఈ పారిపోవడం? ఎందు కోసం? ఎప్పుడైనా ఆలోచించావా?"

"నేనేమీ పారిపోవటం లేదే..."

"ఎందుకు బావా నిన్ను నువ్వు మోసం చేసు కుంటావు? పెదమామయ్య, అత్త నిన్ను తమతో పాటే ఊళ్లో ఉండమని బతిమాలినా వినకుండా ఈ ఊరొచ్చావు. మా ఇంటినీ, నిన్ను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమించే నన్నూ, నీ మేనత్తనీ వదిలేసి ఈ రూంలో ఉంటున్నావు. నాకు తెలిసి అందరూ బంధువుల్ని, స్నేహితుల్ని కావాలనుకుంటారు. నువ్వే ఎవ్వరూ వద్దనుకుని ఒంటరిగా ఉంటున్నావు."

"నాకు ఒంటరితనమంటే ఇష్టం. నా గతాన్ని తవ్వి వాళ్ళ మాటలతో హింసించే వాళ్ళంటే అసహ్యం. నేను మనుషుల్తో కలవలేను. నన్నిలానే బతకనీ."

**నిజంగానే నాలో ఏదైనా లోపం ఉందా? నా ఈడువాళ్ళతో పోల్చితే నా ఆలోచనాధోరణి ఎందుకు భిన్నంగా ఉంది? అందరూ సుఖాల వెంట, సరదాల వెంట పరుగులు పెడుతుంటే నేనెందుకు నిరాశలో, అశాంతిలో పడి దొర్లుతూ దేనికోసమో వెతుక్కుంటున్నాను? ఈ పరిస్థితికి ఎవరు కారణం? ప్రశ్నల మీద ప్రశ్నలు అతని మదిని తొలిచేస్తున్నాయి. మరి అతని ప్రశ్నల పరంపర చివరకు ఎక్కడికి చేరింది?**

"నువ్వు అందరిలా ఎందుకుండవు బావా? నీ వయసు అబ్బాయిల్ని చూశావా... చలాకీగా హుషా రుగా నవ్వుతూ తుళ్ళుతూ ఎలా ఉంటారో.. వాళ్ళకు సమస్యలు లేవనా..? వాళ్ళకూ బాధపెట్టే గతాలు ఉంటాయి. అయినా వాటిని మర్చిపోయి సంతో షంగా ఉండటం లేదా? నువ్వెందుకిలా ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ... సర్వం కోల్పోయినవాడిలా ఉంటావు? మనుషుల్లో పడు బావా... మనుషుల్ని ప్రేమించడం నేర్చుకో."

"నవ్వుతూ తుళ్ళుతూ ఉండటానికి నా జీవితంలో ఏముందని?"

"నువ్వు పోగొట్టుకున్నదేమిటో నాకు తెలుసు బావా! అవన్నీ నీ ప్రమేయం లేకుండా జరిగి పోయాయి. గతాన్ని మర్చిపో. నేనున్నానుగా, నన్ను ప్రేమించు. కనీసం కామించు బావా... నన్ను ముద్దు పెట్టుకో... కౌగలించుకో... చివరికి నన్ను నేను పూర్తిగా అర్పించుకోమన్నా అర్పిస్తాను బావా. నీ సంతోషం కోసం ఏం చేయమన్నా చేస్తాను బావా" కాత్యాయని సన్నగా ఏడుస్తోంది.

"నాకు వాటిమీద ఆసక్తి లేదు. అవి నాకు సంతోషాన్నిస్తాయని నేననుకోను."

"అదెలా ఉంటుందో రుచి చూస్తే కదా బావుం టుందో లేదో తెలిసేది".

"మనిషి సంతోషంగా ఉండాలంటే దారి అదేనా?"

"సుఖాలు అనుభవిస్తేనేగా సంతోషం దొరికేది. స్త్రీ పురుష సమాగమంలో దొరికే సుఖం కోసం అందరూ తహతహలాడతారుగా బావా."

"జీవితమంటే సుఖాలు అనుభవించడం, తద్వారా లభించే సంతోషాల్ని పొందడం మాత్రమేనా..? లేదు. ఇంకేదో ఉంది. అదేమిటో తెలుసుకునేవరకు నాకు మనశ్శాంతి ఉండదు".

"అది తెలుసుకునేలోపల నువ్వు ముసలాడివై పోతావు బావా. అప్పుడు కొన్ని సుఖాలు అనుభ వించాలన్నా అనుభవించలేవు."

"పర్లేదు."

"నాకు భయమేస్తోంది బావా... నిన్నెలా మార్చాలో తెలియటం లేదు. నిన్నెలా నా దారికి తెచ్చుకోవాలో అర్థం కావడం లేదు".

"నువ్వు నా దారికి రాలేవు. నీ దారికి నేను రాలేను. మనిద్దరివి రెండు వేర్వేరు మార్గాలు. నన్ను వదిలెయ్" అన్నాను చేతులు జోడిస్తూ.

"ఎప్పటికీ వదల్లేను బావా! గుర్తుపెట్టుకో... నా బొందిలో ప్రాణం ఉన్నంతకాలం నిన్ను ప్రేమిస్తూనే ఉంటా. నీ కోసం ఎదురుచూస్తూనే ఉంటా."

కాత్యాయని ఏడుస్తూ వెళ్ళిపోయింది.

తను వెళ్ళిన గంట తర్వాత మోహిత్ తిరిగి వచ్చాడు. "నీ మరదలు ఎంతందంగా ఉందో... అంత అందమైన మరదల్ని, నిన్ను గాఢంగా ప్రేమిస్తున్న మరదల్ని ఇంట్లో పెట్టుకుని ఎంజాయ్ చేయక ఈ గదిలో ఓ విరాగిలా బతికేవాణ్ణి నిన్నే చూస్తున్నా" అన్నాడు.

***

డిగ్రీ మూడో సంవత్సరంలో ఉన్నప్పుడు ఒక రోజు సాయంత్రం రూంకొచ్చే సమయానికి మోహిత్ రూంలోనే ఉన్నాడు. కళ్ళార్పకుండా సెల్‌ఫోన్ స్క్రీన్ వైపే చూస్తున్నాడు. వాడి దగ్గర ఉన్నది స్మార్ట్‌ఫోన్

లేటెస్ట్ వెర్షన్. వాళ్ళ నాన్న పంపిన డబ్బుతో నలభై వేలు పెట్టి కొన్నాడు.

అది కొన్నప్పుడు నా నిరసనని బాహాటంగానే వ్యక్తపరిచాను. 'మనుషులతో సంభాషించడానికి నిర్దేశించబడిన ఫోన్ కోసం అంత డబ్బు వెచ్చించాలా? అసలు ఫోన్లో కెమెరాలు, వీడియోలు ఎందుకు పెడుతున్నారు? వాటివల్లనే కదా ఎన్నో అనర్థాలు జరుగుతున్నాయి" అన్నాను.

"సెల్‌ఫోన్ అనేది మనకాలంలో ఆవిష్కరింపబడిన అద్భుత సృష్టి. ఒక్క సెల్‌ఫోన్ కొంటే చాలు... వాచీ, కెమెరా, వీడియో రికార్డర్, వాయిస్ రికార్డర్, రేడియో, టీవీలాంటి ఎన్నో సదుపాయాలు ఈ బుల్లి పరికరంలో లభిస్తాయి. దాన్నేమీ అనకు" అన్నాడు నవ్వుతూ మోహిత్.

దాన్లో నెట్ సౌకర్యం వేయించుకుంటే గూగుల్ సాయంతో తనకు తెలియని చాలా విషయాల్ని తెలుసుకోడానికనుకున్నా. కానీ మోహిత్ నన్ను చూసి 'అమాయకుడిలా ఉన్నావే' అనేలా వంకరగా నవ్వి చెప్పాడు. "మన తండ్రుల కాలంలో సెక్స్ బొమ్మలు చూడాలంటే చాటుగా దొరికే నిషిద్ధమైన పుస్తకాలే గతి. సెల్‌ఫోన్లో ఇంటర్నెట్ సౌకర్యం వచ్చాక ఈ చిన్న తెరమీద సెక్స్ వీడియోలు విచ్చలవిడిగా దొరుకుతాయి. రకరకాల అమ్మాయిలు, దేశ విదేశాల అమ్మాయిలు... అసలు నేను ఈ ఫోన్ కొన్నదే వాటిని చూడటం కోసం."

నేను ఎంత వారించినా వినకుండా రోజూ కొన్ని గంటలు వాటిని చూడటానికి అలవాటు పడ్డాడు మోహిత్. మామూలుగా రాత్రి భోజనాలయ్యాక చూసుకునేవాడు. ఈ రోజు సాయంత్రం ఆరు కాకుండానే అందులో మునిగిపోయాడు.

"అప్పుడే మొదలెట్టావా? ఏంటి విశేషం? నీకో విషయం తెలుసా? తాగుడు ఎలా వ్యసనమో ఇది కూడా అలాంటి వ్యసనమే. వాడు చీకటి పడగానే సారాయి కొట్టుకెళ్తాడు. నువ్వు ఇంటర్నెట్‌లో పోర్న్ సైట్లలోకి వెళ్తావు. అయినా అవి చూస్తే ఏమొస్తుంది మోహిత్? జుగుప్స కలగదా? ఎంత విలువైన సమయం వృథా చేసుకుంటున్నావో తెలుసా? మెదళ్లోకి అశ్లీలాన్ని ఎక్కించుకుంటున్నావు" అన్నాను.

"అశ్లీలం కాదు అమృతం.. ఇదేగా స్వర్గమంటే! దీన్ని వదులుకునేవాడు మూర్ఖుడు. నేను ఏ అవకాశాన్నీ వదులుకోను" చూపు మరల్చకుండానే అన్నాడు.

"సర్లే... చెవిటివాడి ముందు శంఖం ఊదటమేగా నీకు నచ్చచెప్పటమంటే. ఇంతకూ ఇంకా చీకటి పడకముందే దుకాణం తెరిచావేమిటి?"

"ఈ రాత్రికి ప్రణాలితో ఏమేం ప్రయోగాలు చేయాలా అని చూస్కుంటున్నా. మర్చేపోయాను చెప్పటం... ఈ రోజు రాత్రి ఎక్కడికైనా వెళ్ళి పడుకోవా?"

"ఎందుకూ ఎప్పుడూలేంది అలా అడుగుతున్నావు?"

"ప్రణాలి వాళ్ళమ్మ ఏదో పనిమీద ఊరెళ్ళింది. ఈ రాత్రికి రాదు. రాత్రంతా ప్రణాలితో గడపాలనుకుంటున్నా".

ప్రణాలి వాళ్ళమ్మ బ్యాంక్‌కి వెళ్ళాక, ఆమె చెల్లెలు కాలేజీకెళ్ళాక, ప్రణాలీ మోహిత్‌లు కాలేజీ ఎగ్గొట్టి గదిలో గడుపుతారన్న విషయం నాకు తెలుసు.

"మీరు వారానికి ఒక్కసారైనా కలుస్తారుగా.. ఇప్పుడంత అవసరం ఏమొచ్చింది?" అన్నాను.

"పగటిపూట ఎవరైనా వస్తారేమోనన్న భయంతో కలవడం తృప్తిగా అన్పించడం లేదు. ఈ రోజు మంచి అవకాశం దొరికింది. వాళ్ళ చెల్లి పడుకున్నాక ప్రణాలి పైకొస్తానంది. ప్లీజ్... ఈ ఒక్క రాత్రికే" అన్నాడు.

మెస్‌కెళ్ళి భోంచేసి అక్కడి నుంచి శిరీష వాళ్ళింటికెళ్ళాను.

"నువ్వీరోజు వస్తావని అనుకోలేదు. ఏమిటీ సర్‌ప్రైజ్" అడిగింది.

"ఏమీ లేదు. రావాలనిపించింది.. వచ్చాను".

"చాల్లే... ఏదో కారణం లేకుండా ఉండదు. నన్ను చూడాలనిపించిందా? నాతో మాట్లాడాలనిపించిందా?"

"లేదు."

"నువ్వెక్కడ దొరికావయ్యా బాబూ.. కనీసం నా తృప్తికోసమైనా అబద్ధం చెప్పవచ్చుగా" అంటూ నవ్వింది.

## మనమీదేనర్రోయ్!

సరసి





"నేను నిజంగానే మీ కోసం వచ్చినా, మీ సాహచర్యం కోసం పాకులాడుతున్నానని తెల్సినా మీరు చలించరని నాకు తెలుసు."

"బాగానే అర్థం చేసుకున్నావు. నిజమే! జీవితంలో పరిపూర్ణమైన ప్రేమని పొందిన తర్వాత ఇంకేమీ కావాలనిపించదు. ఇంకెవ్వరి నుంచి ప్రేమని ఆశించాల్సిన అవసరం రాదు. నేను జోసెఫ్‌తో కలిసి ఉన్నన్ని రోజులు తనివితీరా ప్రేమని పొందాను. వెలితి లేదు. వెలితి ఉన్నవాళ్ళే ఆ ఖాళీని నింపుకోవడం కోసం ఆరాటపడతారు" అంది.

"అసలు మనిషి మనుగడకు ప్రేమ అవసరమంటారా?" అడిగాను.

"నువ్వు భోం చేశావా? కలిసి తిందామా? నాకు ఆకలేస్తోంది" అంది.

నేను తినేసి వచ్చానని చెప్పాను. తను కంచంలో అన్నం, టమోటా పప్పు వేసుకుని వచ్చి ఎదురుగా కూచుంది.




"ప్రేమ అవసరమా అని కదూ అడిగావు. నా ఉద్దేశంలో బతకడానికి కావల్సింది కడుపుకింత తిండి, తాగడానికి నీళ్ళు, పీల్చుకోడానికి గాలి... అంతే. మిగతావి ఏవి లేకున్నా మనిషి బతికేస్తాడు. కడుపుకి ఆకలి ఉన్నట్టే మనసుకీ ఆకలి ఉంటుంది. దానికి ప్రేమ కావాలి. తనని ఇష్టపడేవాళ్ళు కావాలి. స్నేహాలు కావాలి. అవి టానిక్‌లా పనిచేస్తాయి, సంతోషమనే బలాన్నిచ్చే టానిక్! కేవలం బతికితే సరిపోతుందా లేక సంతోషంగా, సంతృప్తిగా బతకాలా అనేది మనిష్టం".

నిజమే. ప్రేమ అవసరమే. మా అమ్మ ఉండి ఉంటే ఆమె ప్రేమలో ఎంత సంతోషంగా ఉండేవాడినో... నాన్న బతికుంటే ఎంత ఆనందంగా ఉండేవాడినో... కానీ కాత్యాయని ప్రేమిస్తున్నా ఎందుకు వద్దనుకుంటున్నాను? అమ్మ ప్రేమ దొరకలేదన్న బాధ... ఇప్పటికీ అమ్మ ప్రేమకోసమే వెతుకులాట... అందుకే కాత్యాయని చూపించే ప్రేమ నచ్చడం లేదా? నేను శిరీషగారి వైపు ఆకర్షితుణ్ణి కావటానికి కారణం కూడా బాల్యంలో నేను కోల్పోయిన అమ్మ ప్రేమని ఆమె ద్వారా పొందాలనుకోవటమా?

"మీరు మరోలా అనుకోనంటే ఓ ప్రశ్న అడగనా?" అన్నాను.

"అడుగు."

"సెక్స్ లేకుండా మనిషి బతకలేడా?"

"ఎందుకు బతకలేడూ... భేషుగ్గా బతకొచ్చు. సెక్స్ శరీరావసరం అంటారు. నాన్సెన్స్! నేను ఒప్పుకోను. ప్రతి జీవిలో తన ప్రతిరూపాన్ని పుట్టించాలన్న కోరిక నిక్షిప్తమై ఉంటుంది. సెక్స్ ఉద్దేశం సంతానాన్ని పొందడమే. సంసారం, పిల్లలు వద్దనుకుంటే సెక్స్ కూడా అవసరం లేదు."

"అదేదో సుఖం ఇస్తుందని.."

"ఓ స్త్రీగా నా అనుభవం చెప్తాను రామక్రిష్ణ. స్త్రీ సెక్స్‌ని సుఖం కోసం కోరుకోదు. తనకిష్టమైన మగాడి ప్రేమకోసం... బలమైన బంధం కోసం.. భద్రత కోసం సెక్స్‌లో పాల్గొంటుంది".

"మీ స్కూల్లో ఆడపిల్లల్ని గమనిస్తున్నారా? ఇప్పుడు అమ్మాయిలు కూడా పెళ్ళికి ముందే అబ్బాయిలతో శారీరక సంబంధం కోసం వెంపర్లాడుతున్నారు. నలుగురైదుగురితో ఆ అనుభవాన్ని పొందటంలో తప్పు లేదనుకుంటున్నారు. ప్రేమని ఎవ్వరూ సీరియస్‌గా తీసుకోవటం లేదు. సెక్స్ అనుభవం పొందటం కోసం అదొక ముసుగు మాత్రమే. దీనికి మీరేం చెప్తారు?"

"నేటి యువతలో పాశ్చాత్య సంస్కృతి ప్రభావం బలంగా ఉంది. దానికి తోడు ఇంటర్నెట్‌లో ముంచెత్తుతున్న పోర్న్‌సైట్లు, పరిచయాలు పెంచుకోవడానికి ఉపయోగపడుతున్న సోషల్ మీడియా. ఒకప్పుడు యువత సమాజ శ్రేయస్సు గురించి ఆలోచించేది. ఇప్పుడు కేవలం తమ సుఖం, తమ సౌకర్యాల గురించే ఆలోచిస్తోంది. తల్లిదండ్రులిస్తున్న స్వేచ్ఛ, డబ్బుకి లోటు లేకపోవడం, చెడిపోవడానికి అవసరమైనవన్నీ అందుబాటులో ఉండటంతో విచ్చలవిడిగా, విశృంఖలంగా ప్రవర్తిస్తున్నారు".

"వివాహేతర సంబంధాలకు కారణం ఆ సుఖమేదో భర్త దగ్గరో, భార్య దగ్గరో దొరక్కుండా పరాయి వాళ్ళ దగ్గర దొరుకుతుందని అనుకోవటం వల్లనే కదా."

"నేను దాన్ని ఆ సుఖంతో ముడిపెట్టను. ఇందాక చెప్పానే... వెలితి... మనసులో ఏర్పడిన శూన్యం. దాన్ని నింపుకోవటం కోసం పడే ఆరాటమే అదంతా. ఇంట్లో దొరకనిదేదో బైట దొరుకుతుందని ఆశపడి పరుగుపెడ్తారు. వాళ్ళనొదిలేయి. నా ఉద్దేశంలో మాత్రం సెక్స్ అనేది అలౌకికమైన ప్రేమ భావనని వ్యక్తపర్చడానికి ఉపయోగపడే ఓ అద్భుతమైన సాధనం" అని కొన్నిక్షణాల విరామం తర్వాత అడిగింది. "అయినా ఈ రోజు ఇలాంటి ప్రశ్నలు అడుగుతున్నావేంటి?"

నేనప్పటివరకూ మా అమ్మ గురించి శిరీష గారికి చెప్పలేదు. ఆమె తినడం ముగించి ప్లేట్ కడిగి పెట్టేసి వచ్చాక మా అమ్మ చేసిన దుర్మార్గం గురించి చెప్పాను. మరో మగాడికోసం నన్నూ నాన్ననీ, అమ్మ వదిలివెళ్ళిన విషయంతో పాటు నాన్న ఇంకో స్త్రీతో సంబంధం పెట్టుకోవటం గురించి కూడా చెప్పాను.

నేను చెప్తున్నంతసేపు ఆమె శ్రద్ధగా విన్నది.

అంతా విన్నాక "అమ్మమీద నువ్వు పెంచుకున్న అసహ్యం సరైంది కాదనిపిస్తోంది రామక్రిష్ణ" అంది.

"మీరే అన్నారుగా సెక్స్ లేకున్నా బతకొచ్చని. మరి మా అమ్మ ఆ సుఖం కోసమే మమ్మల్ని వదిలేసి వెళ్తే అసహ్యం వేయదా? నాన్న చావుకి కూడా కారణం అమ్మే. ఆమె రెండు హత్యలు చేసిన నేరస్థురాలు. నాన్నను చంపేసింది. నన్ను మానసికంగా, సామాజికంగా చంపేసింది".

"నేనలా అనుకోను. కేవలం సెక్స్ కోసమే ఆమె వెళ్ళిపోయి ఉంటుందని అన్పించడం లేదు. నాకు తెలిసి ఏ స్త్రీ కూడా శారీరక సుఖం కోసం తన సంసారాన్ని, పిల్లల్ని త్యాగం చేయదు. స్త్రీలంటే చులకన భావం ఉన్నవాళ్ళే అలా అనుకుంటారు. నువ్వు కూడా అలా అనుకుంటున్నావంటే నాకు చాలా బాధగా ఉంది రామక్రిష్ణ".

"ఇంకేం కారణం ఉండి ఉంటుందని మీ అభిప్రాయం? కన్నబిడ్డని అలా కనికరం లేకుండా వదిలేసి వెళ్ళటానికి ఏదో బలమైన కారణం ఉండాలిగా".

"అదే మనకు తెలియదు. తప్పకుండా ఏదో బలమైన కారణం ఉండి ఉంటుంది. అది ఆమె తిరిగొస్తే కాని తెలియదు".

"వద్దు... ఆమె తిరిగి రాకూడదు. ఆమె అంటే నాకసహ్యం. నాకు తల్లి లేదు. ఎప్పుడో చచ్చిపోయింది".

"సరే రామక్రిష్ణ! వదిలేయి. మళ్ళా మన మధ్య ఈ టాపిక్ తీసుకురావద్దు. ఎటొచ్చీ నువ్వు చేస్తున్న తప్పేమిటో చెప్తాను విను. మీ అమ్మ గురించి లోకులనుకున్న మాటల ప్రభావం, నీ ఫ్రెండ్ మోహిత్ ప్రవర్తన, నీకు తెలిసిన అమ్మాయిలు బరితెగించి సెక్స్‌కోసం వెంపర్లాడటం... వీటన్నింటిని కలిపి నువ్వు మీ అమ్మ చేసిన పనిని విశ్లేషిస్తున్నావు. నాకు తెలిసి ఏ తల్లికైనా ప్రయారిటీ తన బిడ్డలే. మన్మథుడే దిగివచ్చి ఎదురుగా నిలబడి, నీకు స్వర్గ సుఖాలు అందిస్తాను, నీ బిడ్డల్ని వదిలిరా అని పిలిచినా తప్పకుండా తృణీకరిస్తుంది రామక్రిష్ణ. ఈ విషయం మాత్రం మర్చిపోవద్దు" అంది.

**(ఇంకా వుంది)**






# నాలాగే ఎందరో!

**గణేష్ నిమజ్జనం.. మా ఊరంతా ఒకటే జనం. ఒక వైపు మంచినీళ్ల స్టాల్స్.. మరో వైపు వందల సంఖ్యలో గణేష్ విగ్రహాలు మోస్తూ లారీలు... ఎటుచూసినా ఒకటే సందడి.**

నాంపల్లి వైపు వెళ్లగానే నా కళ్లు నా దోసెల బండిని వెతకటం మొదలుపెట్టాయి. బండిని అప్పుడప్పుడే మూసేస్తున్నట్లున్నాడు రామ్. "ఈ రోజు ఇంత త్వరగా.." అని అడిగా. "విసర్జన కదమ్మా! మా వినాయకుడిని తీయాలి... అందుకే ముందే కట్టేస్తున్నా!" అన్నాడు. "అరే.. ఇలా అయితే జమోటోలో బ్యాడ్ రివ్యూ పెడతా!" అన్నా నవ్వుతూ. రామ్ కూడా నవ్వేశాడు. "మీరు జూబ్లీహిల్స్‌లో మా స్టాల్‌కు రండమ్మా!" అన్నాడు. 'సరే..' అనే లోపులోనే రామ్ వెళ్లిపోయాడు. "దోసెల వాడితో నీకు మాటలేంటమ్మా!" అని మా అమ్మాయి ఒక పక్క గొణుగుతోంది. ఈ కాలం పిల్లలకు రకరకాల నామోషీలు. మన పూర్వీకులు కనిపెట్టిన అతి గొప్ప ఆవిష్కరణల్లో ఇడ్లీలు, దోసెలు ముఖ్యమైనవని నా ప్రగాఢ విశ్వాసం. వీటిని కనిపెట్టిన వాడు ఆటం బాంబును కనిపెట్టిన వాడికన్నా గొప్పవాడని నేను నమ్ముతా! రకరకాల దినుసులు అందుబాటులో ఉంటే మినపప్పునే ఎంచుకుని, వాటి పొట్టు తీసి, బాగా రుబ్బి అట్లుగా వేయాలనే ఆలోచన రావటమే ఒక అద్భుతం. అందుకే ఇడ్లీలు, దోసెలు అయస్కాంతం ఇనుమును ఆకర్షించినట్లు నన్ను లాగుతూ ఉంటాయి. సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చేటప్పుడు రోడ్డు పక్కన పానీపూరీలు, పావ్‌బాజీలు, చాట్‌భండార్‌లు ఇలా రకరకాలు కనిపిస్తూ ఉంటాయి. కానీ అవన్నీ రామ్ వేసే దోసెల ముందు బలాదూరే! అసలీ రామ్‌తో నా పరిచయం వెనక ఒక పెద్ద కథే ఉంది.

## రామ్‌కీ బండి

దాదాపు మూడు నెలల క్రితం అనుకుంటా.. రంజాన్ మాసంలో ఒక రాత్రి చార్మినార్ చూడటానికి వెళ్లాం. అక్కడి నుంచి వస్తూ నాంపల్లి దగ్గర ఆగాం. దూరంగా ఒక బండి. చుట్టూ భారీగా జనం. "అమ్మా! నీ దోసెలు.." అంది మా అమ్మాయి ఉత్సాహంగా. "తిందామా.." అని అడిగా అప్రయత్నంగా. అవును..కాదు అన్నట్లు తల ఊపింది. బండి దగ్గరకు వెళ్లాం. అక్కడున్న పెద్ద పెనం చూస్తుంటే ముచ్చటేసింది. ఎనిమిది దోసెలు.. ఒకేసారి వేసేస్తున్నారు.. బండి మీద బోర్డు చూశా. 'రామ్‌కీ బండి' అని ఉంది. పేరు తమాషాగా ఉంది. ఒక కుర్రాడు దోసెలు చకచకా వేసేస్తున్నాడు. మా అమ్మాయికి నిద్ర ఎగిరిపోయినట్లుంది. బండి అంచుకు ఆనుకొని మరీ దోసెలు వేయటం చూస్తోంది. "నీకేం దోసె కావాలి? చీజా.. బటరా.." అని ఒక నిమిషం ఆగి "పిజ్జా దోసె కావాలా?" అన్నాడు. మా అమ్మాయి మొహం విచ్చుకుంది. "మీకు మేడం.." అని అడిగాడు. "మీ దగ్గర ఏది బావుంటే అది.." అన్నా. "అన్నీ బావుంటాయి మేడమ్.. చీజ్ మా ప్రత్యేకత.." అన్నాడు తడుముకోకుండా. అతను మళ్లీ దోసెలు వేయటంలో మునిగిపోయాడు. మాకు రెండు దోసెలు ఇచ్చేశాడు. కొద్దిగా ఖాళీ అయింది.

"నీ పేరేంటి?" అని అడిగా. "రామ్ కుమార్ షిండే.." అన్నాడు. "రోజుకెంత సంపాదిస్తావు.." అని ప్రశ్న నోటి చివరిదాకా వచ్చింది. బండి దగ్గరున్న రష్‌ను చూస్తే, అతను బాగానే సంపాదిస్తున్నాడని అర్థమవుతోంది.

## ఇదే బెటర్!

నా మొహంలో రకరకాల ప్రశ్నలు కనిపించినట్లున్నాయి.. "ఈ బండి మా నాన్నది మేడమ్. మా నాన్న మొదలుపెట్టినప్పుడు నాంపల్లిలో దోసెల బళ్లు తక్కువ. బండి నాచేతికి వచ్చినప్పుడు ఏదో చేయాలనుకున్నా. ఎంబీఏ చదివి దోసెల బండా? అని చుట్టాలందరూ దెప్పారు. అయినా ఫ్యామిలీ బిజినెస్ కదా.. ఉద్యోగం కన్నా ఇదే బెటర్! ఎవరి కిందా పనిచేయాల్సిన అవసరం లేదు.." అన్నాడు. "నువ్వు ఎంబీఏ చదివావా?" అన్నా. వెంటనే సారీ కూడా చెప్పా. "పర్వాలేదు మేడమ్. అందరూ మనసులో అనుకుంటారు. మీరు పైకి అన్నారంతే!" అని నవ్వేశాడు. "బటర్, చీజ్ దోసెలు వేయటం మొదలుపెట్టిన తర్వాత ఎక్కువ మంది రావటం మొదలెట్టారు!..." అంత దాకా వినిపించింది. ఆ తర్వాత అతని మాటలు లారీ హారన్‌లో కలిసిపోయాయి.

## మురిసిపోతుంటా

డబ్బులిచ్చేసి ఇంటికి వచ్చేస్తుంటే, రామ్‌కీ బండి జమోటోలో ఉందిటమ్మా! అంది. సాధారణంగా జమోటోలో రెస్టారెంట్స్ ఉంటాయి. కానీ రోడ్డు పక్కన బళ్లు ఉండవు. నేను ఏదో మాట్లాడేలోపులోనే.. "దొరికింది.." అంటూ ఫోన్‌లో రామ్‌కీ బండికి జమోటోలో రేటింగ్ చూపించింది.

"వావ్! ఐదుకి 4.2.. బెస్ట్ రేటింగ్.." అంది. మా అమ్మాయికి అప్పుడప్పుడు నేను వేసిన దోసెలు ముద్దొస్తే "నువ్వు దోసెల బండి పెట్టుకోవచ్చమ్మా! యు ఎర్న్ లాక్స్.." అంటుంది. అది అలా అన్నప్పుడల్లా దోసెలు వేసి లక్షలు గడించిన మొనగాళ్లు మన ఆంధ్ర దేశంలో ఎంతమంది ఉన్నారు? అలాంటి మొనగత్తె నేను అవుతానని మురిసిపోతూ ఉంటా! అలాంటిది నా కన్నా ముందు ఒకరున్నారనే ఆలోచన భలే ఆశ్చర్యంగా ఉంటుంది. 'నాలాగే ఎందరో..' అనిపిస్తుంది.



—సీత

email: fbackfm@gmail.com

# సాటి మనిషి

**- సి.ఉమాదేవి**

**అవే పదాలకూర్పులు, అవే వాక్యప్రయోగాలు పేర్చుకున్న అంబులపొదిలోని అక్షర అస్త్రాలు. మనుషులను ఆకట్టుకునే మాటల మూటలు! అయినా తయారైన ఉపన్యాసం లోకనాథానికి తృప్తిని ఇవ్వడంలేదు.**

**"మన ఉపన్యాసం వినేవారి నాడిని మనం పట్టుకోగలగాలి, అంటే ఈ ఉపన్యాసానికి తగినంత ఉప్పు పడాలి. చప్పగా ఉంటే వినేవాడు ఒక్కడు కూడా ఉండడు. ఏమంటావ్ గిరీ!" అంటూ భుజాలెగరేస్తూ నవ్వాడు లోకనాథం.**

'చూచివ్రాత నయం దీనికన్నా. టైపు చేసి చేసి వేళ్లు కొంకర్లు పోతున్నాయి. అయినా ఈ అయ్యగారికి తృప్తిలేదు. ఇంటితగవును వీధికిలాగి, పరువుకు నీళ్ళొదిలేశాడు. ఉపన్యాసంలో ఆయనకు కావలసినది ఉప్పుకాదు మసాలా!' మనసులోనే విసుగు దాచుకున్నాడు గిరి.

"సరే సార్, ఉప్పెందుకు, చక్కెరే కలుపుతాను చూడండి" అని వినయంగా తలవంచి నమస్కరించి వెళ్ళిపోయాడు.

"ఆc మరిచాను, కాగితాలన్నీ శుభ్రమైన సంచిలో సర్దు. తెల్లవారడం ఆలస్యం మనం బయలు దేరాలి. మన సభ మనమే పెట్టుకుంటున్నాం కాబట్టి ఆలస్యం చేశామంటే అలసత్వానికి గుర్తైనట్లే!"

చేదుగుళికల్లాంటి మాటలకు చక్కెరపూత పూసి ఆచరణలోకి వచ్చాకగాని, చేదు నోటికి తగలనంత తియ్యగా తయారైన ఉపన్యాసాన్ని మనసారా మననం చేసుకుని తృప్తిగా గిరి భుజంపై చరిచి, "ఇక చూడు మనమే విజేతలం" అని గర్వంగా చెప్పాడు.

చిన్నతగువే. చిలికిచిలికి గాలివానైంది. పంతంపడితే వదిలేరకం కాదు లోకనాథం. అయితే న్యాయానికి అన్యాయం ఎదురైతే సహించనివాడు రాజయ్యపంతులు. రెండుగ్రామాలలో విస్తరించిన తాతలనాటి పొలాలను సమష్టిగా అనుభవించారు లోకనాథం, కిషోర్. విడిపోదామనే పిల్లల ఆకాంక్షలకు పెద్దలు తలూపారు. అన్నదమ్ముల పిల్లలే. అజాతశత్రువులు కావలసినది ఆగర్భశత్రువులైనారు. వరుసకు తమ్ముడైన కిషోర్ సర్దిచెప్పాలనుకున్నా, లోకనాథం అసలు వినిపించుకోడు. ఒకేచోట వుండి కలహాలకాపురం చేసేకన్నా దూరంగా ఉండి ఎవరి బ్రతుకు వారు హుందాగా గడపవచ్చు అనుకుని తను నడయాడిన నేలనువదలి వెళ్ళిపోయాడు కిషోర్. లోకనాథం పట్నంలో వ్యాపారం మొదలుపెట్టి రాజకీయప్రవేశానికి పావులు కదుపుతూ అవకాశానికై ఎదురుచూస్తున్నాడు. లోకనాథానికి ఇక అడ్డేముంది అనుకోవడానికి వీల్లేదు. కిషోర్ తనకు అమ్మేసిన పొలాన్ని ఎట్టిపరిస్థితులలో వేరెవరికీ అమ్మనంటాడు ఆ పొలం కొనుక్కున్న రాజయ్య. ఎవరోఒకరు మనసును సరిపుచ్చుకుంటే సమస్య దూదిపింజే. కానీ, ఒకరిది అతిశయం. హక్కులేకపోయినా, మా తాతల ఆస్తులు కదా అనే పిడివాదం. మరొకరిది కిషోర్‌పై ప్రేమ, అభిమానం. 'ఇంత పంచాయతీ, ఇన్ని ఉపన్యాసాలు అవసరమా? రాజయ్య మీద ఒత్తిడితెచ్చేలా పల్లెజనాన్ని రెచ్చగొడ్తే మీరు బాగానే ఉంటారు, ఇరుగుపొరుగు గ్రామాలప్రజలు తలలు బద్దలుకొట్టుకుంటారు, మానవత్వంలేని మేధకన్నా, మేధలేని మానవత్వంమిన్న' అని చెప్పిన భార్యమాటలు లోకనాథానికి అసలు రుచించవు. కరుకు చూపులతో ఆమె మాటలకు మేకులుకొడ్తాడు.

**వాళ్ళిద్దరూ రక్త సంబంధీకులే. కానీ దారులు వేరు. ఆలోచనలు వేరు. అందుకే వేరు పడ్డారు. అజాత శత్రువుల్లా ఉండాల్సిన వారిపిల్లలు కూడా ఆగర్భశత్రువులయ్యారు. తాతలనాటి ఆస్తి స్వాధీనం చేసుకోవాలనుకున్నాడు అన్నయ్య. అందుకోసం పెద్ద ప్రణాళిక వేశాడు. ఊరుజనాన్ని మభ్యపెట్టాడు. ప్రలోభపెట్టాడు. కానీ ఆ ఊళ్ళో జనం ఎలా స్పందించారు? ఆ అన్నదమ్ముల రక్తబంధం వారిని ఏకం చేయగలిగిందా?**

'తన ప్రణాళికకు చక్కని రూపమిచ్చి గ్రామాన్ని అన్ని గ్రామాలలో మిన్న అనిపించుకునేలా చేయాలంటే తమ్ముడు కాని తమ్ముడు కిషోర్, రాజయ్యకి ఇచ్చిన స్థలాన్ని తాను కొనుక్కోవాలి. భీష్మించుకున్న రాజయ్యను నయానోభయానో ఒప్పించాలని చూశాడు. కానీ అది కాస్తా జరగకపోయేటప్పటికి గ్రామస్థులను ఏకతాటిమీదకు తెచ్చి పక్కపక్కనే ఉన్న భూములు రెండూ కలిస్తే మంచి సూపర్ బజార్ కట్టిస్తాను. దాని పైఅంతస్తులో చిన్న సినిమా థియెటర్ కట్టిస్తాను. మన గ్రామరూపు రేఖలు మారిపోతాయి అని ఊరించేలా మసాలా బాగా దట్టించిన ప్రసంగంతో ఆ గ్రామపంచాయతీ భవనం దద్దరిల్లాలి.' అదీ లోకనాథం ఉద్దేశం.

భవిష్యత్తులో తన రాజకీయప్రవేశానికి ఈ ఉపన్యాసమే పార్టీపెద్దలకు తనేమిటో చెప్తుందని లోకనాథం గట్టినమ్మకం. ఇవే ఆలోచనలు చుట్టుముట్టి రాత్రంతా నిద్ర కరువైన లోకనాథం తను ఎలాగైనా రాజయ్యపై ఒత్తిడి రప్పించి ఆ స్థలం కొనెయ్యాలి. బతిమాలడాలు, బెత్తాలు ఆ ఊరికే అయ్యవారైన రాజయ్యముందు పనిచేయకపోవడంతో కడకు ఈ మార్గం ఎంచుకున్నాడు లోకనాథం. అతడి దృష్టిలో రాజయ్య వఠ్ఠిమూర్ఖుడు. సిరి వస్తుంటే కాదంటున్నవాడు.

స్థలం కొనుకున్నాడన్న పేరేగాని ఆ స్థలాన్ని రాజయ్యకు కిషోర్ గురుదక్షిణగా సమర్పించేశాడనవచ్చు. నామమాత్రపు సొమ్ముకు రాజయ్యపేర స్థలం రిజిస్టర్ చేశాడు. వరుసకు అన్నయ్యే తప్ప బంధానికి ఏమీకాని లోకనాథం సూటిపోటి మాటలు, ధనదాహం చూస్తూ, భరిస్తూ బ్రతకలేక తాతయ్యలందించిన ఆస్తిని రాజయ్య చేతిలోపెట్టి తన గమ్యం వేరే అని తెలుసుకుని లోకనాథానికి దూరంగా వెళ్ళిపోయాడు కిషోర్. 'తగినన్ని వసతులు లేని ఆ చిన్న ప్రభుత్వాసుపత్రి వల్ల ఇబ్బందులు పడుతున్న రెండు గ్రామాల ప్రజలకు మరో ఆసుపత్రి కూడా కట్టించడానికి ఈ స్థలం వినియోగించండి' అని కిషోర్ కోరిన కోరికను రాజయ్య మరచిపోలేదు. అందుకే ఎందరుచెప్పినా ససేమిరా అని భీష్మించుకున్నాడు.

లోకనాథం పట్నం నుంచి పెద్ద ప్రణాళికతో వస్తున్నాడని తెలుసుకుని, అతడు వచ్చేలోగానే గ్రామప్రజలందరికీ పాఠంచెప్పినట్లుగా ఆసుపత్రి ఆవశ్యకత గురించి వివరించాడు రాజయ్య. అతడిని అడ్డుకున్నవాళ్ళున్నారు. పల్లెలు పట్నాలైపోతున్నాయి, అలాంటప్పుడు లోకనాథం ఆలోచనలో తప్పేముంది? అనే వాదన వినిపిస్తోంది. చూద్దాం ఏం జరుగుతుందో అని కర్రలు సిద్ధం చేసుకున్నవారు మరికొందరు.

గిరికి ఫోన్ చేశాడు లోకనాథం. పరుగున వచ్చాడు గిరి. కారు సిద్ధంగా ఉంది. లోకనాథం 'ఊ' అనడం ఆలస్యం వాహనం విహంగమైంది. వేగాన్ని కళ్ళతోనే కొలుస్తున్నాడు లోకనాథం. పంచాయతీ భవనంలో పలకరింపులు, కుశలప్రశ్నలు, తేనీరుసేవనం కాగానే గొంతు సవరించుకున్నాడు లోకనాథం. ఉపన్యాసంలో కళ్ళముందు ఇంద్రభవనాన్ని దర్శింప చేస్తున్నాడు.

"మనమంతా ఒకటై మనం అనుకున్నది సాధించాలి. నేను, కిషోర్ అన్నదమ్ముల బిడ్డలమే, కానీ మా ఆలోచనలు వేరు, మా అలవాట్లు వేరు, మా అవసరాలు వేరు. నేను చెప్పినది వాడికి అస్సలు నచ్చదు. వాడసలు ఏదీ చెప్పడు. వాడో మౌనముని. ఏం చేస్తాడో వాడికే తెలియదు. లక్షలు ఖరీదుచేసే భూమిని రాజయ్యకు ధారపోశాడు. పంతులేం చేసుకుంటాడు ఆ భూమిని. ఏదిఏమైనా ఇది మా తాతల ఆస్తి. పంచుకున్నది అమ్ముకోవడానికా? మీరే ఆలోచించండి, రెండుస్థలాలూ కలిస్తే ఎంత పెద్ద భవంతి వస్తుందో. రెండు గ్రామాలలో మాకు తాతలు సంపాదించిన భూములున్నాయి. పక్క గ్రామంలోదీ మనభూమేనని మీకు తెలుసు కదా! మనిమిప్పుడు దాన్ని కాపాడుకోవాలి. ఆ భూమి నిరుపయోగంగా పడుంటే ఏం లాభం? అది ఇతరులకు దక్కితే, దానిమీద రూపాయి పెట్టలేనివాళ్ళు ఏం చేయగలుగుతారు? రాజయ్యను మీరే ఒప్పించండి. అమ్మేసి వెళ్ళిపోయిన కిషోర్‌కు భూమిపై ఆశ వదులుకోమని చెప్పండి. దాని గురించి వాడికనవసరం" ఉపన్యాసం చివరలో చెప్పిన డబ్బు మంత్రానికి అనుకోకుండానే తలూపారందరూ. సరేనని తల ఊపడానికి అక్కడ రాజయ్యలేడు.

నిజమే అనిపించింది కొందరికి. కానీ మరి కొందరికి ఆసుపత్రి ఆలోచనే నచ్చింది. ఆసుపత్రి నిర్మాణానికి కిషోర్ డబ్బులు బాగానే పెట్టగలడనే నమ్మకమూ ఉంది. ఇలాంటి వారినీ ఓ కంట కనిపెడుతున్నాడు లోకనాథం. డబ్బు ఎరవేసైనా సరే తను అనుకున్నది సాధించాలనుకున్నాడు. అందరినీ మరోమారు ఆలోచనచేసి పంతులు మనసు మార్చమన్నాడు. "మాయ చేస్తారో, మంత్రమే వేస్తారో రేపీ పాటికీ నాకు ఒప్పుకున్నాడనే సమాధానం కావాలి" అన్నాడు. చెప్పాలనుకున్నదంతా చెప్పగలిగాన్న తృప్తితో కలల సామ్రాజ్యాన్ని నిర్మించుకుంటూ తన శక్తియుక్తులు త్వరలోనే అందరికి తెలుస్తాయనుకుంటూ సంబరంగా తిరుగు ప్రయాణమయ్యాడు.

***

"గిరీ, ఎక్కడున్నావ్? అంతా సిద్ధమేనా? బయలుదేరాలి!" అని హడావిడిపడిపోతూ ఆత్రంగా లేవబోయాడు లోకనాథం. ఊహూ! సాధ్యపడలేదు. కళ్ళు విప్పార్చి చూశాడు. 'ఇదేమిటి!' అని తన ముఖంలోకి ఆత్రుతగా చూస్తున్న భార్యను ఆశ్చర్యంగా చూశాడు లోకనాథం. దాంతో లీలగా జరిగినదంతా లోకనాథానికి గుర్తుకు రాసాగింది.

"ఇలా ఎందుకు జరిగింది? నువ్వెప్పుడొచ్చావు ఇక్కడికి?" నొప్పితో కదలలేని కాలు, చేయి చూసుకుంటూ భార్యను అడిగాడు.

"రాత్రే వచ్చేశాను. ఎందుకంత తొందర మీకు. మంచికార్యానికి దేవుడి సహకారం ఉంటుంది" అంది భార్య. "అంటే నువ్వూ నన్ను శపిస్తున్నావా? నేనూ మంచిపనే కదా చేయాలనుకున్నది? మీకు అర్థం కాదు. నా చేత నేను తలపెట్టిన కార్యం పూర్తి చేయించాలనే ఇలా నా ప్రాణాలు నిలిపాడు ఆ దేవుడు."

"ప్రాణాలు నిలిపింది ఆ దేవుడే కావచ్చు. కాని మరో దేవుడి రూపంలో!" ఇది ఒప్పుకోక తప్పని నిజం అన్నట్టు దృఢంగా పలికిందామె.

'ఏమంటున్నావు? మరో దేవుడా...! అబ్బ ఆ డాక్టరును పిలు. కాలు బరువెక్కిపోతోంది.." అంటూ కేకలు వేయసాగాడు.

"గిరీ!" అని మళ్ళీ గట్టిగా అరిచాడు.

చేతికి చిన్నకట్టుతో పరుగున వచ్చాడు గిరి.

రాత్రంతా స్పృహలేని ఆ వ్యక్తి అరుపువిని అప్పుడే ఇంజెక్షనులు, మందులు పట్టుకుని లోపలికి వస్తున్న నర్సు ఉలికిపడింది.



## ఆలియాకు డేరా బాబా దెబ్బ!

డేరాబాబాకు బాలీవుడ్ హీరోయిన్ ఆలియాభట్‌కు ఏమాత్రం సంబంధం లేదు. అయినా ఆలియాభట్ ఇబ్బంది పడాల్సి వచ్చింది. అదెలాగంటే....ఆలియా నటిస్తున్న సినిమా షూటింగ్ హర్యానాలో జరుగుతోంది. ఆ సమయంలో డేరా బాబా అరెస్ట్ కావడంతో అక్కడ అల్లర్లు జరిగాయి. దీంతో షూటింగ్ ఆపేశారు. మిగతా వారి సంగతి ఎలా ఉన్నా అల్లర్ల కారణంగా తన డేట్లు వేస్ట్ అయ్యాయని ఆలియా తెగ బాధపడుతోందట! తిరిగి డేట్లు ఇవ్వాలంటే చాలా ఇబ్బంది అని ఆమె వాపోతోంది.

'ఎవరి అవసరాలు వారివి. అందుకే తానంత పట్టుదలగా ఆ ఊరొచ్చాడు. కానీ ఒకటే వాన! సభకు వచ్చిన గ్రామస్థులు ఉపన్యాసానికి ముగ్ధులై కాదు. ఆ వర్షంవల్ల మరో దారిలేక తమతమ స్థానాల్లో కట్టిపడేసినట్లు కూర్చుండిపోయారు. లోకనాథం వర్షంలోనే తిరుగు ప్రయాణమయ్యాడు. రాత్రికే ఇంటికి చేరుకోవాలని తొందరపడ్డాడు. తన ఆత్రుతను డ్రైవరుమీద కనబరిచాడు. కారు స్పీడుగా నడపమని డ్రైవర్‌ని ఒత్తిడిచేశాడు. చివరకు

"నువ్వు ఇటురా, నేను నడుపుతా కారు" అన్నాడు.

"వద్దు సార్. మీరసలే స్పీడు"

"దిగమంటుంటే.." అని గద్దించాడు. చేసేదేమీలేక కారువేగం పెంచాడు డ్రైవరు. స్టీరింగ్‌కు, యాక్సిలేటర్‌కు పరుగుపందెం పెట్టాడు. కారు గెలిచి ఓడింది. లోకనాథానికి ఆసుపత్రిలో పడక నేర్పరచింది.

"ఏమయ్యా గిరి, అమ్మగారికి ఎందుకు కబురు పెట్టావు అనవసరంగా?" విసుగ్గా అడిగాడు లోకనాథం.

"డాక్టరుగారే చెప్పారు సార్. మీకు రక్తం అవసరం, సమయానికి దొరక్కపోతే ప్రమాదం అని పదేపదే హెచ్చరించారు సార్"

"రక్తమా, నాకిచ్చారా? ఇక్కడేమైనా బ్లడ్ బ్యాంక్‌లు ఉన్నాయా?" మరో ఆసుపత్రి ఆవశ్యకత మనసులో లీలగా గోచరించి కనుమరుగైంది లోకనాథానికి.

"మన అదృష్టం బాగుంది సార్. అంత వానలో కారులో దేవుడిలా వచ్చాడు. రక్షించమని నేను కేకలు పెడుతూనే ఉన్నా, మన కారుచూసి ఆపినట్టున్నాడు. డ్రైవర్‌నీ, నన్నూ లేపి కూర్చోబెట్టి, తర్వాత మీ కాలునుంచి రక్తం కారకుండా తన చేతిరుమాలుతో కట్టుకట్టాడు. ఆ తరువాత మేం అందరం, మిమ్మల్ని ఆయన కారులోనే పడుకోబెట్టి హాస్పిటల్‌కు తీసుకొచ్చాం. మీ పుణ్యంకొద్దీ మీరక్తం, ఆ బాబురక్తం సరిగ్గా సరిపోయింది. తెల్లారక మునుపే ఆ బాబు తనకార్లో వెళ్ళిపోయారు సార్" చెప్పాడు గిరి.

"ఎవరతను? ఏ ప్రాంతం? కనుక్కున్నావా?"

మనిషి ప్రాంతాలుగా, కులాలుగా, మతాలుగా, తెగలుగా విడిపోవడం అనాదినుండి జరుగుతున్నదే.

"ఎవరో చెప్పాడా?" రెట్టించి అడిగాడు లోకనాథం.

"చెప్పాడుగానీ అర్థం కాలేదు సార్"

'మంచి పనిని మించిన పూజలేదు. మానవతను మించిన మతం లేదు అనే వ్యక్తే తమను ఆపదలో ఆదుకున్న ఆపద్బాంధవుడు' అని తనకర్థమైందిగానీ, లోకనాథానికి చెప్పినా అర్థం కాదు' అనుకుని మనసులోనే నవ్వుకున్నాడు గిరి.

"నీ ముసిముసినవ్వులు కాస్త ఆపుతావా, ఇవతల నొప్పులతో చస్తుంటే.." కcయ్ మన్నాడు లోకనాథం.

కాసేపాగి మళ్ళీ తనే అడిగాడు. "ఇంతకీ అతడెవరో చెప్పనేలేదు, మనమేదో ఇచ్చి పంపేవాళ్ళం కదా!" అతిశయంగా పలికాడు.

"అలా తీసుకునే వ్యక్తిలా కనబడలేదుసార్"

"ఏమిటో నీదంతా అదోరకం"

డాక్టర్ రావడంచూసి మాటలాపి పడుకున్నాడు లోకనాథం.

"మీకు నొప్పి తగ్గడానికి ఒకటి, నొప్పితెలియకుండా ఉండటానికి ఒక ఇంజెక్షన్ ఇస్తారు. కాసేపు విశ్రాంతిగా పడుకోండి. గండం గడిచి బయటపడ్డారు. రాత్రి మీ పరిస్థితి చూసి నాకే కాసేపు ఏంచేయాలో తోచలేదు. మీ అదృష్టం, ఆ సమయంలో మీకోసమే అతను ఆ దార్లో వచ్చాడేమో, మీకు ప్రాణదాతయ్యాడు" అన్నారు డాక్టర్.

"ఎవరు డాక్టర్ అతడు? ఊరూ పేరేమైనా చెప్పాడా?" ప్రాణమనగానే మనసులో చలనం మొదలై ప్రశ్నించాడు లోకనాథం.

'ఎవరో నాకూ తెలియదండీ. పక్కఊరే అన్నాడు. పేరడిగితే 'సాటి మనిషిని' అని నవ్వుతూ వెళ్ళిపోయాడు.

లోకనాథం భార్య అప్రయత్నంగా చేతులు జోడించింది. లోకనాథంలో ప్రవహిస్తున్న ఆ 'సాటి మనిషి' రక్తం అతడిలో మానవత్వాన్ని తట్టి లేపుతూ ప్రవహిస్తోంది.

"మనిషి కాదండీ అతడు. మహామనీషి"

లోకనాథం కళ్ళు సజలాలయ్యాయి. కళ్ళు మూసుకుని నమస్కరించాడు.

'ఎవరికి ఆపద కలిగినా మనసు స్పందించాలి. మమత కాపాడాలి. భాషలు వేరు, భావాలు వేరు. ప్రాంతాలూ, దేశాలూ వేరే కావచ్చు. కులం, మతం ఒక్కటే కాకపోవచ్చు. కానీ సాటి మనిషిగా ఇతరుల కష్టానికి స్పందించాలి. తగిన సాయం చేయాలి. అదే మనిషితనాన్ని నిలబెడుతుంది. వేరుపడేది మనుషులేగానీ, మనసులుకాదు. సాటిమనిషిని ఎప్పుడూ మనిషిగా చూడని తన అయ్యగారికి, రక్తమిచ్చింది ఆయన తమ్ముడు కిషోరేనని చెప్పాలా? వద్దా?' అని ఆలోచనలో పడ్డాడు గిరి.

సెల్: ***98858 09250***





# సం గతులూ! దర్భాలూ! 10



-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

# కరణం గారి కొరడా దెబ్బలు

**అతగాడి పేరు చెవినిపడితే చాలు, సంఘంలోనూ, సాహిత్యంలోనూ 'మడికోరే' వారికి కంపరం పుట్టవచ్చు లేదా కనుబొమలు ముడిపడవచ్చు. అతడు బహుదురుసు మనిషనీ, నోటికి హద్దుపద్దులు లేవనీ, నెపం ఎంచవచ్చు.**

కాని అతడి పద్యాల విమర్శ ధాటినీ, ఆక్షేపించిన విషయాల లోపాలనీ, ఎవరూ కాదనజాలరు. నీతి అతడి లక్ష్యం. జంకులేని బూతు అతడి సాహిత్య సాధనం. సమాజంలో మనుషుల ప్రవర్తనల వికారాలను జల్లెడపట్టి విడిచిపెట్టిన దిగంబరజాతి కవి.

వృత్తికి కుందవరం అనే గ్రామానికి కరణం. పేరు చౌడప్ప. 17వ శతాబ్ది చివరలో జీవించాడు. తిట్టడానికి ఉద్యమిస్తే వేములవాడ భీమకవీ చాలడు, ధూర్జటీ చాలడు. వేమన్నా చాలడు. కరణంగారు కదా! మోటుగానో, అరచాటుగానో కలంపోటు పొడవడం సహజగుణం.

తిట్టడమంటే ఎలాగో అలాగ సరిపెట్టుకుని, పడదగినవారు ఊరుకోగలరేమోగానీ, బూతులు మొదలుపెడితే ఎవరు తట్టుకోగలరు? చౌడప్ప ఒక పద్యంలో అంటాడు. "ఒరే అబ్బాయీ, నీతులు చెప్పడానికేమిగానీ, వాటికి బూతు తగిలిస్తేగానీ వినే దొరగారికి నవ్వురాదు గదరా!" అని.

అలా అన్నాడుకదా అని, ఈ కరణంగారికి సాహిత్యమంటే తెలియదనిగానీ, సున్నితం ఎరగనివాడనిగానీ ఎవరైనా అనుకుంటే తప్పులో కాలు వేసినట్టే. సంస్కృతకవుల్లో దండి, భవభూతి, కాళిదాసు, భారవి, బిల్హణుడు, మాఘుడువంటి ప్రసిద్ధ కవుల కావ్యాలన్నీ చదివాడు. తెలుగులో తిక్కన, నాచిన సోమన్న, శ్రీనాథుడు, పెద్దన, అభిమానకవులు.

స్వభావంచేత దూకుడు మనిషి. ఆగ్రహం కలిగితే 'అమ్మా, ఆలీ' దాకా వెళ్ళిపోతాడు.

కవిత్వ గాఢత ఎరిగినవాడూ, స్వస్వరూప జ్ఞానంగలవాడూ కనకనే కావ్యాలు వ్రాయకుండా, కందచ్ఛందాన్ని అందిపుచ్చుకుని, ఛందశ్చండంగా తన నాటిసమాజంలో 'పరువుగలవారి' కక్కుర్తుల్ని, దొంగప్రవర్తనల్ని కడిగి పడేశాడు. తన కందపద్య రచనా సామర్థ్యం మీద అతడికెంత నమ్మకమంటే, "అబ్బాయ్, వెనకటిరోజుల్లో అయితే తిక్కనగారు కందానికి రాజు. ఈ కాలంలో అయితే నన్ను మించినవాడు లేడు" అని ఢంకా బజాయించి చెప్పాడు. ఇంకా ఇలా ఛాలెంజి విసిరాడు. "వెయ్యికాకులు ఒక్క తుపాకిదెబ్బ వినేసరికి ఉలికిపడవా? అలాగే నా తడాకకి ఆపాటి ఈపాటి కవులు తట్టుకోలేరు" అని.

ఇక్కడ ఉద్రేకపడకుండానూ, ఆగ్రహించకుండానూ ఒక విశేషాన్ని ఆలోచించాలి. ఎవరేమనుకున్నాసరే ఆగ్రహాన్ని అదే తీవ్రస్థాయిలో వ్యక్తం చెయ్యడానికీ, హాస్యం పుట్టించడానికీ కూడా బూతును మించిన సాధనం లేదుగాక లేదు. కవులు నాటు బూతులకు ఒడిగట్టకపోయినా, అరచాటు బూతునైనా శతాబ్దాలుగా సాహిత్యంలో ఆదరించకపోలేదు. కొందరు తెలివిగా సంస్కృతీకరించి వాడినవాళ్ళున్నారు. చాటువుల్లో ఆ ముచ్చట తీర్చుకున్నవాళ్ళూ ఉన్నారు. గుంటూరు శ్రీనాథుడు మొదలు తెనాలి రామలింగం వరకు మినహాయింపులేదు. ఆధునికుల్లో కృష్ణశాస్త్రిగారు, శ్రీశ్రీ, ఆత్రేయ ఆదిగాగల లబ్ధప్రతిష్ఠులు చాటుపద్యాలలో చెయ్యి చేసుకున్నారు. జాగ్రత్తగా మనస్సుపెట్టి చూస్తే, బూతులతో అల్లిన చాలా పద్యాల్లో కనిపించే లక్ష్యం నీతే. అయితే ఇటీవల ఫెమినిస్టుల ఆరోపణల్లో ఒక సత్యం లేకపోలేదు. బూతువ్యవస్థ చాలావరకు స్త్రీపరంగానే వర్ధిల్లింది. ఆమె అవయవాలను అవమానపరిచే విధంగానే నడచింది. అయితే ఆ జరిగినదంతా పురుషుడి దృక్పథం నుంచే సంభవించింది. (కావ్యంలోగానీ చాటువులోగానీ, శతకంలోగానీ) శృంగారం అనేది నైతికంగాచూస్తే స్త్రీ పురుషుల ప్రైవేట్ వ్యవహారం. అందులో యౌవనవైభవం ఉంటుంది. బూతు, శృంగారం ఒకటి కావు. బూతు నిందకు సాధనం. తేడా లేదూ? మనుషుల లేకితనాన్ని, లోభితనాన్ని, డాంభికత్వాన్ని, వ్యసనైకమత్యాన్ని నిందించడానికి, బూతును చౌడప్ప ధారాళంగా వాడి ఉండవచ్చు. మన కాలపు కావ్యపరిష్కర్తలు, అతడు వ్రాశాడని ప్రచారంలోవున్న వందలకొద్దీ పద్యాలను తొలగించేశారు. ఇటూ అటూ సర్దుబాటు చేసిమరీ ప్రమాదం అనిపించని పద్యాలను ఒక "శతకం"గా తేల్చి అచ్చులో నిక్షేపించారు. నిజానికి మొగమాటం విడిచి చెప్పుకోవాలంటే, చౌడప్ప కందపద్యాలకంత ప్రచారం వచ్చిందంటే చాలాభాగం బూతులు కావడమే!

చౌడప్ప తాను వ్రాసేవ్రాతలు నీతులేనని ఎంత గాఢంగానమ్మి ప్రకటించాడంటే, "నా నీతి వినని వాడు, సూర్యకిరణాలు తనమీద పడనివాడు, వానలో తడవనివాడు, ఎక్కడా చూడమురా అబ్బాయీ" అన్నాడు.

పరిష్కర్తలు తొలగించి పడెయ్యగా, చౌడప్ప శతకంలో మిగిలిన వంద పద్యాలలో ఇప్పుడు మిగిలిన బూతుల జోలెందుకుగానీ, అతడు గట్టిగా చెప్పిన నీతులు కొన్నిటిని చూద్దాం. ఎంత చిన్నదైనా, సరళమైనదైనా, పద్యాలు మింగుడుపడని తెలుగు నవయువతకోసం వచనంలోనే చౌడప్ప 'ఐడియాలు' కొన్ని మనవి చేస్తాను.

1. కోళ్ళు, ఊరపందులు, కుక్కలు ఈ భూమ్మీద పొట్ట పోషించుకుంటూనే ఉంటాయి. లోకంలో పదిమందికి పెట్టి పోషించలేని చాలామందిది కక్కుర్తి బతుకేకద!
2. అబ్బాయ్, అధికారికి ఎవడు దగ్గరగా ఉంటుంటాడో ముందుగా వాడిని మంచి చేసుకోవడం లోకన్యాయం. వారికి వాహనమనే కదా, గరుడుడికి పూజ!
3. దేవుడూ, దేవుడూ అన్నంత మాత్రాన ఆ తెల్ల దీవినుంచి దిగి వచ్చేస్తాడా? అబ్బాయ్, ఎవడు దానం చేస్తాడో ఈ లోకంలో వాడే దేవుడు.
4. దొర అన్నాక ధారాళంగా ఇవ్వాలి, ఇప్పించాలి.



అటువంటివాడికే మీసాలదర్జా! లేని వాడికెందుకు? రొయ్యకు మీసాలెంతో అంతే.

5. గండరగండ ముండాకొడుకులు, అవసరంలో అడుక్కునే వాళ్లకిమ్మంటే ఇవ్వరుగానీ, తమని విసిరి కొడుతున్నా, ముండలకిమ్మంటే ఇచ్చేస్తారు.
6. ముండాకొడుకుల సంపద, వాళ్ళ దండగమారి ఖర్చులకేతప్ప, దానధర్మాలకు పనికిరావు.
7. మనిషన్నవాడు, మెలకువగలిగిన వాడైతే, సరిగ్గా ఎంచుకుని అందమైన ఆడమనిషిని చేపట్టాలి. లేదంటే ఎందుకూ? నోరు మూసుకుని మోక్షం కోసం సన్యసించడం మంచిది.
8. ఇల్లు జాగ్రత్తకోసం తాళం ఉండడం పదిలం. విల్లుకి గట్టినారి ఉంటే పదిలం. ఆడ కూతురు స్తనాలకు రవిక ఉండడం పదిలం.
9. యతికీ, బ్రహ్మచారికీ, వితంతువుకీ, గుట్టానికీ ఎప్పుడూ రతిక్రీడమీదే ధ్యాస.

ఈ కుందవరం కరణంగారి పద్యాల్ని కవిత్వంగా కాక కొరడాదెబ్బలుగా భావించడం మంచిది.

నవ్య



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, ప్రేమానుబంధాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఉద్యోగ, వ్యాపారాలకు సంబంధించి ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 14, 15 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. విందు, వినోదాలకు ఏర్పాట్లు చేస్తారు. 16, 17, 18 తేదీల్లో చొరవ లోపించడం వల్ల వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధించలేకపోతారు. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 19న వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయం, హోటల్ రంగాల వారు నిదానం పాటించాలి.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఆర్థికవిషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. పెట్టుబడుల్లో నిదానం పాటించండి. 14, 15 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. కమ్యూనికేషన్లు, బోధన రంగాలవారికి ప్రోత్సాహకరం. శుభ సమాచారం అందుకుంటారు. 16, 17, 18 తేదీల్లో ప్రియతములు, చిన్నారుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ప్రోత్సాహకరం. 19న ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్య, కుటుంబ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. 14, 15 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 16, 17, 18 తేదీల్లో విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో నిరుత్సాహకరంగా ఉంటుంది. 19న విద్యాసంస్థల్లో ప్రవేశానికి ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

విద్య, సమావేశాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్య, దూరప్రయాణాలకు ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయాణాల్లో నిదానం పాటించాలి. 14, 15 తేదీల్లో సోదరిసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విద్యార్థులకు శుభప్రదం. ఒక శుభవార్త అందుకుంటారు. 16, 17, 18 తేదీల్లో విలువైన పత్రాలు అందడంలో ఇబ్బందులు ఎదురవుతాయి. ఫీజులు, బిల్లులు చెల్లించేందుకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 19న విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రయాణాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, క్రయవిక్రయాలు, విద్యా విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం పెట్టుబడుల్లో నిదానం అవసరం. ప్రియతముల కోసం ఖర్చుల అధికం. 14, 15 తేదీల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 16, 17, 18 తేదీల్లో పెట్టుబడులపై ఆచితూచి నిర్ణయం తీసుకోవాలి. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 19న విలువైన పెట్టుబడుల విషయంలో తొందరపాటు తగదు. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఆర్థికసంస్థలతో పనులు, పెట్టుబడులు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. గౌరవ, ప్రతిష్ఠలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. 14, 15 తేదీల్లో బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 16, 17, 18 తేదీల్లో మనశ్శాంతి లోపిస్తుంది. ఉన్నతవిద్య, విదేశీ వ్యవహారాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. రహస్య సమాచారం అందుకుంటారు. 19న కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. మనసును ఏదో వెలితి బాధిస్తుంది. కొత్త ప్రాజెక్టుల ప్రారంభానికి తగిన సమయం కాదు.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం ఆర్థిక వ్యవహారాల్లో అంచనాలు తప్పే ప్రమాదం ఉంది. పారితోషికాల విషయంలో నిరుత్సాహం ఎదురవుతుంది. 14, 15 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. గౌరవ పదవులు అందుకుంటారు. ప్రముఖులను కలుసుకుంటారు. 16, 17, 18 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. స్నేహానుబంధాలు బలపడతాయి. బ్యాంకులతో పనులు పూర్తవుతాయి. 19న కీలక నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో జాగ్రత్తగా వ్యవహరించాలి.

# సౌభాగ్య చక్రం

సెప్టెంబర్ 13 నుంచి సెప్టెంబర్ 19 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ఉన్నతవిద్యపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. పెట్టుబడుల్లో నష్టం సంభవం. 14, 15 తేదీల్లో సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. వేడుకల్లో పాల్గొంటారు. సంకల్పం నెరవేరుతుంది. 16, 17, 18 తేదీల్లో సన్నిహితుల సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. 19న ఆర్థిక విషయాల్లో సన్నిహితుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

పెద్దల ఆరోగ్యం, వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం సమావేశాల్లో పెద్దల నుంచి ఇబ్బందులు ఎదురవుతాయి. గౌరవానికి భంగం కలిగే ప్రమాదం ఉంది. 14, 15 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. పెన్షన్, గ్రాట్యుటీ, బీమా వ్యవహారాలకు అనుకూలం. 16, 17, 18 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధిస్తారు. 19న వృత్తి, వ్యాపారాల్లో నిరుత్సాహకరంగా ఉంటుంది. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవానికి భంగం కలిగే ప్రమాదం ఉంది.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. 14, 15 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. వేడుకల్లో పాల్గొంటారు. 16, 17, 18 తేదీల్లో ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపాలి. రుణప్రయత్నాలు ఫలించే అవకాశం ఉంది. ఆర్థికపరమైన చర్చలు లాభిస్తాయి. 19న సమావేశాలు, చర్చల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ప్రయాణాల్లో అసౌకర్యం కలుగుతుంది.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, పెట్టుబడులు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అంచనాలు మించుతాయి. 14, 15 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. విందుల్లో పాల్గొంటారు. 16, 17, 18 తేదీల్లో భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. స్పెక్యులేషన్లు, పోటీల్లో విజయం సాధించే అవకాశం ఉంది. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 19న పెట్టుబడులకు సంబంధించి నిర్ణయాలకు తగిన సమయం కాదు. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, షాపింగ్, ఆరోగ్య విషయాలకు ఈ వారం అనుకూలం. బుధవారం కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్ రంగంలోని వారు నిదానం పాటించాలి. 14, 15 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. షాపింగ్‌కు అనుకూలం. 16, 17, 18 తేదీల్లో ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. కృషి రంగంలో కొత్త పరిచయాలు లాభిస్తాయి. విందుల్లో పాల్గొంటారు. 19న స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. విలువైన వస్తువుల కొనుగోలులో నాణ్యత గమనించాలి. భాగస్వామి వైఖరి ఆవేదన మిగులుస్తుంది.






## లెక్కలేసుకుంటున్న రాజుగారు!

మెగా ప్రొడ్యూసర్‌గా పేరుగాంచిన దిల్‌రాజు సినిమా నిర్మాణంలో ఏమాత్రం వెనక్కు తగ్గరన్న పేరుంది. గతంలో కొన్ని సినిమాలు ఆయనకు నష్టాలు తెచ్చిపెట్టినా ఆయన వైఖరి మారలేదు. అయితే ప్రస్తుతం ఆయన తన వైఖరి మార్చుకున్నారా అన్న అనుమానం వస్తోంది అంటున్నారు సినీజనాలు. ఆయన నుంచి ఓ సినిమా వస్తోంది అంటే కచ్చితంగా మంచి విజయాన్ని సొంతం చేసుకుంటుందన్న అభిప్రాయం ప్రేక్షకుల్లోనే కాదు నటీ నటుల్లో కూడా ఉంది. అందుకే స్టార్లు సైతం ఆయన సినిమాలో చేయడం అంటే ఎగిరి గంతేస్తారు. అలాంటి దిల్‌రాజు స్టార్ హీరోయిన్లను పక్కన పెట్టేసి తన సినిమాల్లో వరుసగా కొత్తవారికి అవకాశం ఇస్తున్నారు. ఈ విధంగా చేయడం వలన కొత్తవారిని ప్రోత్సహించడం, కొత్తవారిని పరిచయం చేయడం ఒక ఎత్తయితే ఆర్థికంగా లాభపడడానికే ఆయన ఇలా చేస్తున్నారు అన్నవారూ లేకపోలేదు. కొత్త హీరోయిన్ అయితే తక్కువ మొత్తం ఇస్తే సరిపోతుంది. సినిమా ఆడితే కోట్ల రూపాయలు లాభం వస్తుంది. ఆడకపోతే తక్కువ నష్టంతో బయటపడవచ్చన్నది ఆయన ఆలోచన అంటున్నారు. గతంలో ఎన్నడూలేని విధంగా ఆయన ఇలా లెక్కలు వేసుకోవడం ఏమిటి? అన్నది కొందరి ప్రశ్న.

## ఆ పాటలో ఏముంది!

నిన్న మొన్నటిదాకా ఓ పాటమీద వార్తలు తెగ షికారు చేశాయి. దీనికి ఓ కారణం ఉంది. 32 కోట్లతో ఓ పాటను చిత్రీకరించారు. మామూలుగా అయితే ఇంత మొత్తంతో ఓ చిన్న సినిమా తెలిగ్గా తీసేయొచ్చు. అలాంటిది



ఓ పాటకు ఇంత ఖర్చు ఎందుకు పెట్టారు? అని చాలా మంది ఆశ్చర్యపోయారు. ఆ తరువాత ఎవరికి వారు సమాధానపడ్డారు. ఎలాగంటే.....ఈ పాట తీసింది స్టార్ డైరెక్టర్ శంకర్. దేశంలో కనీవినీ ఎరుగని భారీ బడ్జెట్‌తో '2.0' సినిమాను గత కొన్ని సంవత్సరాలుగా చెక్కుతున్నాడు. ఈ సినిమా బడ్జెట్ అంచనాలను మించిపోయింది అంటున్నారు. సినిమాకి వందల కోట్లు ఖర్చు పెడుతున్నారు కనుక పాటకి ఆ మాత్రం లేకపోతే బాగుండదు అనుకొని అంత ఖర్చు పెట్టి ఉంటారని కొందరు అనుకుంటున్నారు. ఎంతసేపూ ఈ పాట అద్భుతంగా ఉంటుందని అంటున్నారే కానీ అసలు అంత ఖర్చు పెట్టి తీసిన పాటలో విషయం ఎంత ఉంది? అన్నది చెప్పడం లేదట! దాని గురించి చెప్పమంటే జనవరిలో ఎలాగూ సినిమా విడుదల ఉంటుంది కనుక ఏకంగా వెండితెర మీద చూసి ఆనందించండి అని చిత్ర యూనిట్ అంటోంది.



## చెంపదెబ్బలు తిన్న రణవీర్?

ఇది చదవగానే సహజంగా రణవీర్‌ను కొట్టింది దీపికానేమో అనిపిస్తుంది. దానికి ఓ కారణముంది. ఏమిటంటే....ఇటీవలి కాలంలో ఇద్దరికీ చెడినట్టు వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి. ఈ నేపథ్యంలో ఒళ్లు మండి దీపికా రణవీర్‌ను కొట్టి ఉండవచ్చు అన్న అనుమానం రావచ్చు. కానీ ఇది తప్పు. రణవీర్, దీపిక నటిస్తున్న 'పద్మావతి' శరవేగంగా షూటింగ్ జరుపుకుంటున్న సంగతి తెలిసిందే కదా! ఈ సినిమా షూటింగ్‌లోనే రణవీర్ తోటి నటుడి చేతిలో 24 సార్లు చెంపదెబ్బలు తిన్నాడట! ఆ నటుడు రణవీర్‌ను సున్నితంగా కొడుతుంటే షాట్ బాగా రావడానికి డైరెక్టర్ 24 సార్లు చెంపదెబ్బలు కొట్టించాడట! కాకపోతే ఆ నటుడు షూటింగ్ అయిపోయిన తరువాత రణవీర్ కాళ్లు పట్టుకున్నంత పనిచేసి క్షమాపణ కోరాడట!

## సంపాదనలో 'బాద్‌షా'నే!



బాలీవుడ్ బాద్‌షా షారూఖ్‌ఖాన్‌కు నిఖార్సయిన సక్సెస్ లభించి చాలా కాలమే అయినా, సంపాదన మాత్రం తగ్గలేదు అనడానికి ఫోర్బ్స్ సంస్థ వెల్లడించిన విషయాలు పరిశీలిస్తే ఇట్టే అర్థమైపోతుంది. ఈ సంస్థ ఈ సంవత్సరం దేశంలో అత్యధిక పారితోషికం అందుకున్న నటీనటుల జాబితాను వెల్లడించింది. అందులో ఖాన్‌గారి పేరు ముందు వరుసలో ఉండడం అందరినీ ఆశ్చర్యానికి గురిచేసింది. బాద్‌షా సంవత్సరం మొత్తానికి దాదాపు 263 కోట్ల రూపాయల మొత్తాన్ని పారితోషికంగా అందుకున్నట్లు ఆ సంస్థ తెలియజేసింది. ఈయన తరువాత కండల వీరుడు, ఆ తరువాత అమీర్‌ఖాన్ పేర్లు ఉన్నాయి. అమీర్‌కి సక్సెస్ రేటు ఎక్కువున్నా సొమ్ములు మాత్రం తక్కువే ముట్టాయట! దీంతో సొమ్ములకీ, సక్సెస్‌కీ సంబంధం లేదని బాలీవుడ్ జనాలు అంటున్నారు.



## నయన లవ్ స్టోరీ షురూ!

నయనతార తన గతాన్ని మరిచి కోలీవుడ్ డైరెక్టర్ విఘ్నేష్‌తో చెట్టాపట్టాలేసుకుని తెగ తిరిగింది. వీరిని చూసినవారు త్వరలోనే వీరు పెళ్లి చేసుకోవడం ఖాయం అనుకున్నారు. మరికొందరు మరో అడుగు ముందుకేసి ఇద్దరి పెళ్లీ అయిపోయిందని కూడా అన్నారు. ఈ కథ ఇలా సాగుతుండగానే నయన మళ్ళీ మనసు మార్చేసుకుని ఓ యువ హీరో మీద మనసు పారేసుకుంది. అతగాడితో నటించడానికి తెగ ఇంట్రస్ట్ చూపిస్తోందని కోలీవుడ్ జనాలు అంటున్నారు. అతగాడి కోసం తన రెమ్యునరేషన్ తగ్గించుకోవడానికి కూడా సిద్ధపడుతోందట! అంతే కాకుండా అవకాశం దొరికినప్పుడల్లా అతగాడిని ఆకాశానికి ఎత్తేస్తోందట!



రెండు దశాబ్దాల క్రితం 'మెరుపు కలలతో' కుర్రకారు గుండెల్లో గుబులు రేపింది. తన చిలిపి చూపులతో, కొంటె నవ్వుతో ఎన్నో రాత్రులు వారికి నిద్ర లేకుండా చేసింది. ఆమె ఎవరో కాదు వన్ అండ్ ఓన్లీ బాలీవుడ్ నటి కాజోల్ దేవగన్. తొంబై దశకంలో బాలీవుడ్ వెండితెర మీద కాజోల్ ఓ ప్రభంజనం. కేవలం ఆమె నవ్వు కోసమే ప్రేక్షకులు థియెటర్ బాట పట్టేవారంటే అతిశయోక్తి కాదేమో! కెరీర్ మంచి దశలో ఉండగానే ప్రేమించిన అజయ్ దేవగన్‌ను మనువాడి పక్కా గృహిణిగా మారిపోయింది. దక్షిణాదిన ముఖ్యంగా తెలుగు సినిమాలో కాజోల్ నటించకపోయినా అనువాద చిత్రంతో ప్రేక్షకుల మనసులో ఆమె వేసిన ముద్ర ఇంకా నిత్యనూతనంగానే ఉంది. దాదాపు ఇరవై సంవత్సరాల తరువాత మరోసారి అనువాద చిత్రంతో తెలుగువారిని పలకరించిన కాజోల్‌తో.....

# కొత్త పాత్రలంటే ఇష్టం

## –కాజోల్

### చాలారోజుల తరువాత దక్షిణాది సినిమా చేయడానికి కారణం?

ఇప్పటికే చాలాసార్లు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాను. 'మెరుపు కలలు' తరువాత నా దగ్గరకు వచ్చిన కథలు ఏవీ నన్ను అంతగా ప్రభావితం చేయలేదు. ఓ మంచి పుస్తకాన్ని ఎలా దాచుకుంటామో, నన్నూ, నా సినిమాల్నీ ప్రేక్షకులు అలా గుర్తు పెట్టుకోవాలి. అలాంటి పాత్రలు దొరికితేనే చేస్తున్నా. హడావిడిగా బోలెడన్ని సినిమాలు చేసేయాలన్న తపన నాకు లేదు. సినిమా తరువాత నాకున్న వ్యాపకాలు నన్ను ఎప్పటికప్పుడు బిజీగానే ఉంచుతాయి.

### ఇటు ఫ్యామిలీ, అటు సినిమాలు ఎలా మేనేజ్ చేయగలుగుతున్నారు?

అదేమీ పెద్ద కష్టమైన విషయం కాదు. కొద్దిపాటి ప్లానింగ్ ఉంటే సరిపోతుంది. తరచూ టూర్లు వెళ్ళే ఉద్యోగం చేసే మహిళలు ఉద్యోగం చేయడం లేదా? కుటుంబం కోసం ఉద్యోగం మానుకోవడం లేదు కదా! నేనూ అంతే! షూటింగ్ ఉన్న సమయంలో చేసే పనిమీద దృష్టి పెడతా. షూటింగ్ అయిపోగానే ఇంటి గురించి ఆలోచిస్తా. ఇంటికి ఎంత దూరంగా ఉన్నా రోజులో కనీసం రెండు లేదా మూడు సార్లు పిల్లలతో ఫోన్లో టచ్‌లో ఉంటా! ఎప్పటికప్పుడు వారి సంగతులు తెలుసుకుంటూ ఉంటా! దాంతో ఇంటికి దూరంగా ఉన్నానన్న ఫీలింగ్ నాకు కానీ, పిల్లలకు కానీ రాదు. నేను బిజీగా ఉంటే ఇంట్లో నా బాధ్యతను అజయ్ తీసుకుంటారు. దాంతో పెళ్ళి తరువాత నటించడం కష్టంగా అనిపించడం లేదు.

### మీకు దైవభక్తి ఎక్కువ అంటారు, నిజమేనా?

నిజమే. అది మా అమ్మ నుంచి వచ్చింది. దేవుడు అమ్మానాన్న కన్నా ఎక్కువ అని అమ్మ నాతో ఎప్పుడూ చెబుతూ ఉండేది. మనం ఎన్ని తప్పులు చేసినా ఆయన ముందు నిలుచుని చేతులు జోడించి వేడుకుంటే అన్నీ క్షమించేస్తాడు అని చెప్పేది. ఆ మాటలు నా మనసులో నిలిచిపోయాయి.

### అంటే తరచూ దేవాలయాలకు వెడుతుంటారన్నమాట?

చిన్నతనం నుంచి పండుగలకి తప్పనిసరిగా దేవాలయాలకు అమ్మతో కలిసి వెళ్ళడం అలవాటు. ముఖ్యంగా గణేష్ ఫెస్టివల్‌కి, దసరాకి ఆలయాలకు వెడుతుంటాను. ఈ రోజుకీ అమ్మ మాటలను తూచా తప్పకుండా ఆచరిస్తాను.

### మీ పిల్లలకు మీరూ అలాగే చెబుతారా?

కచ్చితంగా చెబుతాను. మా అమ్మ నాకు ఎలా మంచి బుద్ధులు, అలవాట్లు నేర్పిందో, నేను కూడా నా పిల్లలకు అలానే నేర్పాలి కదా! లేకపోతే నేను మంచి తల్లిని అనిపించుకోలేను. నేను ఎంత నటిని అయినా ఒక అమ్మనీ, ఒక గృహిణినీ. భర్త చాటు భార్యగా ఉండడానికే ఇష్టపడతాను.

### బుల్లితెరమీద చేయడం తేలికా? వెండితెరమీద చేయడం తేలికా?

టీవీలో నటించడమే కష్టం. టీవీలు నటులను



ప్రేక్షకులకు దగ్గర చేస్తాయి. గతంలో సినిమాలు ఆ పని చేసేవి. ఇప్పుడు టీవీలు చేస్తున్నాయి. ఓ సినిమా నచ్చకపోతే అందులో నటించిన వారిని విమర్శించే అవకాశం తక్కువ. టీవీలు అలా కాదు. వెంటనే విమర్శల వెల్లువ మొదలైపోతుంది. అంత దాకా ఎందుకు? వెంటనే టిఆర్పీ రేటు పడిపోతుంది. ఓ కార్యక్రమం లేదా సీరియల్ ప్రేక్షకులకు నచ్చలేదు అనడానికి అదే నిదర్శనం. టీవీలో చేసేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. కార్యక్రమాలు లేదా సీరియల్‌ను చాలా జాగ్రత్తగా ఎంచుకుని చేయాలి. బుల్లితెర మీద సక్సెస్ అయిన నటీనటులు వెండితెర మీద చాలా తేలిగ్గా సక్సెస్ అవుతారు.

**వెండితెర మీద ఇంతకాలం ఉంటానని ఎప్పుడైనా ఊహించారా?**

సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో అస్సలు అనుకోలేదు.



నేను ఇంత కాలం నటిగా కొనసాగగలుగుతున్నాను అంటే అది ప్రేక్షకుల అభిమానం. రెండవ కారణం నా పాత్రల ఎంపిక. ఈరోజుకీ పాత్రల ఎంపికలో చాలా జాగ్రత్తగా ఉంటాను. ఇదేదో నేను గొప్పగా చెప్పడం లేదు. నా పద్ధతి ఇది అని చెబుతున్నాను అంతే!

**మీతో సినిమా చేయాలంటే అజయ్ దేవగన్ అంగీకారం కావాలంటారు. నిజమేనా?**

చెప్పానుగా... నేను భర్త చాటు భార్యగా ఉండడానికే ఎక్కువ ఇష్టపడతాను. అనవసరమైన వివాదాల్లోకి వెళ్లడం నాకు ఇష్టం ఉండదు. కొందరికి అజయ్‌తో వివాదాలు ఉండొచ్చు. అవి పరిష్కరించుకోకుండా నాతో సినిమా అంటే కష్టమే! అలాంటి వారికి ముందు ఆ వివాదాలు తీర్చుకుని ఆ తరువాత తీరిగ్గా రండి, మాట్లాడుకుందామని చెబుతాను. అంతే తప్ప నేను చేసే సినిమాలకు అజయ్ పర్మిషన్ అక్కర్లేదు.

**సీనియర్ హీరోయిన్లు రొమాంటిక్ సీన్లు చేయడం సబబేనా?**

ప్రేక్షకుల అభిరుచిలో మార్పు వస్తోంది. వారి ఆలోచనలూ మారుతున్నాయి. దానికనుగుణంగానే సినిమాలూ తీస్తున్నారు. రొమాంటిక్ సీన్లు చేసే సమయంలో నటీనటులిద్దరిలోనూ పరిణతి అవసరం అని నా అభిప్రాయం. నా వరకూ అలాంటి పాత్ర వస్తే అవతలి వ్యక్తి ఎలాంటి నటుడు? అన్నది చూస్తాను. సన్నివేశపరంగా అతనిలో అంత పరిణతి ఉందా అని ఆలోచిస్తాను. అన్నీ కుదిరితే నా మటుకు నాకు అలాంటి సన్నివేశాలు చేయడానికి



ఎలాంటి అభ్యంతరం లేదు. అలాగే పాత్రలో కొత్తదనం ఉండాలి. రొటీన్ పాత్రలు చేయవలసిన అవసరం లేదు.

**ఆంధ్రప్రదేశ్ పర్యాటక శాఖ ప్రచారకర్తగా ఎలాంటి కార్యక్రమాలు చేపడుతున్నారు?**

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో అద్భుతమైన పర్యాటక ప్రదేశాలున్నాయి. వాటి గురించి చాలామందికి తెలియదు. వాటిని దేశంలో అందరికీ తెలియజేయాలన్నదే నా ఉద్దేశం. త్వరలోనే దేశవ్యాప్త ప్రచారం చేయాలని అనుకుంటున్నాం. ఇందుకోసం నేనూ, అజయ్ దేవగన్ కలిసి ఓ ప్రణాళిక సిద్ధం చేస్తున్నాం.

**సొంతంగా నిర్మాణ సంస్థను ఏర్పాటు చేసే ఉద్దేశం ఉందా?**

నా భర్త అజయ్ దేవగన్‌కు నిర్మాణ సంస్థ ఉంది. దానిని కాదని నేను మరో కొత్త సంస్థను ఏర్పాటు చేయాలని అనుకోవడం లేదు. పేరుకి అజయ్ నిర్మాత అయినా దాని కార్యక్రమాలు ఎక్కువగా నేనే చూస్తుంటాను. మా నిర్మాణంలో మరిన్ని మంచి సినిమాలు రావాలన్నదే నా ఉద్దేశం, కోరిక కూడా!

**ఇటీవలి కాలంలో మీ నిర్మాణ సంస్థ నుంచి వచ్చిన సినిమాలు నిరాశపరిచినట్టు ఉన్నాయి?**

తీసిన ప్రతి సినిమా బ్లాక్‌బస్టర్ కావాలన్న రూలేం లేదుగా! ప్రేక్షకుల అభిరుచిలో ఎప్పటికప్పుడు మార్పు వస్తోంది. కొత్తదనానికి పెద్ద పీట వేస్తున్నారు. వారి నాడి పట్టుకోవడంలో కొన్నిసార్లు మేం విఫలం అయిన మాట నిజమే కానీ, కొన్ని సినిమాలు భారీ విజయాలు సాధించాయి కూడా! ఇక నుంచి ప్రేక్షకులు మెచ్చిన సినిమాలు తీయడానికే ప్రయత్నిస్తాం.

**మీ పిల్లలు కూడా సినిమాల్లోకి వచ్చే అవకాశం ఉందా?**

చెప్పలేను. బాబుకి ఆ కోరిక ఉంది. అయినా ముందు బాగా చదువుకోమని వారికి చెబుతుంటాను. నటన కొంతకాలానికే పరిమితం అవుతుంది. చదువు జీవితాంతం మన వెంట ఉంటుంది. నా వరకైతే పిల్లలు బాగా చదువుకుని స్థిరపడాలని ఉంది. వారి ఆలోచనలు ఎలా ఉన్నాయో చెప్పలేం కదా!

**సంప్రదాయ దుస్తులంటే ఇష్టమా? మోడ్రన్ డ్రస్సులంటే ఇష్టమా?**

సంప్రదాయ దుస్తులంటేనే ఎక్కువ ఇష్టం. అవకాశం దొరికినప్పుడల్లా చీర కట్టడానికే ఇష్టపడతాను. మోడ్రన్ డ్రస్సులు సౌకర్యంగా ఉంటాయంటారు కానీ నాకు చీరలే సౌకర్యంగా ఉంటాయి.

–స్పందన రెడ్డి

# కార్టూనిజం

## హాబీగానే మిగిలిపోయింది

**-కామేష్**

**ప్రముఖ కార్టూనిస్టు కామేష్. నాలుగు దశాబ్దాలుగా కార్టూన్‌కళతో తెలుగు పాఠకులను అలరిస్తున్నారు. పాఠకులను నవ్వించి ఒత్తిడిని తొలగించడమే కాదు, కార్టూన్లు సామాజిక ప్రయోజనాల్ని కూడా నెరవేరుస్తున్నాయనీ, తెలుగునాట ప్రతి కార్టూనిస్టూ అంతో ఇంతో సామాజిక బాధ్యత వహిస్తున్నప్పటికీ కార్టూ'నిజం' ఒక హాబీగానే మిగిలిపోయిందనీ అంటున్న కామేష్ ఇంటర్వ్యూ...**

మాది విశాఖపట్నం. మా నాన్నగారు పేరి రామకృష్ణమూర్తి. అమ్మ సుందరం. వృత్తిరీత్యా నాన్నగారు విజయనగరంలో ఉండేవారు. 1958లో జూన్ 29న శ్రీకాకుళంలో మాతామహుల ఇంట పుట్టాను. నా పూర్తిపేరు పేరి సూర్యకామేశ్వరరావు. కలం పేరు కామేష్. నాకు ఒక తమ్ముడు, చెల్లెలు. నాలుగో తరగతివరకు నా చదువంతా విజయనగరంలోనే. నాన్నగారు హైదరాబాద్ వచ్చాక డిగ్రీవరకు చదువు అక్కడే పూర్తిచేశాను.

### కార్టూన్ అభిరుచికి బాల్యంలోనే పునాదులు

ఐదారేళ్ళ వయసులో సెలవులకు అమ్మమ్మగారి ఇంటికెళ్ళేవాళ్ళం. అక్కడ ఒకాయన గాజు పలకలపై సినిమా స్లైడ్లు గీస్తూ ఉండేవాడు. నేను ఎంతో ఆసక్తిగా గమనించేవాణ్ణి. 8, 9 తరగతుల్లో నా స్నేహితుడు ప్రసాద్ బొమ్మలు గీసేటప్పుడు శ్రద్ధగా చూసేవాణ్ణి. నాకు కూడా బొమ్మలు గీయాలనిపించింది. చందమామ, బుజ్జాయి పుస్తకాలు నెలనెలా కొనుక్కునేవాణ్ణి. మా ఇంటికి అన్ని వార, మాస పత్రికలూ వచ్చేవి. అవన్నీ చదువుతూ వాటిల్లో బొమ్మలు, కార్టూన్లు గమనించేవాణ్ణి. బాపుగారి బొమ్మల్ని యథాతథంగా కాగితంమీద తిరిగి గీసేవాణ్ణి. బుజ్జాయి, బాపు, సత్యమూర్తివంటివారు కథలకు గీసిన బొమ్మల్ని చూసి రీప్రొడ్యూస్ చేసేవాణ్ణి.

### హాస్పిటల్ బెడ్‌మీద కార్టూన్ కళ సాధన

డిగ్రీ చదివే సమయంలో అనారోగ్యంవల్ల మూడు నెలలు హాస్పిటల్‌లో ఉండాల్సివచ్చింది. నా కాలక్షేపానికి నాన్నగారు పేపర్లు, వార, మాసపత్రికలు తెచ్చేవారు. కార్టూన్లు గీసుకోవడానికి నా స్నేహితుడు వెంకటేష్‌వార్తకవి ఇండియన్‌ఇంక్, నిబ్, డ్రాయింగ్ షీట్లు తెచ్చి ఇచ్చాడు. ప్రముఖ దినపత్రికల్లో వచ్చే పాకెట్ కార్టూన్లు ముఖ్యంగా వెంకట్ గీసిన పాకెట్ కార్టూన్లు చూస్తూ అదేసైజులో తిరిగి గీసేవాణ్ణి. అలా హాస్పిటల్ బెడ్‌మీదే కార్టూన్లు గియ్యడం అభ్యాసం చేశాను.

### క్రోక్విల్ అకాడమీ

ఇంటికి తిరిగివచ్చాక కూడా కార్టూన్లమీద దృష్టి కేంద్రీకరించి, ప్రత్యేకంగా సమయం వెచ్చించేవాణ్ణి. తెలుగు కార్టూనిస్టు అసోసియేషన్ క్రోక్విల్ అకాడమీలో చేరి తోటివారితో కలిసి కార్టూన్లు గీస్తూ మెళకువలు నేర్చుకున్నాను. శంకు, చంద్ర, రామకృష్ణ లాంటి కార్టూనిస్టులు ఎన్నో సలహాలు చెప్పేవారు. ప్రముఖ కార్టూనిస్ట్ జయదేవ్‌గారు లేఖలద్వారా సలహాలు ఇచ్చేవారు. వారి మార్గదర్శకత్వం పొందే భాగ్యం నాకు కలిగింది. క్రోక్విల్ ఆకాడమీ సెమినార్లలో అనుభవజ్ఞులైన కార్టూనిస్టులు మెళకువలు నేర్పేవారు. ఎన్నో సలహాలు ఇచ్చేవారు.

**ఇంటర్వ్యూ**

### తొలి కార్టూన్

మెల్లిగా వార, మాసపత్రికలకు కార్టూన్లుగీసి పంపేవాణ్ణి. 1977 మార్చి 5న సినీహెరాల్డ్ పత్రికలో నా మొదటి కార్టూన్ ప్రచురితమైంది. ఆరోజు నాకు పట్టరాని సంతోషం కలిగింది. తర్వాత రెండు నెలలకు ఆంధ్రజ్యోతి వీక్లీలో నా మొదటి 'కేప్షన్‌లెస్ కార్టూన్' వచ్చింది. తర్వాత కార్టూన్ల పోటీల్లో పాల్గొంటూ ఎన్నో బహుమతులు గెలుచుకున్నాను. నా తొలి కార్టూన్‌కు అయిదు రూపాయలు పారితోషికం అందుకున్నాను. అది నాకెంతో అపురూపం.

### అమెరికా కార్టూనిస్ట్ స్ఫూర్తి

అమెరికా కార్టూనిస్ట్ SERGIO ARROGONES (సెర్జియో ఆరగోన్స్) కేప్షన్‌లెస్ కార్టూన్లకు ప్రసిద్ధి. ఆయనే నాకు స్ఫూర్తి. ఆయన MAD Magazineలో కార్టూన్లు వేస్తారు. ఆ పాత పుస్తకాలు సేకరించి నా అభిరుచి మేరకు నేను ఆయన నుంచి స్ఫూర్తి పొందాను. సమకాలీన సంఘటనలు, హృదయాన్ని కదిలించే సంఘటనలపైనా స్పందించి కార్టూన్లు గీస్తాను.

### ప్రత్యేక శైలి

జయదేవ్‌గారు, మల్లిక్‌గార్లు వేసిన కార్టూన్లు

పరిశీలిస్తూ నాకంటూ ఓ ప్రత్యేక శైలి అలవర్చుకుని పాఠకుల గుర్తింపు పొందాను. 2012–15లో సామాజిక సమస్యలపై నేను గీసిన కార్టూన్లు పాఠకుల ప్రశంసలు పొందాయి. కార్టూన్లలో రెండే రకాలున్నాయి. ఒకటి వ్యాఖ్యసహిత కార్టూన్లు, రెండు వ్యాఖ్యరహిత (కేప్షన్‌లెస్) కార్టూన్లు. ఈ కేప్షన్‌లెస్ కార్టూన్లు తక్కువే. వీటిని గీయడం కష్టమైన పని. కేప్షన్‌లెస్ కార్టూన్‌ను చూడగానే మనకు అర్థం కావాలి. ఆ సన్నివేశం మనకు నవ్వు రప్పించేలా ఉండాలి. తెలుగునాట తలిశెట్టి రామారావు, బాపూ తర్వాత జయదేవ్, చంద్ర, శంకు, రామకృష్ణ, సరసి లాంటివారు ఇలాంటి కార్టూన్లు గీస్తున్నారు.

### హాబీగానే

బీకాం పూర్తయ్యాక 1979లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో క్లర్క్ ఉద్యోగంలో చేరాను. ఉద్యోగం చేస్తూ ఖాళీ సమయాల్లో కార్టూన్లు గీసేవాణ్ణి. కార్టూన్ కళను నేను కేవలం హాబీగానే కొనసాగించాను. కానీ కార్టూనంటే నాకెంతో మమకారం. ప్రేమ. కార్టూన్ గీయడంలో నేనెంతో ఆనందం పొందుతాను.

### పదివేల కార్టూన్లు, కామెడీ కథలు

2017 మార్చినాటికి కార్టూనిస్టుగా నాలుగుదశాబ్దాల జీవితం పూర్తిచేశాను. 2016 జూన్‌లో అసిస్టెంట్ రిజిస్ట్రార్ హోదాలో పదవీవిరమణ చేశాను. రిటైరయ్యాక పూర్తిసమయం కార్టూన్‌కళకే అంకితం చేశాను. ఇప్పటికీ కార్టూనిస్ట్‌గా పాఠకాదరణ పొందుతున్నాను. ఇప్పటివరకు పదివేలకు పైగా కార్టూన్లు గీశాను. ప్రముఖ డైలీ, వార, మాస పత్రికల్లో నా కార్టూన్లు ప్రచురితమయ్యాయి. అడపాదడపా కామెడీ కథలు రాశాను. ఇప్పటివరకు 12 కథలు ప్రచురితమయ్యాయి. సంతకం లేకపోయినా 'ఇది కామేష్ కార్టూన్' అని పాఠకులు గుర్తుపట్టే స్థాయికి ఎదిగాను. ప్రధానంగా డాక్టర్, పోలీస్, ట్రాఫిక్ కానిస్టేబుల్, రాజకీయనేతలు, సినిమాలు సహా సకల జీవనవృత్తులు, సంసారంలో సరిగమల కార్టూన్లు గీశాను. సరసి, రామకృష్ణ, జయదేవ్, లేపాక్షి, బాచివంటి మిత్రుల సహాయంతో ఈ రంగంలో కృషి చేస్తున్నాను. పాఠకులు మెచ్చిన, నచ్చిన నా కార్టూన్లను పుస్తకంగా తీసుకొస్తున్నాను.

### సామాజిక ప్రయోజనం

కార్టూన్ కళ సామాజిక ప్రయోజనాలు కూడా నెరవేరుస్తుంది. 2013లో ఒక ప్రైవేటుసంస్థ వారు వరకట్నంపై కార్టూన్లు పంపమన్నారు. సుమారు 100 మంది గీసిన కార్టూన్లను వారొక పుస్తకంగా తెచ్చారు. ఆ కార్టూన్లు పాఠకుల్లో నవ్వులు పూయించడమే కాదు, ఈ దురాచారంపై ఆలోచనలు రేకెత్తించాయి. సామాజిక సమస్యలను కార్టూనిస్టులు నిత్యం హాస్యస్ఫోరకంగా హైలైట్ చేస్తూనే ఉన్నారు. స్మోకింగ్‌మీద జయదేవ్ గీసిన కార్టూన్లు దేశవిదేశీయుల మెప్పుపొందాయి. ప్రతి కార్టూనిస్టూ తన కార్టూన్లద్వారా అంతో ఇంతో సామాజిక బాధ్యత వహిస్తున్నాడు.

యాంత్రిక జీవితంలో ఉన్నవారు మ్యాగజైన్స్‌లో కార్టూన్లు చూసి కడుపారా నవ్వి, ఒత్తిడి పోగొట్టుకుంటున్నారు. మనలోని ఒత్తిడిని సింపుల్‌గా తొలగించేంత శక్తి పేజీలో ఎక్కడో ఓ మూల దాగున్న కార్టూన్‌కే ఉంటుంది.

### కార్టూనిజం వృత్తిగా లేదు

70వ దశకంలో పత్రికలు చాలా ఎక్కువగా ఉండేవి. కార్టూనిస్టులకు ఎంతో ప్రోత్సాహం ఉండేది. కార్టూనిస్టుల సంఖ్య కూడా చాలా ఎక్కువగా ఉండేది. కార్టూనిస్టులు దిన, వార, మాస పత్రికల్లో పోటాపోటీగా కార్టూన్లు గీసేవారు. ఎలక్ట్రానిక్ మీడియా రాకతో పుస్తకాలు చదివేవారు తగ్గారు. దాంతో చాలా పత్రికలు మూతపడ్డాయి. కానీ గడిచిన మూడేళ్ళుగా కార్టూనిస్టులకు ఆదరణ ఇంకా బాగా పెరిగింది. పాఠకులు కార్టూన్లు చూసి ఆనందిస్తూ, తమ అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు. కొన్ని పత్రికలు గౌరవప్రదమైన రెమ్యునరేషన్లు ఇస్తున్నాయి. కొందరు కార్టూనిస్టులు దినపత్రికల్లో చేరి కార్టూనిస్టులుగా వృత్తి కొనసాగిస్తున్నారు. పత్రికలలో పనిచేసే కొందరు తప్ప చాలామంది కార్టూన్ కళను హాబీగానే తీసుకుంటారు. చిన్నపాటితో షికాలవల్ల ఈ కళను జీవనోపాధిగా చేసుకోవడం కష్టం. అందుకే ఇది చాలామందికి హాబీగానే ఉండిపోయింది. విదేశాలతో పోల్చి చూస్తే మన దేశంలో ప్రోత్సాహం తక్కువే. అయితే ఆర్కే లక్ష్మణ్, అజిత్ మీనన్, అబూఅబ్రహాం, ఊమెన్ లాంటి ప్రొఫెషనల్ కార్టూనిస్టులు దేశ ప్రజలకు చేరువై కార్టూన్ కళకు గొప్ప వన్నె తెచ్చారు.

### టెక్నాలజీతో అద్భుతాలు

మన ఊహలకు వేళ్ళతో కాగితం మీద ప్రాణ ప్రతిష్ఠ చేయడమే కార్టూన్ కళ. చెయ్యి తిరిగినవారే అలా ప్రాణ ప్రతిష్ఠ చేయగలరు. కొంచెం నేర్పు ఉంటే చాలు కార్టూనిస్టులు కంప్యూటర్ ద్వారా మిరకిల్స్ చేస్తున్నారిప్పుడు. ఆనాడు కార్టూన్లన్నీ మాన్యువల్‌గానే గీసేవారు. ఇప్పుడు కొత్త టెక్నాలజీని అందుబాటులోకి తీసుకున్న కార్టూనిస్టులు వారికున్న కొద్దిపాటి అనుభవంతో ఆ టెక్నాలజీని మేళవించి అద్భుతాలు సృష్టిస్తున్నారు. అందువల్ల ఇప్పుడు కార్టూన్లు గీయడం చాలా సులువైంది. కార్టూన్లకు రంగులు దిద్దే సౌలభ్యం ఉండటంవల్ల ఇప్పుడు పాఠక జనాకర్షణ బాగా ఉంది. 21వ శతాబ్దంలోనే మనకు రంగుల కార్టూన్లు ప్రారంభమయ్యాయి. పాత కార్టూనిస్టులు కూడా టెక్నాలజీని అడాప్ట్ చేసుకుంటున్నారు.

తెలుగు రాష్ట్రాల్లో ఇప్పుడు సుమారు 1500 మంది పాత కొత్త కార్టూనిస్టులు ఉంటారు. వీరిలో యాక్టివ్ కార్టూనిస్టులు 250 మంది వరకు ఉంటారు. కొందరు యానిమేషన్ చేస్తున్నారు.

### కార్టూన్‌కు, జోక్‌కు తేడా గుర్తించాలి

కార్టూన్‌కు జోక్‌కు ఉన్న స్పష్టమైన తేడా గమనించి ఔత్సాహికులు కార్టూన్లు గియ్యాలి. కార్టూన్‌లో బొమ్మను మూసేసి వ్యాఖ్య ఒక్కటే చదివినంత మాత్రాన కార్టూన్‌లో ఉండే పంచ్ అర్థమైపోకూడదు. బొమ్మ, వ్యాఖ్య రెండూ కలిపి చూసినపుడే పాఠకుడిలో నవ్వు వెల్లివిరియాలి. వ్యాఖ్య చదివాక ఇక బొమ్మ చూడాల్సిన అవసరం లేదని పాఠకుడు భావిస్తే అది జోక్ అవుతుంది తప్ప కార్టూన్ అనిపించుకోదని ఔత్సాహికులు గమనించాలి.


కుటుంబసభ్యులతో


కార్టూనిస్ట్ మిత్రులతో

### కుటుంబం

1984లో నా వివాహం జరిగింది. నా భార్య పేరు శైలజ. మాకు ఒక అబ్బాయి, ఒక అమ్మాయి. అబ్బాయి శ్రీకాంత్ బెంగళూరులో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. కోడలు హరిత మద్రాసు ఐఐటిలో పిహెచ్‌డి చేస్తోంది. అమ్మాయి శ్రావ్య. సాఫ్ట్‌వేర్ ఉద్యోగి. అల్లుడు చైతన్యకుమార్. ఈ మధ్యనే వివాహం చేశాను.

### మరచిపోలేని సంఘటన

1982లో ఆసియా క్రీడోత్సవాలలో క్రోక్విల్ అకాడమీ నిర్వహించిన కార్టూన్ పోటీల్లో నాకు నాలుగు కేటగిరీలలో బహుమతులు లభించాయి. ప్రముఖ నటుడు జె.వి.సోమయాజులు చేతుల మీదుగా నేను బహుమతులు అందుకోవడం నా జీవితంలో మరపురాని సంఘటన.

–రామ్మోహన్



# నూరుకట్ల పిశాచం కథలు ⑪

-వసుంధర

**ఒక ఊరులో లక్ష్మీపతి అనే చిల్లరకొట్టు వ్యాపారి ఉండేవాడు. అతడికి వ్యాపారంలో లక్షలు ఆర్జించి మేడలు కట్టాలని ఆశ ఉండేది. ఒకసారి ఆ ఊరికి బాగా పేరున్న సాధువు వచ్చాడు. లక్ష్మీపతి ఆయన దగ్గరకువెళ్ళి "స్వామీ, నేను వ్యాపారంలో బాగా లాభాలు సంపాదించాలంటే ఏం చేయాలి?" అని అడిగాడు.**

**"దేనికైనా దైవం సానుకూలపడాలి. నీకు తెలిసిన దేవుళ్లందర్నీ ప్రార్థించుకుని, వ్యాపారం చెయ్యి. నీకు మేలు జరుగుతుంది. నీ కోరిక తప్పక సిద్ధిస్తుంది" అన్నాడు సాధువు.**

## దేవుళ్ళ కాపలా

లక్ష్మీపతి అలాగే చేయడం ప్రారంభించాడు. అప్పటినుంచీ అతడికి వ్యాపారంలో కలిసిరావడం మొదలైంది. కొన్ని సంవత్సరాలు గడిచేసరికి లక్ష్మీపతి ఇల్లు ధనధాన్యాలతో, భోగభాగ్యాలతో, సిరిసంపదలతో, పిల్లాపాపలతో కళకళలాడసాగింది. అయితే, లక్ష్మీపతికిమాత్రం సుఖసంతోషాలులేవు. తన సంపదను ఇతరులు దోచుకుపోతారని అనుక్షణం బెంగపడేవాడు. ఆయన ఇంటికి బలమైనకాపలా కూడా ఉంది. కానీ లక్ష్మీపతి కాపలావాళ్లను కూడా నమ్మలేకపోయేవాడు. వాళ్ళు తనను మోసగిస్తారని ఆయన అనుమానం. ఈ మనస్తాపం భరించలేక ఒకరోజు లక్ష్మీపతి మళ్లీ సాధువుదగ్గరకి వెళ్ళాడు. ఆయనకు తన మనసులోని బాధ చెప్పుకున్నాడు. "డబ్బున్నవాడు పిలిస్తే దేవుళ్ళు పలుకుతారు. నువ్వు దేవుళ్ళనే నీ ఇంటికి కాపలాగాపెట్టుకోవచ్చు. అందుకు ఇదివరకటిలాగే నీ ఇష్టదైవాల్ని ప్రార్థించుకుని ప్రసన్నుల్ని చేసుకో" అని సాధువు లక్ష్మీపతికి సలహా ఇచ్చాడు.

లక్ష్మీపతి వెంటనే కోదండరాముడి గుడికివెళ్ళి శ్రీరాముడిముందు రెండుచేతులూ జోడించి తన కోరిక చెప్పుకున్నాడు. అప్పుడతడికి శ్రీరాముడు ప్రత్యక్షమై, "ఈ రోజునుంచి, నా నమ్మిన బంటు ఆంజనేయుడు నీ ఇంటికి కాపలాగా ఉంటాడు" అని చెప్పి మాయమయ్యాడు.

లక్ష్మీపతి సంతోషంగా ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ రోజునుంచీ ఆంజనేయస్వామి లక్ష్మీపతి ఇంటికి కాపలాగా ఉంటున్నాడు. అప్పట్నించీ లక్ష్మీపతి రాత్రుళ్ళు సుఖంగా నిద్రపోతున్నాడు. అలా అతడి మనసుకి సుఖశాంతులు లభించాయి. అలా కొన్నాళ్ళు గడిచాయి. ఈలోగా, ఒక దొంగవాడి కన్ను లక్ష్మీపతి ఇంటిమీద పడింది. ఆ ఇల్లొక్కటి కొల్లగొడితే, తరతరాలపాటు, తనూ, తన కుటుంబం హాయిగా జీవించవచ్చునని వాడికి అనిపించింది. అందుకు దొంగ దురాలోచనతో పథకం వేశాడు. ముందుగా లక్ష్మీపతి ఇంటి కాపలావాళ్ళకు లంచంపెట్టి, బహుమతులిచ్చి, నెమ్మదిగా మచ్చికచేసుకున్నాడు. తర్వాత వాళ్ళనే అడిగి ఆ ఇంటి ఆయువుపట్లన్నీ తెలుసుకున్నాడు. తర్వాత ఒక మంచిరోజు చూసుకుని దొంగతనానికి ఆ ఇంట్లో ప్రవేశించాడు.

కాపలావాళ్ళల్లో ఒక్కరుకూడా దొంగని అటకాయించలేదు. ఇంట్లోవాళ్ళంతా గాఢనిద్రలో ఉన్నారు. ఆ పరిస్థితిచూసిన దొంగ తన అదృష్టానికి సంబరపడ్డాడు. నెమ్మదిగా లక్ష్మీపతి డబ్బును దాచిన గదిలోకి ప్రవేశించబోయాడు. అయితే ఊహించని విధంగా గుమ్మంలోనే వాణ్ణి ఆంజనేయుడు అటకాయించి నిలిపేశాడు. ఆంజనేయుణ్ణి చూస్తూనే దొంగకు గుండెలు అవిసిపోయాయి. అయితే, ఆంజనేయుడు వాణ్ణి ఏమీ చేయలేదు. ముందుకు రాబోతుంటే మాత్రం గద ఎత్తి హెచ్చరిస్తున్నాడు.

అంత కష్టపడి లోపలకివచ్చాక, వెనక్కుపోవడం దొంగకు ఇష్టంలేదు. అయితే, అతడు గదిలోకి వెళ్ళాలనుకున్నప్పుడల్లా ఆంజనేయుడు హూంకరిస్తున్నాడు. దొంగకిక ఏ దారీ తోచలేదు. వాడు దిగులుగా ముఖంపెట్టి, "శ్రీరామచంద్రప్రభో, నాకు ఇప్పుడేది దారి?" అన్నాడు నెమ్మదిగా. ఆంజనేయుడు ఆ మాటలు విన్నాడు. వెంటనే ఎత్తిన గద క్రిందకు దించాడు. దొంగను ఆశ్చర్యంగా చూసి, "ఏమిటీ, నువ్వు శ్రీరామభక్తుడివా?" అన్నాడు. ఈ గండం గడిచేది ఎలాగా అని బెంగపడుతున్న దొంగకు, ఏదో దారి కనిపించినట్లయింది. వాడు ఆంజనేయుడితో, "నేను శ్రీరామభక్తుడినా అని నెమ్మదిగా అడుగుతున్నారా స్వామీ? ప్రభువు శ్రీరామచంద్రుడి ఆజ్ఞ లేనిదే నేను పచ్చిమంచినీరైనా ముట్టను. ఇప్పుడీ ఇంట దొంగతనానికి కూడా ఆయన ఆజ్ఞ తీసుకునే వచ్చాను" అన్నాడు ఉత్సాహంగా.

ఆంజనేయుడికి ఆ మాటలు నిజమనిపించాయి. దొంగవంక ప్రసన్నవదనంతో చూసి, "శ్రీరామభక్తుల కార్యానికి నేను విఘ్నం కలిగించను. నీకు జయం కలుగుతుంది వెళ్ళు" అని ఆశీర్వదించాడు. దొంగ వెంటనే ఆంజనేయుడి పాదాలకి సాష్టాంగపడ్డాడు. తర్వాత డబ్బున్న గదిలోకి ప్రవేశించాడు. అక్కడ వెదికి వెదికి తాను మోయగలిగినంత డబ్బు తీసుకుని సంతోషంగా వెళ్ళిపోయాడు.

రోజూ నిద్రలేవగానే డబ్బున్న గదిలోకివెళ్ళి చూసుకోవడం లక్ష్మీపతి అలవాటు. మరుసటి దినం



